# నూతన సోవియెట్ సామ్రాజ్యం

డేవిడ్ జె. డాలిన్

PRINTED AND PUBLISHED BY
THE DIOCESAN PRESS, MADRAS
1953

# విషయసూచిక

# సోవియట్ సామ్రాజ్యం—పెరుగుదల

సోవియట్ సామ్రాజ్యంయొక్క పుట్టుక, సామ్రాజ్యవాదం గూడు కట్టుకొన్న తక్కిన దేశాల... అనగా జపాను, జర్మనీ, ఇటలీ, బ్రిటన్, ఫ్రాన్స్, నెదర్లాండ్స్... యొక్క పాక్షిక విచ్ఛిత్తి, లేదా వినాశం ఏక కాలమందే సంభవించాయి.

1930-వ సంవత్సరం, దరిదాపుల వరకు, సోవియట్ రాజ్యాన్ని, సామ్రాజ్యంగా పేర్కొనడానికి వీలులేదు. ఆంతరంగిక వ్యవహారాలలో మునిగి తేలుతూ ఉండడంవల్ల, అది సామ్రాజ్యాన్ని నిర్మించుకోవాలనే ప్రయత్నాలేవైనా చేసినట్లుగాని, రాజ్యాలను జయించాలనే కుతూహలం ప్రదర్శించినట్లుగాని, చెప్పడానికేపీ నిదర్శనాలు కనుపించవు. సిద్ధాంతాలలోనూ, సామ్రాజ్య వ్యతిరేక తత్త్వంలోనూ మాత్రమే దాని భావికార్య యత్నాల ఛాయలు గోచరించేవి. 1939-వ సంవత్సరంనుండి, ముఖ్యంగా 1944-వ సంవత్సరం లగాయతు, సోవియట్ యూనియన్ పూర్వార్ధ గోళంలో ఒక క్రొత్త సామ్రాజ్యంగా రూపొందడానికి కృషిచేస్తూ వచ్చింది. సామ్రాజ్యమంటే, ఒక మహా శక్తిమంతమైన దేశంచేత నిర్బంధంగా ఒకటిగా కూర్చబడిన వివిధ దేశాల సమ్మేళనమన్న మాట. సర్వ విధములైన జిత్తులు, పన్నుగడలు, ఒత్తిడి, సాయుధశక్తి ఇవన్నీ, సామ్రాజ్య నిర్మాణ విధానంలో ఇమిడియున్న శక్తులు.

ఆదిలో, సోవియట్ రాజ్యమే, సామ్రాజ్యాల వినాశానికి నైమిత్తికంగా వుండినది. సామ్రాజ్య వాదాన్ని ఎదిరించడంలో ఏ యితర రాజ్యాలకంటె, ఎక్కువగా ఉధృతమైన ఉద్యమాన్ని నడిపింది, కూడా. ఇపుడు పరిస్థితులు, మారి ఎప్పుడైతే సామ్రాజ్య నిర్మాణానికి రాచబాట ఏర్పడిందో అపుడు, స్టాలిన్ ప్రభుత్వం 1917-వ సంవత్సరంలో అవాంతరమేర్పడి నిలచిపోయిన సామ్రాజ్య స్థాపనోద్యమాన్ని కేవలం పునః ప్రారంభించలేకపోయింది. కేవలం పాతపాట పాడలేకపోయింది. పాత కలలను కనలేకపోయింది. విస్తరణకు ఇదివరలో రష్యా అవలంబిస్తూ ఉండిన పాత మార్గాలను అనుసరించలేకపోయింది.

అనుగతంగా వస్తూన్న సామ్రాజ్యవాదంయొక్క లక్ష్యం రాజ్య విస్తరణే గదా! దాని చరమలక్ష్యం సామ్రాజ్య స్వరూపంయొక్క గొప్పతనాన్ని నిరూపించడం. మూర్తీభవించిన ఈ గొప్పతనమే, జార్జి రాజు, లేదా జార్ చక్రవర్తి, సైనిక విజయం క్రొత్త ప్రాంతాలను ఆక్రమించుకోవడానికి దారి తీస్తుంది. ఒక మహాయుద్ధంలో సంపాదించే ఘనవిజయం, విజేత, తన రాజ్యాన్ని గొప్పగా విస్తరించడంతో ముగుస్తుంది. విదేశాక్రమణ విజేతకు నిర్వివాదంగా సంక్రమించే హక్కు. ఇది సుస్పష్టమైన సిద్ధాంతం. సామ్రాజ్య వ్యతిరేకవాదాన్ని ఒక సిద్ధాంతంగా ఏర్పరచుకొన్న రష్యా వంటి దేశంలో; "సామ్రాజ్యవాదుల దోపిడీ విధానానికి వ్యతిరేకంగా తాను గావించే పోరాటంలో" ప్రపంచమంతటా సానుభూతిపరులైన అనుచరులను సంపాదించుకొన్న

రష్యాలో; రాజకీయ మహా సముద్రాలలో పెట్టుబడి దారులనే రక్కసుల బాధనుంచి నలన దేశాలకు విముక్తి కలిగించాలనీ, దేశాలన్నిటికీ స్వాతంత్ర్యం సాధించాలనీ వాదించే రష్యాలో; విదేశాలలో, ప్రత్యేకించి, పర్షియా, చైనా దేశాలలో, రష్యాకు ఉండిన సామ్రాజ్యాధికారాలను త్యజించుటతో ప్రపంచానికి నీతిపాఠం జెప్పాలని ప్రయత్నించిన రష్యాలో ఈ విధమైన పద్ధతి సాధ్యపడదు.

అయినప్పటికి, ఇపుడు, ద్వితీయ ప్రపంచ సంగ్రామానంతరం, యుద్ధపురోజుల్లో రష్యన్ విజేతలను ప్రోత్సాహపరుస్తూ వచ్చిన విస్తరణ కాంక్ష తిరిగి ప్రజ్వరిల్లి వారి యత్నాలను ప్రాక్ పశ్చిమ, దక్షిణ దిశలకు మళ్లించింది. రాజ్యాలు జయించాలనే ఈ ఆజన్మకాంక్ష నానా రీతుల విస్తరించి పోవాలనే ఈ అసంబద్ధమైన కోర్కె, యుద్ధచర్యల నుండి తిరిగి తలయెత్తిన పరమఫలం—ఇక దానితో చూడండి, రాజకీయ బలసంపన్నత సైనిక విజయాలను పురస్కరించుకొని పుట్టిన సంగ్రామేచ్ఛ, మీటనొక్కితే మ్రోగే తత్త్వం.— ఒకటేమిటి, భవిష్యదుద్యమాలను గూర్చిన ఒక విశాల పథకం, క్రొత్త రాజ్యాల సంపాదన, క్రొత్త అధికారం మొదలగునవెన్నో పొడ సూపినవి.

ఈ క్రొత్త రకపు విస్తరణ విధానానికి ఇదివరకటి రష్యా భావన, సాధనాలకూ మూడు విషయాల్లో వ్యత్యాస మున్నది. మొదటిదాని ఉద్దేశాలు విశాలతరమైనవి. పాత రష్యా లక్ష్యాలకంటె ఉన్నతమైనవి. పాత రష్యా లక్ష్యాలు సంకుచితమై ఒక స్వల్ప ప్రతిఫలానికే....ఏదో

టర్కీలో ఫలానా భాగం పోలండ్‌లో ఒక ముక్క, చైనాలో ఒక ప్రాంతం,... ఈ వరసన పరిమితమై ఉండాలి. అయితే ఇప్పటి రష్యా చరమలక్ష్యం అదికాదు—మొత్తం భూగోళాన్ని చుట్టుముట్టి ఆక్రమించుకోవడం దాని గమ్యం. పాత రష్యాను తృప్తిపరచడమంటే అంత కష్టమైన విషయంగా ఉండేది కాదు. శాంతి ఒడంబడికలు సాధించాలంటే, ఇప్పటి రష్యాతో కంటే పూర్వపు రష్యాతోనే సులభతరంగా ఉండేది.

రెండవది: సంప్రదాయ సిద్ధమైన సామ్రాజ్య నిర్మాణం సైనికబలంయొక్క సాహాయ్యంవల్ల సాధింపబడుతూ ఉండేది. ఆక్రమిత ప్రాంతాలను సైనిక స్థావరాలుగా ఉపయోగించుకోవడం జరుగుతూ ఉండేది. ఇప్పటి సోవియట్ సామ్రాజ్య నిర్మాతల పథకం, ప్రజా ఉద్యమాలద్వారా, సామ్రాజ్య విస్తరణ సాగించడం. మనం "పంచమాంగదళం" అని వ్యవహరించే పద్ధతి, సాయుధబలాల ఆక్రమణ చర్యకు బదులు కమ్యూనిష్టులు అవలంబిస్తున్న సాధనాంతరం.

ఇక మూడవది: పూర్వపు రష్యా సామ్రాజ్యంవలెగాక, ఇప్పటి సోవియట్ ప్రభుత్వం తన ఉపగ్రహ రాజ్యాల భూభాగాలను రష్యాలో కలుపుకోకపోవడం, నేటి రష్యా, కాల్పనికంగా ఆ రాజ్యాల సర్వస్వతంత్ర రాజ్యాధికార వ్యవస్థలో జోక్యం పుచ్చుకోనట్లుగాను, ఉపగ్రహ రాజ్యాలను ఆర్థికంగా దోచుకునే ఉద్దేశ్యం తనకు లేనట్లుగాను వ్యవహరిస్తున్నది.

1945-వ సంవత్సరం తరువాతి 5 సంవత్సరాలు, రష్యన్ ప్రభుత్వ దృష్టిలో, పైపైని ఎంతో విజయవంతమైనవిగా ఉండవచ్చు. కాని సోవియట్ సామ్రాజ్య నిర్మాణంలో గడ్డు పరిస్థితి ఏర్పడుటకూడా ఈ అయిదేండ్ల కాలంలోనే. ఈ పరిస్థితికి కారణం, నూతన సామ్రాజ్య విస్తరణ విషయం లోనూ, రష్యా అవలంబించిన పూర్వోదాహృత, లోప భూయిష్ఠ సాధనాలే.

సోవియట్ సామ్రాజ్య నిర్మాణంలోని క్రొత్త పోకడల ఫలితాఫలితాలు ప్రప్రథమంగా యుగోస్లేవియాలో పరీక్షింపబడినవి. సోవియట్ సిద్ధాంతానుగుణంగా యుద్ధానంతరం తొలుదొల్త యుగోస్లేవియానుంచి రష్యన్ సైన్యాలు ఉపసంహరింపబడినవి. యుగోస్లావ్ నాయకులు అధికారంలో ఉన్న కమ్యూనిష్టు పార్టీ యొక్క ఆదర్శప్రాయమైన ప్రవర్తనను ప్రదర్శింపవలసి ఉండినది. క్రెమ్లిన్ యొక్క అధికారాన్ని వారు పెద్దగా గుర్తిస్తారని, యుగోస్లావ్ సోవియట్ సమాఖ్యలయొక్క ప్రత్యేక అక్కరలకు పొసగక పోయినపుడు రష్యన్ అక్కరలకే ప్రాముఖ్య మివ్వాయబడుతుందని, కమ్యూనిస్ట్ జాతులన్నింటికీ మాతృదేశం అయిన రష్యాను పునరుద్ధరించటానికి, బలపరచటానికి యుగోస్లేవియా ఆర్థికంగా సాయపడుతూందని, వాటిని సాధించుటకు సంతోషంగా ఎన్నో త్యాగాలు చేస్తుందని తలంచబడింది.

కాని వాస్తవంగా ఏమి సంభవించినది అందరకు బాగుగా తెలిసిన విషయమే యుగోస్లేవియాను సోవియట్ సేనలు వదలినదే తడవుగా రెండు దేశాల మధ్య బద్ధవైరం ప్రారంభ

మైంది. 1946-వ సంవత్సరంలో అది మరీ ప్రమాదకరంగా పరిణమించింది. 1947 లో టిటోపై కమ్యూనిస్టు అంతర్జాతీయ సంస్థ ఆగ్రహాన్ని ప్రజ్వలింపచేసే నిమిత్తమే ఒక కోమిన్‌ఫారమ్ సృష్టించబడింది. విభేదాలు ఎంత అగాధంగా వున్నవో అనేదానికి యిది తార్కాణము. 194౮ లో సోవియట్ కుటుంబాన్నుంచి యుగోస్లావ్‌లు బహిష్కరింపబడ్డారు. విశ్వాస ఘాతుకమైన ఆ ఉపగ్రహ దేశాన్నుంచి అన్ని సోవియట్ ఆర్థిక, సైనిక సంఘాలు వెంటనే తరలిపోవలసివచ్చింది. సోవియట్ సామ్రాజ్యం ఒక గొప్ప దేశాన్ని గోల్పోయింది. పశ్చిమాన ఇటలీ సరిహద్దువరకు విస్తరించిన దాని పలుకుబడి ఎంతగానో కుదించుకుపోయింది. యూరప్‌పై సోవియట్ దండయాత్ర, కనీసం దక్షిణంగానైనా, నిరోధింపబడింది.

యుగోస్లేవియాలో సంభవించినది రష్యాకు గుణపాఠంగా పనిచేసింది. తక్కిన ఉపగ్రహ దేశాల భక్తివిశ్వాసాలను కట్టుదిట్టం చేయటానికి చర్యలు తీసుకొనవలసిన అవసరాన్ని గురుతుకు తెచ్చింది. సాయుధబల ఆక్రమణకుగాను అవలంబించవలసిన పాత మార్గాలకు తిరోగమించడమే యీ చర్యల ఆంతర్యము. సోవియట్ సామ్రాజ్యవాదంలో వచ్చిన యీ పరిణామంయొక్క ఫలితాలు చవిచూచిన మొదటి దేశం, సోవియట్ వ్యతిరేక లక్షణాలు బలీయంగా ఉన్నట్లు కనిపించిన, పోలెండు దేశం.

1917 కు ముందు పోలెండులో హెచ్చు భాగం వెనుకటి రష్యన్ సామ్రాజ్యానికి చెందివుండెడిది, ఒక రష్యన్

గవర్నర్ జనరలు, అనేక మంది రష్యన్ రాష్ట్రీయ గవర్నర్లు, రష్యన్ అధికారులు దానిని పరిపాలించేవారు. రష్యన్ పటాలాలు కూడా అక్కడ స్థావరంగా ఉండేవి. యుగోస్లేవియాలో టిటో తిరుగబడిన తరువాత సోవియట్ ప్రభుత్వం విప్లవాత్పూర్వపు విధానాలను పోలిన అనేక క్రొత్త చర్యలను పోలెండులో అమలు పరిచింది.

1949 నవంబరులో, రష్యన్ సేనాని మార్షల్ కాన్‌స్టాంటిన్ రుకోసవిస్కీ పోలండు రక్షణ శాఖామాత్యుడుగా నియమింపబడ్డాడు. ఆతని సోవియట్ పౌరసత్వ హక్కు సోవియట్ సమాఖ్య కమ్యూనిష్టు పార్టీ సభ్యత్వం అందుకు అడ్డు రాలేదు. శాసన నిర్మాణానికి, ఆయవ్యయాలను ఆమోదించడానికి విస్తృతాధికారాలు కలిగి ఉన్న పోలెండ్ ఉన్నతోన్నత ప్రభుత్వ సంస్థ స్టేట్ కౌన్సిలులో కూడా ఆతడు సభ్యుడు. పోలెండ్ కమ్యూనిష్టు పార్టీ కేంద్ర సంఘం (యునైటెడ్ వర్కర్స్ పార్టీ)లో కూడా చేర్చుకొనబడి, ఆదిలో అనామతుగా అయినప్పటికి వెంటనే పోలిష్ పోలిట్ బూరోలో సభ్యుడయ్యాడు.

రొకోసవిస్కీ ఉద్యోగ నియామక ప్రకటన, సోవియట్ యూనియన్‌తో సన్నిహిత సంబంధాలను వ్యతిరేకిస్తున్నారని అనుమానింపబడ్డ పోలిష్ కమ్యూనిష్టు నాయకులందరను ప్రభుత్వం నుంచి, సైన్యం నుంచి తొలగించడం, ఏక కాలమందు సంభవించాయి. పోలిష్ కమ్యూనిష్టు పార్టీ సాధారణ కార్యదర్శి, సమర్థుడు, పోలెండ్ యొక్క టిటో

అని గణుతికెక్కిన వ్లాడిస్లావ్ గోముల్కా అలా తొలగింప బడిన వారిలో ప్రథముడు.

పోలెండ్ నూతన రాజ్యాంగ వ్యవస్థ, పాతకాలపు రష్యన్ సామ్రాజ్యవాద వ్యవస్థకు అన్ని విధాల తుల్య మైనదిగానే ఉంది. కాని పోలెండ్ సర్వతంత్ర స్వాతంత్ర్య దేశమని పైకి కనుపింపజేయవలెనని స్టాలిన్ అభిలాషించుట వల్లనే మార్షల్ రుకోవిస్కీ నియామకాన్ని ఒక మినహాయింపు గాను, కేవలం వ్యక్తిగతమైన అద్వితీయ చర్యగాను చిత్రించ వలసివచ్చింది. పోలెండ్ అధ్యక్షుడు బీరట్ సోవియట్ ప్రభుత్వాన్ని "సాధ్యపడినట్లైతే" మార్షల్‌ను "పోలెండ్ అందుబాటులో" వుంచుటకు "అభ్యర్థించి"నట్లు సోవియట్ ప్రభుత్వం రెండు దేశాల మధ్యగల "స్నేహ సంబంధాల దృష్ట్యా" ఆ అభ్యర్థనను ఆదరించుటకు అంగీకరించినట్లు ప్రచారం చేయుబడింది. వాస్తవానికి సామ్రాట్ స్టాలిన్, రష్యన్ సింహాసనాన్ని ఆక్రమించిన అతని పూర్వీకులకన్న పోలెండ్‌పై ఎక్కువ అధికారాన్ని చెలాయిస్తున్నాడు. ఐనప్పటికీ కమ్యూనిష్టు స్టాలిన్ పోలెండ్‌పై రష్యాకు ఎట్టి అధికారాలు లేవని చెప్పాలి.

సోవియట్ ప్రభుత్వం విదేశాలలో జరిపే ఆర్థిక కార్య కలాపాలలో కూడా అట్టి అసందిగ్ధతే సహజసిద్ధంగా ఉన్నట్లు వ్యక్తమౌతుంది. ఈ రంగంలో సోవియట్ కార్యాచరణ విధానానికి, కమ్యూనిష్టు మూలసిద్ధాంత, ప్రచారాలకు మధ్య వైరుధ్యం పెంపొందుతోంది. 1815 లో ప్రారంభ మైన సామ్రాజ్యవాద యుగం 1914 లో అంతరించింది.

దాని ఆసాంతకాలంలో రాజకీయోపయోగాల నిమిత్తం తయారు చేయబడ్డ సామ్రాజ్యవాద సిద్ధాంతాలు, భావాలు ఉజ్వలించాయి. ప్రథమ ప్రపంచ సంగ్రామారంభ కాలంలో లెనిన్ "పెట్టుబడిదారీ విధానంయొక్క ఉచ్ఛ స్థితే సామ్రాజ్యవాదం" అనే పుస్తకం రచించాడు. దానిలో సామ్రాజ్యవాద సిద్ధాంత భావాలలో ఒకదానిని ఉదహరించాడు. ఆ పుస్తకం ప్రాముఖ్యత గణించుకొని కమ్యూనిస్టు సిద్ధాంతాల ఉత్కృష్ట చట్రంలో ఒక భాగంగా తయారైంది. అన్ని సోవియట్ విశ్వకళా పరిషత్‌లలోనూ, విద్యాలయాలలోను అది యింకా పఠించబడుతూనే ఉన్నది. కమ్యూనిస్టేతర రష్యన్‌లు, విదేశాలలోని కమ్యూనిస్టులు దానిలోని విషయాలను క్షుణ్ణంగా తెలుసుకొనవలసి ఉన్నది. ముఖ్యంగా ఐక్య రాజ్య సమితిలోని సోవియట్ ప్రతినిధులు, రష్యా ఉపగ్రహ దేశాల ప్రతినిధులు చేసే సామ్రాజ్యవాద వ్యతిరేక దూషణలు పాశ్చాత్య "యుద్ధోన్మాదుల" పై గర్జనలు అన్నిటికీ అదే ఆధారం.

ప్రపంచ విభజన పారం ముట్టింది. 80 సంవత్సరాల 'దేవుళ్ళాట, విభజనల అనంతరం విభజించుకొనుటకు మరేదీ మిగులలేదు. తరువాత ఏమి సంభవిస్తుంది? ధనికవాద దేశాలు వాటి సామ్రాజ్యాలను విస్తరించుకొనకుండా మానగలవా? పెద్ద వలసలు లేనిదే అవి కొనసాగలేవు. దూర ప్రాంతాలలో అధీన దేశాలు లేకపోయినట్లైతే ధనికవాదం "శిథిలమైపోవ ప్రారంభిస్తుంది, వలసలు, అర్ధ వలసలు, అధీన

దేశాలు ఇదివరలో ముఖ్యంగా వ్యాపారోపయోగాల నిమిత్తమె కాంక్షించబడేవి; యిప్పుడవి ప్రధానంగా మాతృదేశం యొక్క పెద్ద పెట్టుబడులను ఉంచే రంగస్థలాలుగా కోరబడుతున్నాయి. వలసలు, అస్వాతంత్ర్య దేశాలు, లేనిదే ఊపిరాడని ధనికవాదం, వాటిని సంపాదించటానికి బలప్రయోగం ఒక్కటే మార్గమగుటచేత అంతకంతకు కలహాప్రేరేపకంగాను, సంగ్రామోన్మాదిగాను తయారవుతుంది. అందు మూలంగానే అద్యతన భవిష్యత్తులో ప్రపంచ వ్యాప్తంగా ఎన్నో యుద్ధాలు, సాంఘిక విప్లవాలు సంభవింపవచ్చు." అని లెనిన్ విశ్వసించాడు.

అయితే గత శతాబ్దంలో జరిగిన సంఘటనలు సామ్రాజ్య వాదం గురించిన లెనిన్ భావనలోని అసత్యాన్ని నిరూపించాయి. సామ్రాజ్యవాద దేశాల మధ్య "విభజింపబడి", వలసలను, అధీన దేశాలను సంపాదించుకొనుటకు "యుద్ధములే, సామ్రాజ్యవాద యుద్ధములే" సాధనలుగా ఎంచబడిన ప్రపంచంలో ఎన్నో మార్పులు వచ్చాయి. పరాధీన దేశాలు స్వాతంత్ర్యం పొంది పునర్జన్మ లెత్తాయి. అధీన దేశాలతో కూడుకొని ఉన్న ప్రపంచం కుదించుకుపోయింది; ఇంకా ఎక్కువగా సంకుచితమై పోతోంది.

ఇండియా, బర్మా, సిలోన్, పాలస్టైన్ దేశాలను బ్రిటన్ కోల్పోయింది. ఇండొనీషియాను, నెదర్లెండ్స్ పోగొట్టుకుంది. సిరియా, లెబనాన్‌లను ఫ్రాంస్ విడిచి పుచ్చవలసి వచ్చింది. కొరియా, ఫార్మోజా, మంచూరియాలను జపాను,

పోగొట్టుకుంది. కనీసం లిబియా, అబ్సీనియాలను ఇటలీ కోల్పోతోంది. ఫిలిపీన్ దీవులపై తమకుగల హక్కులను అమెరికా సంయుక్త రాష్ట్రాలు వదలుకొన్నాయి. బ్రిటిష్ డొమినియన్లు, వలసలు, ఇంకెంత మాత్రం బ్రిటిష్ అధీన దేశములుగాను, పీడిత దేశములుగాను గణింపబడ వీలు లేనంతగా స్వాతంత్ర్య స్థాయిని అందగలిగాయి.

అగ్ర రాజ్యాలు 11·5 మిలియన్ చదరపు మైళ్ల వైశాల్యంగల అధీన దేశాలను, 5·61 మిలియన్ల జనాభాను కోల్పోయాయి. అగ్రరాజ్యాల మధ్య పోటీలకు, వలస యుద్ధాలకు ఇదివరలో రంగమైన ఆసియా దేశాలు విదేశ ఆధిపత్యంనుండి విముక్తి పొంది వాస్తవమైన స్వాతంత్ర్య దేశములుగా రూపొందాయి. ఆసియా యొక్క 1·2 బిలియన్ల జనాభాలోను 55 మిలియనులు మాత్రమే యింకను పాశ్చాత్య అగ్రరాజ్యాల వలసలలోను, అధీన దేశాలలోను ఉన్నారు. నేటికీ సామ్రాజ్య వాద ప్రాబల్యం క్రింద ఉన్న కడపటి ఖండం ఆఫ్రికా ఒక్కటే. అయితే దాని జనాభా ప్రపంచ జనాభాలో నూటికి అయిదువంతులకు లోపే.

యుద్ధానంతర కాలంలో మాస్కో విదేశ వాణిజ్య మంత్రివర్గం ఆర్థిక సామ్రాజ్య నిర్మాణ మంత్రివర్గంగా మారి పోయింది. యుద్ధం ముగిసినప్పటినుంచి అది బ్రహ్మాండంగా విస్తరించింది. ప్రస్తుతం అది మామూలు దిగుమతి ఎగుమతి వ్యాపారానికి విశేష ప్రాధాన్యత ఇవ్వక విదేశాలలోని అన్ని రకాల ఆర్థిక కార్యకలాపాలలో పాల్గొంటూంది.

కొద్దికాలం క్రిందటివరకూ ఎవస్టాస్ మికోయన్ యీ మంత్రి వర్గ అధినేతగా పనిచేశాడు. సర్వదా నిష్కపటంగా ప్రవర్తించినప్పటికీ స్వీయబృంద సమక్షంలో అడపా దడపా అపహాస్య ధోరణిలో నిందిస్తూ ప్రసంగిస్తాడు. విదేశ ప్రయాణ సన్నాహపులైయున్న తనక్రింది ఉద్యోగుల కర్త వ్యాలను సమీక్షించే సందర్భంలో వారి నుద్దేశించి "మీరు సోవియట్ ప్రభుత్వం తరఫున వలసలు ఏర్పాటు చేయవలసిన వారు. ఆర్థిక సమస్యలు, విధానాలను నిర్ధారణ చేస్తాయి.— మీరు సోవియట్ వర్తకులుగా 'సోవియట్ పెట్టుబడి దారు లుగా' వర్తించాలి. మేము మీకు సాయపడతాము" అని ఆతడు చెప్పాడు.

1944 లో సోవియట్ సేనలు స్వదేశ సరిహద్దులను దాటి విదేశాలలోనికి ప్రవేశించిన నాటినుంచి మికోయిన్ కష్టతరమైన నూతన సమస్యలను ఎదుర్కొనవలసి వచ్చింది. వర్తక విధానాన్ని పునర్నిర్మాణము చేయవలసి వచ్చింది. సోవియట్ వర్తక విధానం విచిత్రమైనదిగా ఉంటుంది. రష్యా ఏ వస్తువును యితర దేశాలకు ఎగుమతి చేయలేదు. సరికదా దాదాపు ప్రతి వస్తువును దిగుమతి చేసుకోవలసి ఉంది. అరువు కవులు చట్టంక్రింద సంయుక్త రాష్ట్రాల నుంచి సాధన సామగ్రి రవాణా జరుగుతూనే ఉండేది. కాని యుద్ధంలో సర్వనాశనమై పోయిన దేశంయొక్క పెద్ద అవ సరాలకు అవి సరిపోవు. అందువల్లనే విదేశాలలో ఏది లభ్యమైతే దానిని, మంచీ చెడ్డా విచక్షణలేకుండా ఏ మార్గాలద్వారా అయినా సరే, సేకరించడం మికోయిన్

M.V.T. (Ministerstov Vneshnei Tovgovli) శాఖ ముఖ్య కర్తవ్యమైనది.

విదేశ వాణిజ్య విధానాన్ని విమర్శించే యువకుల, కుటిలుల మనస్సులలోని ఆగ్రహావేశమనార్థం ఒక క్రొత్త సిద్ధాంతం తయారు చేయబడింది. "సామ్రాజ్యవాదుల ఇనుప పిడికిలినుంచి విముక్తపరచబడ్డ దేశాలు విమోచకుని పట్ల విశేష ఆదరాన్ని చూపడం, విశేష హక్కులు కలుగ జేయడం న్యాయం" అనేదే ఆ సిద్ధాంతం. సోవియట్ సమాఖ్యయొక్క "విమోచక" కర్తవ్యాన్ని ఎత్తి చూపి విమర్శకుల నోరుకట్టుటే దాని ఆంతర్యం సోవియట్లు ఒంటరిగా "జర్మనీపై సాధించిన విజయం" దూర ప్రాచ్యంలో వారు ప్రదర్శించే "ఖచ్చితమైన" వైఖరులను ఘనతపరచడం, సర్వ శక్తులను నియోగించి యూవత్ప్రపంచాన్ని విముక్త పరచ కంకణంకట్టుకొన్న దేశాన్ని పునరుద్ధరించుటకు ఉపకరించే విధానాలన్నీ ఆచరణీయమని చెప్పడం పరిపాటి అయింది.

నాజీ ప్రభుత్వంయొక్క ఆర్థిక సామ్రాజ్య నిర్మాత డాక్టర్ కారల్ ఆగస్ట్ క్లోడియస్; రుమేనియాలో సోవియట్ సేనలచే జిక్కాడు. యూరప్‌కు సంబంధించిన ఆర్థిక సమస్యల విషయంలో క్లాడియస్ ప్రసిద్ధికెక్కిన నిపుణుడు. 1937—1943 సంవత్సరాల మధ్య విస్తరించిన జర్మన్ "నూతన ప్రపంచానికి" బెర్లిన్‌ను ఆర్థిక కేంద్రంగా చేసే నిమిత్తం కష్టపడి పనిచేశాడు. పితృదేశానికి కావలసిన ప్రత్యేక లాభాలను,

సదుపాయాలను సర్వదా దృష్టిలో ఉంచుకొనే మూడవ రీచ్ (జర్మన్ ప్రభుత్వం) నిమిత్తం ఆతడు వ్యాపార ఒడంబడికలు చేసుకొన్నాడు.

సోవియట్ సేనానులు క్లాడియస్‌ను మాస్కోకు ఖైదీగా తీసుకొనివచ్చారు. అప్పటికే తన యీ జర్మన్ ప్రశస్తి గురించి మికోయిన్‌కు తెలుసు. మికోయిన్‌కు అంతవరకు అనుభవంలో లేని నూతన "విదేశ వాణిజ్య" విధానం ప్రారంభించవలసివచ్చిన తరుణంలో క్లాడియస్ కనిపించడమనేది శుభసూచకమైంది. కొద్ది సంవత్సరాల క్రిందట, జర్మనీ గొప్పగాను, బలంగాను ఉండి ఉన్నప్పటికి, యితర దేశాలనుంచి తెప్పించుకొన్న వస్తువులకు మూల్యం ఇవ్వనిష్టపడక, లేక చెల్లించలేక చెల్లించ స్థోమతలేని సమయంలో తూర్పు యూరపు రాజ్యాలనుంచి నూనె, కొవ్వు పదార్థాలు, ధాన్యం, పశుగ్రాసం క్లాడియస్ సంపాదింపగలిగాడు. నాడు జర్మనీ ఉన్న స్థితిలోనే నేడు సోవియట్ యూనియన్ ఉన్నది. పూర్వం జర్మనీకివలెనే ప్రస్తుతం రష్యాకు కూడా ఎన్నో వస్తువులు కావలసివచ్చినప్పటికి వాటి మూల్యాన్ని చెల్లించే శక్తి దేశానికి లేదు. ఇట్టి పరిస్థితులలో నూతన వాణిజ్య విధానాన్ని రూపొందించే సందర్భంలో, క్లాడియస్ తన బుద్ధికుశలతను ఉపయోగించాడు.

జర్మనీకిగాని లేక సోవియట్ ఆక్రమిత ప్రాంతాలలోని జర్మనులకుగాని చెందిన సంపద, పెట్టుబడులు, యావత్తూ సోవియట్ సమాఖ్య పరమవాలనేది మాస్కో సిద్ధాంతం. మంచూరియా కొరియాలలోని జపాన్ ఆస్తిపాస్తులకు కూడా

యీ సిద్ధాంతమే నర్తించింది. జర్మనీ దేశంయొక్క పారి శ్రామిక సృజనశక్తిని నూటికి 80 పాళ్లు తగ్గించవలెననే స్టాలిన్ కోర్కెను గురించి ఎడ్వర్డ్ స్టెటినియస్ యాల్టా కాన్ఫరెన్స్ పై వ్రాసిన పుస్తకంలో ఉదహరించాడు. జర్మనీ పరిశ్రమ లను పూర్తిగా శిథిలంచేయడమే దాని సారాంశం. వాస్త వానికి పారిశ్రామిక యంత్రాలను పడగొట్టడం, యంత్ర పరికరాలను తూర్పు దిశకు రవాణాచేయడం అనేది "యుద్ధ పరిహారాల" సంపాదన విషయంలో సోవియట్లు అవలం బించిన ముఖ్య పద్ధతి. కనీసం తొలి ఘట్టాలలోనైనా ఈ పద్ధతి అనుసరింపబడింది. మొట్టమొదటి సారిగా, సోవియట్ ఆర్థిక తత్త్వవేత్త యుగెనీవర్గా బహిరంగంగా ప్రతిపాదించిన ఈ పద్ధతి యుద్ధపరిహారాలను సంపాదించే నిమిత్తం సాంప్రదాయసిద్ధంగా అమలుజరుపుతున్న పద్ధతుల కన్న శ్రేష్టమైనదిగా కనుపించింది.

అయితే విపరీత ఆశాభంగమే దాని ప్రతిఫలం. పారి శ్రామిక యంత్రపరికరాల దిగుమతులవల్ల రష్యా ఆర్థిక వ్యవస్థ పొందిన లాభాలు అత్యల్పం. కాని వాటిని కోల్పో యిన దేశానికి సంభవించిన నష్టాలు అపారం. అందు మూలంగానే బంగారు గుడ్లుపెట్టే బాతును చంపడం దేనికి? సోవియట్ నమాఖ్య అవసరాలను తీర్చే నిమిత్తం విదేశాల లోని వినాశాన్ని ఆపి ఉత్పత్తిని స్థాపించడం విజ్ఞత కాదా? అనే ప్రశ్నలు ఉద్భవించాయి. పద్ధతి మారింది. పడగొట్ట డానికి ప్రత్యేకింపబడిన వందలాది కార్ఖానాలు, యంత్రాలు, ఇకముందు యథా స్థానంలోనే పని కొనసాగించవచ్చు కాని

ఒక్కటే తేడా. ఇపుడు వాటి యజమాని ఒక పరాయి ప్రభుత్వం. స్థానిక ప్రజల జాతీయతా భావాలను నొప్పింప కుండుటకుగాను మసిపూసి మారేడికాయ చేసే అవకాశం ఆ పద్ధతిలోనే ఇమిడి ఉన్నది. తదను విదేశాలలో సోవి యట్ ఆర్థిక కార్యకలాపాలు కొనసాగించే నిమిత్తం సర్వే సర్వత్రా "మిశ్రమ వ్యాపార సంస్థలు ఏర్పాటు చేయ బడ్డాయి. నూటికి 50 వాటాలు సోవియట్ ప్రభుత్వానికీ, తక్కిన 50 వాటాలు ఉపగ్రహదేశ ప్రభుత్వానికి ఉండే పారిశ్రామిక వ్యవస్థే "మిశ్రమ వ్యాపార సంస్థ." (కొన్ని సందర్భాలలో ఈ నిష్పత్తి 51: 49 శాతంలో వుంటుంది). 1924—35 సంవత్సరాల మధ్య మంచూరియాలోని తూర్పు చైనా రైలుమార్గం విషయంలో అమలు చేయబడడంలో ఈ మేడిపండు మిశ్రమ వ్యాపార సంస్థలలో నిగ్గు తేలి పోయింది. సోవియట్ అధికారులు, చైనా అధికారులు, సమాన ప్రతిపత్తిమీద, ఒక ఒప్పందం చేసుకున్నారు. దాని ప్రకారం ఉభయపక్షాలవారికి సమాన హక్కులు కలుగ జేయబడ్డాయి. కాని ఒక్క చిన్న తేడా: రైల్వే జనరల్ మేనేజర్ సోవియట్ పౌరుడై ఉండాలి. అయితే సమా నతకు భిన్నంగా చేయబడ్డ ఈ చిన్న మార్పు చైనావారి పలుకుబడి నిరహితం చేయుటకు చాలివుంది.

మంచూరియాలో అమలు జరిపిన విధానాన్ని సర్వే సర్వత్రా వర్తింపచేయ మాస్కో నిశ్చయించింది. తూర్పు జర్మనీతో సహా తూర్పు యూరప్ దేశములన్నింటిలోను మిశ్రమ వ్యాపార సంస్థలు కుక్క గొడుగులులా తల

లేత్తాయి. సోవియట్ సమాఖ్యతో హంగేరీ తన బాక్సైట్, నూనె, ఇనుము, ఉక్కు, రసాయనక పదార్థాలు, విద్యుచ్ఛక్తి, రైల్వేలు, విమానయానం ఆదిగాగల వ్యాపారాలలో "పాలు పంచుకొన్నది." రుమేనియాలోని వాయు, సముద్ర, నదీ, భూమార్గ రవాణా వ్యాపారం, బాంకింగ్ వ్యాపారం, కలప వర్తకం, నూనె పరిశ్రమ యావత్తూ ఏసు సావ్ రొమ్ (సోవియట్—రుమేనియా మిశ్రమ వ్యాపార సంస్థల హస్త గతమైనాయి. ఆస్ట్రియా నూనె ఉత్పత్తి సగానికి మించి సోవియట్ ఆధీనమందున్నది. ఆస్ట్రియా సోవియట్ ప్రభుత్వాలు అంగీకరించి, అచిరకాలంలోనే అమలుపరచే ఒడంబడిక లోని కొన్ని నియమాల ప్రకారం ఆస్ట్రియా నూనె ఉత్పత్తులపై సోవియట్ ఆధిపత్యం స్థిరపడుతుంది. ఆస్ట్రియా దేశంలోని అధికభాగంపై నూనె కనుగొనే హక్కు సోవియట్ ప్రభుత్వం కలిగి ఉండడం అంతకన్న ముఖ్యమైన విషయం. మాస్కోలో తయారు చేయబడిన పథకముల ప్రకారం పోలెండు దేశంలో ఉక్కు, సిమెంటు రసాయనిక పదార్థాలను ఉత్పత్తిచేసే ఫ్యాక్టరీలు క్రొత్తగా నిర్మింపబడుతున్నాయి. స్లొవేకియాలోని మలాకీ నుంచి ఆస్ట్రియా సరిహద్దువరకు గల భూభాగంలో 1950-వ సంవత్సరంలో క్రొత్త నూనెగనులు కనుగొనబడిన వెంటనే "వాస్తవంగా" అవి సోవియట్ యాజమాన్యం క్రింద ఉన్న ఆస్ట్రియా నూనెగనుల శాఖలేనని అందుమూలముగా సోవియట్ సమాఖ్యయే వాటినుంచి నూనె తోడుతుందని రష్యన్ ప్రతినిధులు ప్రకటించారు. సోవియట్ వ్యాపార

సంస్థలు 1945 లోనే జెకొస్లొవేకియాలోని యురేనియమ్ గనులను స్వాధీనపరుచుకున్నాయి.

దూర ప్రాచ్య దేశాలలో కూడా ఇట్టి కార్యకలాపాలే కొనసాగుతున్నా అక్కడ వాస్తవ విషయాలు, ఇతర దేశాలలో కన్న హెచ్చుగా కప్పి పుచ్చబడుతున్నాయి. సిన్ కియాంగ్ రాష్ట్రంలో నాన్—ఫెర్రస్ లోహ పరిశ్రమలను నడుపుటకు రెండు సోవియట్—చైనీస్ మిశ్రమ వ్యాపార సంస్థలు స్థాపించబడ్డాయని అధికార పూర్వకంగా ప్రకటించబడినది. నికరమైన అంకెల అంచనాలు లభ్యము కానప్పటికి ఉత్తరకొరియా పరిశ్రమలు ఇదే విధంగా నడుపబడుతున్నాయని, మంచూరియాలో కూడా మిశ్రమ వ్యాపార సంస్థల సూత్రమే అనుసరింపబడుతున్నదని అనుటలో ఎంత మాత్రం సందేహం లేదు.

ఈ ఆర్థిక దోపిడీ విధానం సోవియట్ యూనియన్‌కు దాని ఉపగ్రహ దేశాలు ఎంత హెచ్చు కప్పములను చెల్లిస్తున్నవో తెలుపుతు చేస్తుంది. వాటి విషయమై ఉభయ పక్షములవారు ఎటువంటి లెక్కలను ప్రకటించరు. అవి ప్రభుత్వనిగూఢ రహస్యాలు. కాని పశ్చిమాన, తూర్పున ఉన్న ఉపగ్రహ దేశములలోని ప్రజలు ఉత్పత్తి చేసిన "అపారమైన" "మిగులు మూల్యాన్ని" ప్రతివారం ఓడలు, రైలుబండ్లు, సోవియట్, భూమికి తరలించుకొని పోతాయి. ఆ విధంగా ఒక సంవత్సర కాలంలో తరలించుకొనిపోబడే వస్తువుల విలువ కొన్ని బిలియన్ల డాలర్లుంటుందనేది యదార్థం.

అంతేగాక అనేక రహస్య ఒప్పందాలద్వారా సోవియట్ ప్రభుత్వం మిశ్రమ వ్యాపార సంస్థల నిమిత్తం కొన్ని ప్రత్యేక హక్కులనుకూడా సంపాదించింది. వాటివల్ల మిశ్రమ వ్యాపార సంస్థలు పన్నులను ఎగుమతి సుంకాలను చెల్లించ నక్కరలేదు. ఫ్యాక్టరీలకు స్వంత పహారా ఏర్పాటు చేసు కొనే సదుపాయంకూడా పై హక్కుల జాబితాలో తరచు చేర్చబడే ఉంటుంది.

ఆరీతిగా ఉన్నట్టుండి హఠాత్తుగా సోవియట్ ప్రభుత్వం విదేశాలలో పెద్ద పెట్టుబడులకు స్వంత దారైంది.—రష్యన్ చరిత్రలో అదొక వింతపరిణామం.

విప్లవానంతరం ఒక శతాబ్దకాలం విదేశ పెట్టుబడులకు రష్యా రంగస్థలంగా ఉండినది. విప్లవానంతరంకూడా కొంత వరకు విదేశీ పెట్టుబడులకు అవకాశ మివ్వబడింది. రష్యన్ కార్మికుని సృజనాత్మక శక్తిని వినియోగించుకొనే నిమిత్తం విదేశీ పెట్టుబడిదారులను లెనిన్ సాదరంగా ఆహ్వానించి ఎంతో కాలం కాలేదు. రష్యా యొక్క ఉత్పాదక సామర్థ్యాన్ని అభివృద్ధిపరచు కోర్కెతో విదేశీ పారిశ్రామికులకు హెచ్చు లాభాలు చెల్లించుటకుకూడా లెనిన్ సమ్మతించాడు. లెనిన్ అనుసరించిన విధానాన్ని స్టాలిన్ ఆనాడు సంపూర్ణంగా అంగీకరించాడు. ఇతర దేశాలలో రష్యా పెట్టుబడులు పెడుతుందని వారుభయులు ఆ రోజులలో వారు కలలు గనలేదు. వాస్తవానికి 1917—18 సంవత్సరాలలో లెనిన్ ప్రభుత్వము విదేశాలలో రష్యాకున్న ప్రత్యేక హక్కులను, పెట్టుబడులను వదలుకొన్నది. ఈ పెట్టుబడులు చాలా

తక్కువగాను, సమీప దూర ప్రాచ్య దేశాలకు పరిమితమై ఉండెడిదనేది యదార్థం. ఇరాన్, చైనాలలోని రష్యన్ బ్యాంకులు నూనె వ్యాపార విషయంలో సదుపాయాలు, నష్ట పరిహారాలు, ఆయా దేశాలకు యథావిధిగా "తిరిగి సమర్పింప బడ్డాయి" లేదా రద్దుచేయ బడ్డాయి. లెనిన్ గాని ఆతని పార్టీగాని ఆ వస్తువులను సోవియట్ ప్రభుత్వానికి లాభదాయక మగునట్లు జాతీయం చేసి "ప్రథమ సామ్య వాద దేశం" యొక్క విదేశ ఆస్థులుగా నిర్వహించుటకు, ప్రయత్నించి ఉండలేదు. విదేశాలలో ఆస్థులను కలిగి ఉండరాదనే అధికార సిద్ధాంతానికి భిన్నంగా జరిపిన తూర్పు చైనా రైల్వే ఒప్పందం, ఆ తరువాత రష్యా ప్రదర్శించిన భిన్న వైఖరికి ప్రథమ తార్కాణం. చాలకాలంవరకు అదొక్కటే ముఖ్యమైన మినహాయింపుకూడా.

అధికార సిద్ధాంతంలో వచ్చిన ఈ మార్పుకు విశేష అర్థముంది. మాస్కోలో ప్రముఖ వ్యక్తులు దాని అవకాశాన్ని గుర్తించారు. పెట్టుబడిదారుగా రష్యా నిర్వహించు నూతన పాత్రను నిశ్శబ్దం, రహస్యం ఆవరించుకొని ఉన్నాయనే విషయాన్నిబట్టి వారు ఆ మార్పును ఎంత స్పష్టంగా గ్రహించారో తేట తెల్లమవుతుంది. సోవియట్ వార్తా పత్రికలు ఆ విషయమై ఎన్నడూ ప్రస్తావించవు; M.V.T. శాఖ దాని స్వంత సంచిక "విదేశ వాణిజ్యం"లో పై మార్పును గురించి ఒక్క మాటైనా వ్రాయదు; "విదేశ వాణిజ్యం" పత్రికా సంపాదకులు, వ్యాస రచయితలు తప్పనిసరిగా లెనిన్ నిర్వచించిన సామ్రాజ్యవాద సిద్ధాంతం

చదువవలసి ఉన్నది; విదేశాలలో ఉత్పాదక శక్తులను కలిగి ఉండడమంటే విదేశ కార్మికులను దోపిడీచేయడ మన్న మాటే. అది "అధునాతన సామ్రాజ్యవాదం యొక్క ప్రముఖ లక్షణం," అనే సూత్రాన్ని కంఠస్థముచేసి ఉండక పోయినట్లైతే వారు పరీక్షలలో కృతార్థులై ఉండి ఉండే వారు కాదు. అట్టి సంపాదకులు, వ్యాస రచయితలుగల "ఫారిన్ ట్రేడ్" పత్రిక సిద్ధాంతంలోని మార్పు విషయమై ఒక్క మాటకూడా వ్రాయకపోవడం విచిత్ర విషయం.

విదేశాలలో ఆవశ్యకమైన పెట్టుబడులను సంపాదించు టతో బాటు, వలస దేశ పరిపాలకుల నూతనవర్గాన్నొక దానిని సృష్టించుటలో సోవియట్ సమాఖ్య త్వరపడవలసి వచ్చినది. అందుకుగాను కొంతమందిని ఎన్నుకొని, వారికి కమ్యూనిష్టు పార్టీ కేంద్ర సంఘం ఆధ్వర్యాన శీఘ్ర శిక్షణ ఇప్పించబడింది. అట్టి పరిపాలకుల సంఖ్య ఒక రహస్య విషయం. అయితే అది విస్తారంగా ఉంటుంది:-ఉదా హరణగా చెప్పాలంటే బ్రిటిష్ వలస దేశపాలకశాఖ ఉచ్ఛ దశలో ఉన్న రోజులలో దాని సభ్యుల సంఖ్యకన్న అది చాలా అధికం. లిటిల్ అల్బేనియా ఒక్కటే 3,000 లకు పైగా రష్యన్ సలహాదార్లను, ఉద్యోగులను ఆహ్వానించి పోషించవలసి వచ్చింది. 1950-వ సంవత్సరం మే నెలలో హాంగ్‌కాంగ్ స్వతంత్ర వర్గాలవారు, చైనాలోని సోవియట్ సలహాదారుల సంఖ్య 23,000 అని అంచనా వేశారు. ఒక్క షాంగైలోనే 2,000 మంది సలహాదార్లు, వారి కుటుంబాలతో సహా నవనాగరిక లక్షణాలు ఉట్టిపడుతూ

ఉంటే హులున్‌గ్‌జావ్ ప్రాంతంలో నివసిస్తున్నారు. తూర్పు యూరప్, జర్మనీ, దూరప్రాచ్య దేశాలలో సాధారణ సిబ్బందులను ఏర్పాటుచేయుటానికి, నూతనంగా సృష్టించబడ్డ సైన్యాలను, రక్షకభట దళాలను, కుక్క గొడుగులలా పెరిగిపోతున్న రహస్య రక్షకభట శాఖలను పరిశీలించేందుకు; సోవియట్ పర్యవేక్షణ క్రింద ప్లానింగ్ కమిషన్‌లను సృష్టించడానికి, సాముదాయిక వ్యవసాయ పద్ధతులను బోధించేందుకు; జాతీయం చేయబడ్డ విదేశ వ్యాపారాన్ని నిర్వహించే విషయంలో ఉత్తరువు తీయడానికి, సోవియట్ ప్రభుత్వం నిమిత్తం అసంఖ్యాకంగా ఉన్న మిశ్రమ వ్యాపార సంస్థలను నిర్వహించేందుకు ఉన్నచోట్లలో ఆక్రమ కార్య కలాపాలను, సరిగా, సకాలంలో కొనసాగించడానికి ఇంకా ఎన్నో ఇతర విధులను నిర్వర్తించుటకు 100,000 మందికి పైగా సలహాదార్లు అవసరం.

రష్యామొక్క లేదా వారు నివసిస్తున్న దేశంయొక్క సమాజంలోని అంతరవులను ఆధారంగా తీసుకొని వర్గీకరణ చేయబూనినట్లైతే రష్యన్ సలహాదార్లు ఒక విధమైన ప్రభువుల తరగతిలోనికి వస్తారు. విదేశాలలో నివసించడమనేదే వారికొక పెద్ద సదుపాయము సర్వవ్యాపిమైన రహస్య M.G.B. శాఖ ప్రతినిధులు వారిని సర్వదా ఒక కంట కనిపెడుతూ ఉంటారు. స్థానిక ప్రజలతో కలసి మెలసి సంచరించడం వారి పట్ల తరచు నిషిద్ధం. అయినప్పటికి సోవియట్ వలస దారుల హోదాలో కలుగజేయబడే సౌకర్యాలను "పాశ్చాత్య" దేశములలోని ప్రజగడపే జీవిత

ములుగా వారు ఎంచే జీవితములను విశేషంగా అనుభ విస్తారు. "స్థానికులలోని తోటి ఉద్యోగుల జీతములకన్న వారి వేతనాలు అధికంగా ఉంటాయి. తరచు మంత్రుల వేతనాలనుకూడా మించి ఉంటవి." రష్యన్ మేనేజర్లకు, ఇంజనీర్లకు చెల్లించే జీతాలను గురించి యుగోస్లోవ్ వారు వెల్లడించిన వివరాలు ఇందుకు తార్కాణం: బెల్‌గ్రేడ్ సమీపాన ఒక వంతెన నిర్మాణాన్ని పర్యవేక్షిస్తున్న సోవి యట్ మేనేజర్ నెలకు 50,000 దినార్లు తీసుకొన్నాడు. ఒక రష్యన్ ఛీఫ్ ఇంజనీరు వేతనం 45,000 దినార్లు. అతని సహాయ ఇంజనీరు జీతం 26,000 దినార్లు. ఒక వ్యాపార సంస్థ డైరెక్టర్ 25,000 ఒక ఛీఫ్ మెకానిక్. 22,000 దినార్లు, ఒక శాఖ ఉన్నతాధికారి 22,000 దినార్లు చొప్పున తీసు కుంటారు. (ఒకయుగోస్లావ్ మంత్రి జీతం నెలకు 12,000 దినార్లు) అంతేగాక రష్యన్ ఉద్యోగస్థులకు మేజాలు, సోఫాలు, కుర్చీలు, వంటిపరికరాలు, రేడియో, టెలిఫోన్, వేడి, వెలుతురు, ఏర్పాట్లు ఆదిగా గల అన్ని సదుపాయాలు అమరి ఉన్న పెద్ద భవనాలు, కార్లు, సేవకులు, ఉచితంగా సమకూరుస్తారు. ప్రతిసంవత్సరం పనికి రెండుమాసముల జీతం బోనస్‌గా కూడా యిస్తారు. 1948-వ సంవత్సరంలో కలనెల్, జనరల్ హోదాలుగల సోవియట్ సలహాదార్లు యుగోస్లోవ్ ప్రభుత్వం వద్దనుంచి నెలకు 30,000 నుంచి 40,000 దినార్ల వరకు వేతనం తీసుకొనెడివారు. కాని యుగోస్లోవ్ సైన్య శాఖలోని జనరల్ వేతనం 9,000 నుంచి 11,000 మాత్రమే. ఏకొద్ది మందికి మాత్రమో వేతనాలు

సోవియట్ ఖజానానుంచి చెల్లింపబడతాయి. సాధారణంగా "ఆహ్వానించు" దేశంగానీ లేదా ఏ మిశ్రమ వ్యాపారసంస్థ నిమిత్తం నియమింపబడ్డారో ఆ సంస్థగాని ఖర్చు భరిస్తుంది. అందువల్లనే హెచ్చు జీతాలు రష్యాకు భారమనిపించవు.

యుద్ధకాలంనాటి నుంచి సోవియట్ ఆర్థిక విస్తరణ విధానంలో ఇండస్ట్రియల్ కార్పొరేషన్‌లు ప్రముఖపాత్ర వహిస్తున్నాయి. అయితే ఇతర పద్ధతులుకూడా వర్తింపజేబడ్డాయి. యుద్ధ సమయంలో ఆహార ధాన్యాలు, పశువులు, కార్లు, రైలుబండ్లు, ముడి పదార్థాలు, కొల్లగొట్టడంతోబాటు, ఫ్యాక్టరీలను, ఓడలనుకూడా తరలించుకు రావలసినదనే సరికొత్త సిద్ధాంతాన్ని ఆచరణలో పెట్టడంపై ఇతర పద్ధతులలో మొదటిది. శత్రు దేశాలలోనే కాకుండా పోలెండు, యుగోస్లోవియాలలోకూడా యుద్ధ సమయంలో దోపిడీలు చేయబడ్డవి. "జర్మన్ ఆస్తి" యావత్తూ రష్యా, దాని పరం చేసుకుంది. రష్యా సహాయ దేశాలకు ఆ ఆస్తిలో వాటా ఇవ్వబడలేదు. యూరప్‌లోని అన్ని ఆక్రమిత దేశాలనుంచి, 1945-వ సంవత్సరం ఆకురాలు కాలంలో కొరియా, మంచూరియాలనుంచి, యుద్ధకాలంలో కొల్లగొట్టిన వస్తువులను రష్యాకు తరలించుటకుగాను M. V. T. వారు సైనికశాఖ సహాయంతో ఎన్నో సరుకు రైలుబండ్లను ఏర్పాటు చేయవలసివచ్చినది. ఆ విధంగా కొల్లగొట్టిన వస్తువుల మొత్తం విలువ తెలియజేసే అంకెలు అథవా అంచనాలైనా ప్రచురింపబడలేదు. మంచూరియానుంచి తరలించిన వస్తువుల విలువ 800,000,000 ల డాలర్లకు

పైబడి ఉంటుందని ఒక అమెరికన్ సంఘంవారు అంచనా వేశారు.

ఆక్రమణ అయి ఆరవ సంవత్సరం నడుస్తుంది. ఆక్రమణ సైన్యాల వసతి, భోజన, సదుపాయాలకయ్యే ఖర్చు ఆక్రమిత దేశమే భరించడం రెండవ పద్ధతి.

యుద్ధ పరిహారాల వసూలు పద్ధతి మూడవది. 1943-వ సంవత్సరంలో సోవియట్ ప్రభుత్వంవారు జరిపిన తగ్గింపులు పోగా, 685,000,000 ల డాలర్లు; ఈ మొత్తం వస్తురూపంగా వాయిదాలలో చెల్లించవలసి ఉంది. జర్మనీనుంచి రాబట్ట వలసిన యుద్ధపరిహార బట్వాడాల విలువ 6,829,000,000 డాలర్లుగా నిర్ణయించబడింది. యుద్ధనష్ట పరిహార ఒప్పంద ములు చాలా వాటిలో, పరిహారముల విలువలు 193८-వ సంవత్సరపు ధరలను ఆధారం చేసుకొని లెక్కగట్టవలెననే నిబంధన ఉంది; ఈ మధ్యకాలంలో వస్తువుల ధరలు దాదాపు రెట్టింపు పెరిగాయి; అయితే యుద్ధనష్ట పరిహార అప్పుల నిమిత్తం బట్వాడా చేయబడే వస్తువులు నేటి వాటి సరియైన ధరలనుబట్టి కాక 1938-వ సంవత్సరంలో ఉండిన వెలలను బట్టి, జమకట్టుకొన బడుతున్నాయి. ఆ వస్తువులనే ఈనాడు కొనవలెనంటే దాదాపు రెట్టింపు డాలర్లు అవసరం. రుమేనియా యుద్ధనష్ట పరిహారాల నిమిత్తం చెల్లింపవలసిన 300,000,000 డాలర్లలో, 1946 సెప్టెంబరు వరకు రెస్టి ట్యూషన్స్ నిమిత్తం, 174,000,000 డాలర్లు, జప్తులు నిమిత్తం 430,000,000 డాలర్లు సోవియట్ సైన్యాల ఖర్చుల నిమిత్తం 300,000,000 డాలర్లు, యుద్ధనష్ట పరిహారాల

చెల్లింపు నిమిత్తం వాయిదాలలో 105,000,000 డాలర్లు చెల్లించవలసి వచ్చినదనేది ఇందుకు తార్కాణం. మాజీ రుమేనియా ప్రధాని జనరల్ నికోలాస్ రెడెస్క్యూ 1948-వ సంవత్సరం జూలై వరకు రుమేనియా యుద్ధనష్ట పరిహారాలుగా 1,785,000,000 డాలర్లు చెల్లించినదని తెలియ చేశాడు.

1947-వ సంవత్సరంలో సోవియట్ "రాజకీయ దిగుమతులు" విలువ ఎట్టి మూలనూ చెల్లించక, లేక నామకః కొద్దిపాటి విలువ చెల్లించి పొందిన సంపాదనలని ఆక్రమిచ్చే క్రొత్త పదం... 1,200,000,000 డాలర్లకు పైబడి ఉంటుందని ఈ దేశములోని మతవాదులైన ఆర్థిక శాస్త్రవేత్తలు అంచనా. కాని జర్మన్ ఆర్థిక శాస్త్రవేత్తలు, బహుశః అతిశయోక్తిగా, చాలా ఎక్కువ అంచనాలు వేశారు. యుద్ధం తరువాతి మూడు సంవత్సరాలలో సోవియట్ సమాఖ్యకు జర్మనీ చెల్లింపుల మొత్తం 10,000,000,000 ల డాలర్లని, లేక సంవత్సరానికి 3,000,000,000 ల డాలర్ల పైబడి ఉన్నదని 1948-వ సంవత్సరంలో బ్రెమెన్ నియోజకవర్గం నుంచి ఎన్నికైన సెనేటర్ హారమేసెన్, అంచనా వేశాడు.

రష్యా, దాని ఉపగ్రహ దేశాలలో క్రొత్తవ్యాపార బేరసారాలు, ఒప్పందాలు, సాధారణంగా అమెరికన్ డాలరును చెలామణీ నాణెంగా చేసుకొని జరుపడం నాల్గవ పద్ధతి. విశేషంగా పెరిగిపోయిన కరెన్సీనోట్లను అమెరికన్ డాలర్లలోనికి మార్చే విధానం హస్తలాఘువానికి ఎన్నో అవకాశాలను కలుగ జేస్తుంది. హంగెరీలో, డాలరు కొన్ని

సమయాలలో 11·60 షిల్లింగ్సుకు, మరికొన్ని సమయాలలో 25·00 షిల్లింగ్సువరకు ఏ మొత్తం హెచ్చు లాభసాటిగా ఉంటుందో అనే దానిపై ఆధారపడి విలువ చేయడం ఇందు కొక ఉదాహరణ.

M.V.T. ఉపగ్రహ దేశాలనుంచి వస్తువులను తక్కువ ధరలకు కొని వాటిని ఇతర దేశాలకు ఎక్కువ లాభానికి తిరిగి విక్రయించడం ఐదవ పద్ధతి. జర్మన్ రసాయనికపు ఎరువులను ఫిన్లండుకు, పోలిష్ బొగ్గును స్వీడన్‌కు ఈ పద్ధతిని ఆధారంగా చేసుకొనే రష్యా విక్రయించింది. రుమేనియా మాస్కోలోని M.V.T. శాఖ వారితో చేసుకొన్న వాణిజ్య ఒడంబడికల ననుసరించి రుమేనియా నూనె ఇతర ఉపగ్రహ దేశాలకు సరఫరా చేయబడుతుంది. బల్గేరియా తుత్తునాగాన్ని రష్యా జెకోస్లొవేకియాకు విక్రయించడం, అట్టి వ్యాపారం కొంతకు అతి ముఖ్యమైన తార్కాణం: ఆదిలో బల్గేరియా ఒక టన్ తుత్తునాగం 144 డాలర్లు చొప్పున స్వయంగా విక్రయించ ప్రయత్నించినప్పుడు మాస్కో రంగంలోకి దిగి తాను ఇదివరలో బల్గేరియానుంచి తక్కువ వెలకు కొన్న తుత్తునాగాన్ని బల్గేరియా తెలిపిన వెలకన్న తక్కువ ధరకు జెకోస్లొవేకియాకు విక్రయించింది.

నూతన వ్యాపార ఒప్పందాలను చేసుకోవడం ఆరవ పద్ధతి. ఆ వ్యాపార ఒడంబడికలలోని ముఖ్య విషయాలను తెలుపుదు చేసి కొన్ని వివరాలు లభ్యమయ్యాయి. ఆ ఒడంబడికలబట్టి అంగీకరించిన ధరలు తరచు సోవియట్ రష్యాకు లాభకరంగాను ఉపగ్రహ దేశాలకు నష్టదాయకం

గాను ఉంటాయి. పోలండు దేశం రష్యాకు బొగ్గు ఎగుమతి చేస్తుంది, రష్యానుంచి ప్రత్తికొంటుంది. ఈ బేర సారాలలో, ప్రపంచ మార్కెట్లలో ఉన్న ధరలకన్న, బొగ్గు వెలతక్కువగాను, ప్రత్తి ఖరీదు ఎక్కువగాను, ఉంటుంది. 1948-వ సంవత్సరంలో ప్రపంచ మార్కెట్లలో బొగ్గు ధర టన్ను 14-20 డాలర్లుంటె పోలండుదేశం సోవియట్ సమాఖ్యకు టన్ను 1·2 డాలర్ల చొప్పున 600,000 టన్నుల బొగ్గు విక్రయించినది. ఆ ఒక్క బేరంలోనే సోవియట్ రష్యాకు దాదాపు 10,000,000 డాలర్ల నికరాదాయం వచ్చింది. బల్గేరియా నుంచి సోవియట్ రష్యా కొన్న రోజ్ ఆయిల్‌ను రష్యా పదిరెట్ల లాభానికి తిరిగి ఇతర దేశాలకు విక్రయించింది. విమానాలను నడుపుటకు ఉపయోగించే నూనెను గాలన్ 7 సెంట్ల చొప్పున రుమేనియా దేశం రష్యాకు విక్రయించింది. రష్యాలో తయారైన సామాన్య ZIS కార్లు ఒక్కొక్క దానికి 2,900 డాలర్ల చొప్పున రష్యాకు రుమేనియా చెల్లించింది. మంచూరియా, చైనాల నుంచి సోయాబీనులు, పందివెంట్రుకలు, తగరం, టన్‌గ్‌స్టెన్‌లతో నిండి ఉన్న వందలాది రైలుబండ్లు సోవియట్ రష్యాదిశగా నిరంతరం ప్రయాణం చేస్తూ ఉంటాయి. కాని పెకింగ్, టీన్‌ట్సెన్ నగరాలలో రష్యా నుంచి దిగుమతి చేయబడ్డ కార్లు, మద్యపానీయాలు కొద్దిగా మాత్రమే కానవస్తాయి.

సోవియట్ రష్యా ఉపగ్రహ దేశాలకు ఇచ్చే అప్పులపైన హెచ్చు వడ్డీ రేటు వసూలు చేయడం ఏడవ పద్ధతి. ప్రపంచదేశ ప్రభుత్వాల మధ్య చలామణీ అయ్యే వడ్డీ రేటు

కన్న సోవియట్ వడ్డీ రేటు తరచు అధికంగా ఉంటుంది. ఎగుమతి దిగుమతి బ్యాంకు నూటికి రెండున్నర చొప్పున వడ్డీ వసూలు చేస్తున్నా, జెకోస్లోవేకియాకు ఇచ్చిన అప్పులపై రష్యా నూటికి మూడున్నర వడ్డీ వసూలు చేయడం ఇందు కొక ఉదాహరణ.

ఆర్థికశాస్త్ర చరిత్రలో నూతన అధ్యాయమనదగిన, ఎనిమిదవ పద్ధతి; ఉపగ్రహ దేశాలపై రష్యా తెచ్చే ఆర్థిక ఒత్తిడి. గత మూడు దశాబ్దాల కాలంలో కోమిన్‌టెరన్ "సహాయా"నికిగాను కమ్యూనిష్టు దేశాలు డబ్బు చెల్లించవలెనని సోవియట్ ప్రభుత్వం చేసిన అభ్యర్థనలో ఈ ఆర్థిక ఒత్తిడి స్వరూపం ప్రత్యక్షమైంది. పార్టీకి బల్గేరియన్ కమ్యూనిష్టు ఆర్థిక సహాయం చేసినందుకు, పార్టీ నాయకులు రష్యాలో ఉన్నప్పుడు వారికిచ్చిన సహాయం మొత్తమంతె, 10,000,000 డాలర్లు చెల్లించవలసినదని మాస్కో బల్గేరియాను కోరింది. బల్గేరియన్ కమ్యూనిష్టు పార్టీ దాని గమ్యమైన ప్రభుత్వాధికారాన్ని హస్తగత మొనరించు కొనుటతో రష్యా కోరిన మొత్తాన్ని తప్పక చెల్లించవలసి ఉంది. జర్మనీతో సహా యూరప్‌లోని తక్కువ ఉపగ్రహ దేశాలు ఇదే విధంగా రష్యాకు కోమిన్‌టెరన్ ఋణాలు చెల్లించినట్లైతే వాటన్నిటి మొత్తం గమనించ తగినంత పెద్ద పరిమాణంలో ఉండవచ్చు. సోవియట్—ప్రాబల్యం కిందకు వచ్చిన దూరప్రాచ్య ఉపగ్రహ దేశాలపై కూడా ఇటువంటి అప్పులే రుద్దబడుతాయి. అందుకు బాటలు తెరుచు కొంటున్నాయి.

యుద్ధం ముగిసినప్పటినుంచి ఆర్థిక పునరుద్ధరణరంగంలో రష్యా సాధించిన విజయాలు అనల్పం. రష్యా కొంచ మించుమించు యుద్ధాత్పూర్వస్థాయిని చేరినదని సోవియట్ ప్రభుత్వం చెప్పే మాటలు వట్టిదంభ ప్రగల్భాలు కావు. బహుశః రష్యాకు వచ్చిన "రాజకీయ" దిగుమతుల మొత్తం మూల్యం 20-30 బిలియన్ల డాలర్లవరకు ఉండి ఉంటుంది.

యుద్ధానంతరం విదేశ వ్యాపార కార్యకలాపాలలో రష్యన్లు అనుసరిస్తున్న చతుర విధానాలలో కొన్నిటిని — యుద్ధకాల దోపిడీలను తరలించుకొని పోవడం, ఒత్తిడి తెచ్చి డబ్బు గుంజుకోవడం వంటివి. అనతి కాలంలోనే రష్యా విరమించుకోవలసి వస్తుంది. యుద్ధ పరిహారముల చెల్లు బడులు కూడా అంతమై పోతాయి. ఇక మిగిలేవి ఇవి:— మొదటిది: సోవియట్ అధీన ప్రాంతాలలో రష్యాకున్న స్థిరాస్తులు, పెట్టుబడులు ... వాటి విలువ అంచనా వేయ అలవి కానంత హెచ్చుగా వుంటుంది;—రెండవది: వ్యాపార కేంద్రంగా మాస్కో- నిర్వహించు పాత్ర...ఉపగ్రహ దేశాల మధ్య దళారిగా పనిచేయుడం; మూడవది: రష్యా విక్ర యించే వస్తువులకు హెచ్చు ధరలు సంపాదించటానికి, అది కొనే వస్తువుల ధరలు తగ్గించటానికి ఉపగ్రహ దేశాలపై రాజకీయ ఒత్తిడి తీసుకొని రావడం.

సామ్రాజ్యవాదం ఎట్టి లక్షణాలు కలదిగా ఉంటుందని లెనిన్ నిశ్చయించాడో, అదే వాస్తవానికి సామ్రాజ్యవాదమై నట్లైతే...విదేశాలలో అక్కరలు, పెద్ద పెట్టుబడులు, పెద్ద స్థాయిని లాభాలు, ఆర్థిక దోపిడీ విధానాన్ని భద్రపరచు

కానందుకు విదేశాలపై రాజకీయ అధికారం కల్గి ఉండడం సామ్రాజ్యవాద ముఖ్య లక్షణాలైనట్లైతే సోవియట్ అధికార పరిభ్రమణ మార్గం ఉలిలోపల ఉన్న ఉపగ్రహా దేశాలతో రష్యాకుగల సంబంధ బాంధవ్యాల సరికొత్త విధానం ఈ నిర్వచనం క్రిందికి వస్తుందనేది విస్పష్టం.

అతని సిద్ధాంతం ఉద్భవించి తరువాత గడచిన నలుబది ఏండ్ల కాలంలో, ఇతర సామ్రాజ్య శక్తుల మధ్య "ప్రపంచ విభజన క్రమం గతి తప్పింది. పాశ్చాత్య సామ్రాజ్యవాద శక్తులు తమ అధీన ప్రాంతాలలో నాల్గింట మూడు పాళ్లు త్యజించాయి. కాని రష్యన్ ప్రభుత్వం విసరిస్తున్న సామ్రాజ్యవాదానికి మూలాధారం పెంపొందింది."

# అధికారం – ప్రతిష్ఠ

"కొన్ని ప్రత్యేక పరిస్థితులలోను, పరిమిత వ్యవధుల లోను, అధికారం చరిత్రలో ప్రధానాంశమవుతుంది. ఆర్థిక తత్త్వాలు దానినుంచే జనిస్తాయి; కాని వేరు మార్గాల విడి పోతాయి;" అనే అధికార సిద్ధాంతానికి భిన్నంగా మాస్కో పలుమార్లు ఋజువు పరచింది. "అధికారం పునాదిగా ఉపయోగపడితే ఆర్థిక వ్యవస్థపై కట్టడమౌతుంది," అనే మార్క్స్ సిద్ధాంతం తలక్రిందు చేయబడింది.

సోవియట్ ప్రభుత్వానికి అధికారమే మూలాధారం. సాంఘిక పరివర్తనలను సాధించటానికి కూడా విశృంఖలాధికారం ఉపయోగపడింది. యూరప్, ఆసియాలలో సగ

భాగం "సమాజాయత్తం" చేయుటకు అధికారం పనికి వచ్చింది. నూతన సమాజోద్భవ తరుణంలో అధికారం "మంత్రసానివంటిది" అని మార్క్సు ఒకప్పుడు చెప్పాడు. ప్రాచ్యదేశాలలో అధికార ప్రాబల్యం సామాజిక జీవితం లోని యీ ప్రాథమిక దశను దాటి, చాల ముందుకు చేరు కుంటుందని, అది సహజ భావగర్భితమైన అంశమని మాస్కో నిరూపించింది. అనేక రోజులు, సంవత్సరాలు, తరబడి మన వర్తమాన చరిత్ర యీవత్తూ దాని ఒత్తిడికి లోబడే నడుస్తోందని మాస్కో రూఢి పరచింది.

మన కాలంలో యీ విషయానికి సంబంధించిన పాత్ర లలో విచిత్రమైన తారుమారు జరిగింది. చైనా, బాల్కన్ దేశాలలోని దుర్భర దారిద్ర్యమే స్టాలిన్ విజయాలకు మూలాధారమని మనం తత్వనిరూపణ చేస్తూంటే, స్టాలిన్, తనకు తాను, ఉపగ్రహ దేశాలలోని సామాజిక స్థితిగతు లను గూర్చి శ్రద్ధవహించటమే మానుకొన్నాడు. నూతన ప్రభుత్వాల హయాంలో చాల కాలంవరకు పారిశ్రామిక రంగాన్ని క్లిష్టస్థితి ఆవరించింది. వాణిజ్యం ఛిన్నాభిన్న మయింది. 1946—47 లో ఆగ్నేయ యూరపు దేశాలలో క్షామం ప్రమాద భరితమైంది. 1950 లో చైనా స్థితిగతులు మరీ అధ్వాన్నమయాయి. యుద్ధానికి వ్యతిరేకంగా సన్నద్ధ మయే నిమిత్తం పరిశ్రమ సైనికాయత్తం చేయబడడంవల్ల నిజమైన వేతనాలు పెరుగలేదు, పెరుగజాలవు. ఐనప్పటికీ, ఆతని అధికార యంత్రం ప్రజాస్వామ్యాలపై విశేష పలుకు బడి కలిగి ఉన్నంతవరకు ఉపగ్రహదేశ ప్రభుత్వాలకు ఎట్టి

అపాయం కలుగబోదని స్టాలిన్ విశ్వసించాడు. మార్క్సు సూత్రాలకు విరుద్ధంగా, ఆతని నిమ్న సామ్రాజ్యంలోని ఉత్తర కొరియను సింకియాంగ్ వాస్తవ్యులు వంటి వెనుకబడిన జాతుల ప్రజలు "సామ్యవాద సిద్ధాంతానికి పరిణత పొంది ఉన్నారా అనే సందేహం స్టాలిన్‌కు ఎన్నడు కలుగలేదు. ఈ సామాజిక సమస్యను పరిష్కరించడానికి రక్షక భటులు, సైన్యంచాలునని; రాజకీయాధికారం సాంఘిక క్రమపద్ధతులను సృష్టించునట్టిదే గాని, తద్విరుద్ధంకాదని ఆతని అభిప్రాయం.

బలహీనత లేక వట్టి సిద్ధాంతపలుకుబడిపట్ల ("రోమ్‌లోని పోపు ఎన్ని డివిజన్లు కలిగి ఉన్నాడు?") ఏహ్యభావం, ప్రత్యర్థుల బలాధిక్యతపట్ల (ముఖ్యంగా 1936—40 లో హిట్లర్ పట్ల) గౌరవం స్టాలిన్‌కన్న హెచ్చుగా ఏ రాజకీయ నాయకుడు కలిగి ఉండడు.

రాజకీయాధికారం అధికాధికారాన్ని సృజించడం దాని మానసిక వ్యాపార సహజ లక్షణం. స్వకీయ కార్యాచరణ వల్లనే అది కొంత పరిమితివరకు పెరుగుతుంది, దాని పలుకుబడిని విస్తరించుకుంటుంది కూడా. దాని ప్రకృతి, తత్త్వం, గమ్యాలు ఏమైనప్పటికి ఉన్నత స్థితిని చేరుకొనుటలో జయము పొందిన ప్రభుత్వం ఆ బలాధిక్యతవల్లనే మరొక మెట్టుపైకి పోగలదు. రష్యాలో నేటి రాజకీయ విధానం చాలవరకు మనోవైజ్ఞానిక లక్షణక్రమం మీదనే ఆధారపడి ఉంది. తిరుగులేని విస్తృత రాజ్యాధికారం యెడల అపార భక్తి ప్రపత్తులే సోవియట్ శాంతి, భద్రతలకు మూలము.

రష్యా ప్రజానీకంలో చాల కొద్ది మందికి మాత్రమే కమ్యూనిష్టు సిద్ధాంత విశ్వాసాలపై గురి ఉంది. అన్నిటిని శంకించే మనోప్రవృత్తి ప్రజలలో లేనేలేదు. అధిక సంఖ్యాకులకు రాజకీయ సాంఘిక విధానమంటే యినుము, ఉక్కుతో తయారైన చట్రమనే భావమే ఉంది. భీకర బలాఢ్యులు, 'వారు'; "వారితో" పోరాడటంలో అర్థం లేదని వారు భావిస్తారు. ప్రతి వ్యక్తి 'గడువు తీరేవరకు' తన మనోభావాలను పరిస్థితులకు అనుగుణమైనట్లుగా సరిపెట్టుకోవాలి. సహజంగా బహు కొద్ది మంది మాత్రమే జైళ్లలో నిర్బంధింపబడవచ్చు; ఇతరులకు గుణపాఠం అన్నట్లుగా కొద్ది మంది శిక్షింపబడతారు. మిగతవారు తల లొగ్గుతారు, ప్రతి వాక్య, అభ్యంతరాలు లేకుండా, ఏండ్ల తరబడి అత్యాచారాన్ని సహనంతో ఓర్చుకుంటారు.

ప్రజానీకం యొక్క ఇట్టి మనోవికారాలవల్లనే స్టాలిన్ ఉన్నత పదవిని పొందాడు. ఆతడు చాలా మందిచేత గౌరవింపబడుటకు ఆతనికున్న తిరుగులేని అధికారమే కారణం. ఈ గౌరవం యిష్టుడైన వ్యక్తి పట్ల ప్రేమవంటిది కాదు. పార్టీ సభ్యులనుగాని, తన సన్నిహితులనుగాని లెనిన్, బుఖారిన్‌లవలె అతని వ్యక్తిత్వం ఆకర్షించలేదు. బహిరంగంగా అతడు సత్పురుషుగా కనిపిస్తాడు. అతని వ్యక్తిగత జీవితం ఒక రహస్యంగానే నిలిచి ఉంటుంది. ప్రజాసామాన్యానికి అతని గురించి తెలియదు. అతనికి నిజమైన ఆంతరంగిక మిత్రులు లేరు. కాని ఆతనికి సలిపే పూజమాత్రం స్వచ్ఛమైనది. అది అధికారానికి సలిపే పూజ మాత్రమే.

రష్యాలో ఇదివరకు కమ్యూనిష్టు ప్రొఫెసరుగా ఉండి, ప్రస్తుతం జర్మనీలో "తిరిగి పోనివాడుగా" ఉన్న బెడ్ బులాడ్‌ను నేను కొద్ది నెలల క్రిందట కలుసుకొన్నాను. ఈ శతాబ్దపు మూడవ పది తొలిభాగంలో మాస్కోలోని కమ్యూనిష్టు కళాశాల విద్యార్థిగా ఉన్నపుడు అతని భావాలు ప్రప్రథమంగా "మతవాద" కమ్యూనిజం పట్ల మొగ్గు చూపాయి. తత్ఫలితంగా పొందిన శిక్షగురించి అతడు నాకు చెప్పాడు. అయినప్పటికి పతనానికి ముందు, స్టాలిన్ పట్ల ఆ యువక విద్యార్థి భావన, తనకు తెలియని నాయకునిపై ఉత్సాహపూరితమైన మెప్పుదలగా ఉండెడిది. "స్టాలిన్ కొరకై ఏమైనా చేసి ఉండెడివాడను," "అతని కోసం సంతోషంగా మరణించి ఉండేవాణ్ణి" అని "నేను చెప్పు దానిలో ఎంతమాత్రం అతిశయోక్తి లేదు" అని అతడు చెప్పాడు. స్టాలిన్ కనుపించే కొద్ది బహిరంగ ఉత్సవాలలో (మచ్చుకు అతని తోటివారి అంత్య క్రియలపుడు) భక్తి విశ్వాసాలుగల యువకుల దళంచే అతడు కాపాడబడుతాడు. ఈ భక్తి విశ్వాసాలపైననే అతని జీవితం ఆధారపడి ఉంది. అట్టి యువకులలో బెడ్ బులాట్ ఒకడు. "స్టాలిన్ నిలబడి నా ప్రక్కగా నడచిపోయినప్పుడు నా ఉద్రేకానికి పట్ట పగ్గాలులేవు. అతడు ఒక్క మాటైనా మాట్లాడలేదు, కాని మనుష్యులనందరను అవ్యక్త మానసిక స్థితిలో పట్టి ఉంచినదేదో అతని వ్యక్తినుంచి తేజరిల్లింది." అని అతడు చెప్పాడు. అట్టి రాజకీయ మనోవికారం గురించి టాల్‌స్టాయ్ చేసిన సాటిలేని వివరణ నాకు ఆ

సమయం జ్ఞప్తికి వచ్చింది. యుద్ధం—శాంతిలో యువక లెఫ్టినెంటు, నికొలాయ్ రొస్టావ్ ఒక సైనిక ప్రదర్శన సమయంలో మొట్టమొదటి సారిగా జార్‌కు ముఖాముఖిగా వచ్చాడు. ఆ మనిషినుంచి వచ్చే ఒక్క మాటతో తాను అగ్ని, జలాలగుండా, నేరానికి, మరణానికి, లేక ఘనమైన వీరత్వానికి త్రోసుకు పోవునట్లు నికొలాయ్ భావించాడు, అందువల్ల ఆ మాటయొక్క మూర్తీభవించిన రూపమైన ఆ మనిషిని చూచుటతో గగుర్పాటు చెంది వణకుట తప్పించుకో లేక పోయాడు......చక్రవర్తి కొరకై అక్కడే ఆతడు చనిపోగలిగి ఉంటే, రుస్టావ్ ఎంత సుఖంగా ఉండే వాడు."

పరిపాలకుల యొక్క అధికారానికి పాలితుల భయంతో కూడుకున్న గౌరవం అనుబంధం. బ్రహ్మాండమైన అధికారం, బ్రహ్మాండమైన గౌరవాన్ని పుట్టిస్తుంది. సోవియట్ ప్రజానీకంలో ఇట్టి భయాన్ని లేక భయంచేత గలిగే భక్తి భావాన్ని మనసుకు పట్టించు కొనునట్లుగా చేయటానికి ఎన్నో సంవత్సరాలు పట్టింది. భూమిపై గల ఏ వ్యక్తి, రష్యాలోని ఏ పక్షం ఏ దేశం, లేక దేశాల సమ్మేళన స్టాలిన్‌ను గాని, అతని సమాఖ్యను గాని పరాజయం పొందింపలేవనే గాఢ విశ్వాసము క్రమానుగతంగా రష్యన్ ప్రజానీకంలో అణువణువుకి చొప్పించబడింది. ఈ కార్య సాధనకు అన్నివిధాల ప్రచారం ఉపయోగింప బడింది, అన్నిరకాల నిదర్శనాలు చూపబడ్డాయి.—వృక్షహీనమైన వచ్చికబయళ్లలోని ఎక్కడిదో ఒక తిరుగబడిన గ్రామానికి

పట్టిన భయంకర గతినుంచి అడాల్ఫ్ హిట్లర్ ఆత్మహత్య వరకు ఉరితీయబడ్డ జార్ చక్రవర్తినుంచి, ఉరితీయబడ్డ కమ్యూనిజం యొక్క సామ్యవాద శత్రువులవరకు; ట్రాట్‌స్కీ నుంచి బుఖారిన్ వరకు మూడు దశాబ్దాల క్రిందటి దిగ్బంధన ప్రయోగ విఫలంనుంచి ప్రస్తుతకాలంలో బాల్కన్ రాష్ట్రాలలోను, చైనాలోను, అమెరికన్ విధానం విఫలమవడం వరకు.

అజేయత! సోవియట్ సేనలు ఏలా "ఒంటరిగా" జర్మనీని ఓడించినది, జపాన్‌పై "గట్టి దెబ్బ" కొట్టింది; యూరప్‌ను, 'పూర్వార్ధ గోళంలో సగభాగాన్ని ఎలా విముక్తం చేసింది ఆదిగా గల విపరీతమైన కట్టు కథలను చదివి అమెరికా సంయుక్త రాష్ట్రాలలోని ప్రజలు వాటిని మామూలుగా వెటగాని వీర గాథలుగాను, డంభ ప్రగల్భాలుగాను జమ కడతారు. కాని అవి ఆ వీరగాథలకు అతీతమైనవి. రాజకీయ వ్యవస్థలో వాటికి స్థానం—ఒక ప్రముఖస్థానం—ఉంది. ఈ తలంపు, అజేయతను గురించిన ఈ కట్టు కథ, పైననే సోవియట్ రాజకీయ విధానం నిలుస్తుంది లేక కూలిపోతుంది అని చెప్పడం అతిశయోక్తి కాదు.

## సోవియట్ సమాఖ్య జరిపిన ఆరు యుద్ధాలు

సోవియట్ ప్రభుత్వం బ్రహ్మాండమైన సైనిక శక్తిపట్ల కనుపరచు విశ్వాసం—సరసమైన నూతన పరిభాషలో "బల

సంపన్నత" (dynamism)—రష్యన్ జాతియొక్క యే సహజ స్వభావ లక్షణములనుంచి ఉద్భవించినది కాదు. సంగ్రామములద్వారా పీడిత జనసముద్ధరణను సాధించగలమనే సోవియట్ కమ్యూనిష్టు పాలకుల సిద్ధాంతాలనుంచే అది జనించింది. యావత్ ప్రపంచంపైన తమ అధికారాన్ని విస్తరింపజేయవలెననెడి లక్ష్యంతో ప్రపంచ వ్యాప్తంగా ఉద్యమాన్ని ప్రారంభించువారికి భవిష్యత్తు విపత్పరంపరగా గోచరిస్తుంది. అట్టి విపత్తులలో కనీసం కొన్నింటికైనా ఆ ఉద్యమమే తప్పక 'నాంది' అవుతుందని వారు భావిస్తారు.

వారి భావనరీత్యా ఇట్టి పరివర్తన కాలం సుదీర్ఘమైనది—ఏబది సంవత్సరాలు, లేదా ఇంకా ఎక్కువ—విప్లవాలు, యుద్ధాలతో నిండి ఉన్నది కూడా. లెనిన్ కాలంలో విప్లవానికి ప్రాముఖ్యం ఉండెడిది. స్టాలిన్ రోజులలో యుద్ధానికి ప్రాధాన్యం ఈయబడుతోంది. అయినప్పటికి రెండు సందర్భాలలో ఈ పరివర్తన కాలం విప్లవ జనిత యుద్ధాలు, తదుద్భూత విప్లవాలతో కూడిన ఘోరవిపత్తుల పరంపరగా ఎంచబడింది. శాంతికాముక వాదం సోవియట్ నాయకత్వంచేత సర్వదా తీవ్రంగా తిరస్కరించబడుటేగాక అపహాస్యంతో కూడిన తృణీకార భావంతో కూడ చూడబడుతూంది. ప్రథమ ప్రపంచ సంగ్రామ కాలంలో "ఎంత మూల్యం చెల్లించైనా శాంతిని సాధించాలి" అనే నినాదం "వట్టి అవివేకమైన అడియాస" అని లెనిన్ విమర్శించేవాడు. అయితే యుద్ధం అనేది ఒక ఘోరవిపత్తు; దాని గమన క్రమంలో లక్షలాది మానవులు నాశనమైపోవడం సహజం,

అని కూడా అతడు అంగీకరించాడు. కాని ఆతని సహజ సిద్ధమైన అవిరుద్ధ స్వభావంతో లెనిన్ శాంతి నినాదాలను తిరస్కరించేవాడు. యుద్ధాన్ని కొనసాగించడంవల్ల ఆశింప దగిన ఫలితాలు కలుగవచ్చునని ఆతడు భావించినట్లైతే "అపరిపక్వ" శాంతిని సమర్థింప నిరాకరించేవాడు కూడా.

1904—05 నాటి ప్రథమ, రూసో—జపనీస్ యుద్ధంపట్ల యువక లెనిన్ ప్రదర్శించిన, వైఖరి. ఒకటి రెండు దశాబ్ధముల తర్వాత అంతర్జాతీయ కమ్యూనిష్టు విధానానికి సూత్రప్రాయమైంది. రష్యన్ ప్రజానీకం ఆ యుద్ధంపట్ల తీవ్ర అసమ్మతిని ప్రకటించేవారు. దూర ప్రాచ్యంలో రష్యాకు సంభవించిన, అపజయ పరంపర దేశంలో విప్లవ కార్యకలాపాల విజృంభణానికి ఎంతో సాయపడేవి. 1905 అక్టోబర్‌లో రాజ్యాంగ సంస్కరణలు వాగ్దానం చేయబడిన నాటివరకు రాజకీయ సమ్మెలు, వ్యవసాయ సంబంధమైన అల్లర్లు, ఆక్షేపణ పదర్శనలు, ఊరేగింపులు వెంటవెంటనే జరుపబడ్డాయి; మరుచటి సంవత్సరం ప్రథమ డ్యూమా (పార్లమెంటు) సమావేశ పరుపబడింది. మితవాద పక్షాల వారు సామ్యవాద వర్గాలవారు "ఎంత మూల్యాన్ని చెల్లించైనా శాంతిని సాధించాలి" అని కోరారు, యుద్ధపరిసమాప్తికి గాను జపాన్‌కు ఎన్నో ముఖ్యమైన సదుపాయాలు ఒనగూర్చటానికి గూడా అంగీకరించారు. కాని "యుద్ధం శాంతి సమస్య" గురించిన తొలిప్రకటనలోనే లెనిన్ తన భేదాభిప్రాయాన్ని వెలిబుచ్చాడు.

"రష్యన్ స్వాతంత్ర్య సముపార్జనకు, సామ్యవాద సామాజిక వ్యవస్థా స్థాపనకుగాను రష్యన్ కార్మికవర్గం సలుపుతున్న పోరాటానికి హేతువు నిరంకుశ ప్రభుత్వంయొక్క సైనిక ఓటముల పైననే చాలవరకు ఆధారపడి ఉందని, అట్టి పరాజయాలవల్లనే ఆ హేతువు ఎంతో లాభం పొందింది," అని లెనిన్ వాదించాడు.

రాజ్య తంత్ర పారిభాషిక పదాలను ఉపయోగించటానికి, వాస్తవికోద్దేశాలను మరుగుపరచటానికి నాటివరకు ఎట్టి కారణం లేకపోవుటచేత తాను ఆ యుద్ధ విసర్జనను ఎందువల్ల తిరస్కరించాడో 1916 లో లెనిన్ స్పష్టంగా విశదపరచాడు.

"విప్లవం అంటేనే నియంతృత్వం. నియంతృత్వమనేది సూటిగా హింసపైన ఆధారపడి ఉన్న రాజ్యాధికారం. నాగరికత వెల్లివిరిసిన ఈ యుగంలో, అందులో ఇరువయ్యో శతాబ్దంలో, హింస అనేది సామాన్యంగా పిడికిలి, ఖడ్గాల ప్రయోగం కాక, సేనావాహినుల దాసులని గ్రహించాలి. కార్యక్రమంలోని అంశాలలో 'ఆయుద్ధవిసర్జన'ను ఉంచవలెననడం మొత్తంమీద 'ఆయుధాల ఉపయోగానికి మేము వ్యతిరేకులం' అని చెప్పటే. 'మేము హింసకు వ్యతిరేకులం' అను దానిలో మార్క్సిస్టు సిద్ధాంత లక్షణాలు లేనట్లే 'ఆయుధాల ఉపయోగానికి మేము వ్యతిరేకులం' అను దానిలో కూడా మార్క్సిస్టు సిద్ధాంత లక్షణాలు శూన్యం, అని ఆయుధవిసర్జన నినాదం" అను వ్యాసంలో లెనిన్ ఉదహరించాడు.

ఈ సిద్ధాంతాన్ని స్టాలిన్ పరిపూర్ణం చేశాడు. గొప్ప సాంఘిక విప్లవం ఉద్ధతి పతనాలతోను, పోటు పాటులతోను సుదీర్ఘకాలం కొనసాగగలదని, అది, ఉద్రేకం, దౌర్జన్యం పెల్లుబికే కాలమని ఇప్పుడు గోచరించింది. లెనిన్ వలెనే స్టాలిన్ కూడా 'సైనిక చర్య'ను ఎన్నడు తిరస్కరించలేదు. లెనిన్ చేసిన విభజన ప్రకారం యుద్ధాలన్నింటిని "న్యాయ" "అన్యాయ" యుద్ధాలుగా పేర్కొనడం స్టాలిన్ ఇచ్చగిస్తాడు. లెనిన్ సిద్ధాంత నిర్వచన రీత్యా సోవియట్ సమాఖ్య సల్పే యుద్ధాలన్నీ "న్యాయ" "ప్రగతి" సంగ్రామాలు.

1950-వ సంవత్సరంలో, సోవియట్ "శాంతి ఉద్యమ" ప్రచారం ఉధృతంగా ఉన్నపుడు వెనుక 1930-వ సంవత్సరంలో తాను మాక్సిమ్ గోర్కీకి వ్రాసిన జాబును తొలి సారిగా ప్రచురించడం యోగ్యమని స్టాలిన్ భావించాడు. పాశ్చాత్య రాజ్యాలు (ఇంగ్లండ్, ఫ్రాంసులు) రష్యాపై సాయుధదాడి జరిపే నిమిత్తం తీవ్రంగా ఆయత్తపడుతున్నప్పటికి సోవియట్ ప్రభుత్వం దాని "శాంతి కాముక" స్వభావ విధానాలకే ప్రాముఖ్యత ఇస్తున్నదని ఆ రోజులలో సోవియట్ పత్రికలు చిత్రించేవి. ఆ ప్రచారాన్ని బలపరచే నిమిత్తం, యుద్ధంవల్ల సంభవించే భయోత్పాతాలను ఘోర విపత్తులను సక్రమంగా వర్ణించే ఉద్దేశ్యంతో మాక్సిమ్ గోర్కీ ఒక మాస పత్రికను ప్రచురించ దలచాడు; ఈ ఆలోచన గురించి స్టాలిన్‌కు తెలియజేశాడుకూడా. కాని స్టాలిన్ ఆ అభ్యర్థనను త్రోసిపుచ్చడం మూలంగా పత్రిక వెలువడలేదు. స్టాలిన్ ఈ విషయమై గోర్కీకి వ్రాస్తూ:

"యుద్ధంవల్ల సంభవించే ఘోర విపత్తులను వర్ణించేవి, సామ్రాజ్యవాద యుద్ధం ఒక్కదాని పట్లనేగాక ఏ ఇతర యుద్ధం పట్లనైనా అసహ్యతను ప్రజలలో పుట్టించేవి అయిన ప్రచురణలు పుస్తకాలంగడిలో కొల్లలుగా ఉన్నాయి. ఎట్టి విలువచేయని బూర్జువా సమాధానవాద ప్రచురణలివి. ప్రత్తి సంగ్రామానికి మనం వ్యతిరేకులం కాదు. ప్రతి విప్లవయుద్ధంగా సలిపే సామ్రాజ్యవాద యుద్ధానికి మనం ప్రతికూలురం. అయితే విమోచకము, సామ్రాజ్యవాద వ్యతిరేకము, విప్లవాత్మకము అయిన యుద్ధానికి—అందరకు తెలిసినట్లుగా, అట్టి యుద్ధం ఘోర భయానక విపత్తులు, రక్తపాతాలు లేనిది కాకపోయినప్పటికి, అట్టి ఉపద్రవాలతో నిండి ఉన్నప్పటికి మనం ప్రతికూలురం.

ఒక వంక సోవియట్ ప్రభుత్వోద్యోగులు జరిపే శాంతి ప్రచారానికి వేరొకవంక దాని సిద్ధాంతంలోని యుద్ధోన్మాద ధోరణికి మధ్యగల వ్యత్యాసం, ఒక ప్రక్క అంతర్జాతీయ రంగంలో ఆయుధ విసర్జనను సమర్థిస్తూ, ఎలుగెత్తిచాటే దాని ప్రచారానికి, మరొక ప్రక్క ఆయుధ సముపార్జనకై అది పడే తాపత్రయానికి మధ్యగల భేదం, సోవియట్ ప్రభుత్వ సంస్థలైన విదేశాంగ శాఖ, కోమిన్ టెరన్‌లు రెండూ వెల్లడి చేస్తున్నాయి. వీటిలో మొదటిది (విదేశాంగ శాఖ) "శాంతి" ప్రచారానికి రాజ్యతంత్ర మూలాధారంగా పని చేస్తుంది. రెండవది (కోమిన్ టెరన్) దాని ఆశ్రితుల నిమిత్త నియమావళిని తయారుచేసి కరకు వత్యాన్ని ఎరుకపరుస్తుంది.

ఈ శతాబ్దపు నాల్గవపది తొలి భాగంలో అంతర్జాతీయ ఆకాశ పథంలో లిట్వినోవ్ ప్రభలీనుతోంది. ఆ రోజులలో శాంతి, ఆయుధ విసర్జన అనే మాటలకు విశేష ప్రాముఖ్యత యీయబడేది. "సోవియట్ సమాఖ్య యుద్ధాన్ని సంపూర్ణంగా తిరస్కరిస్తుంది" అని లెనిన్ ఉపదేశాలకు, కమ్యూనిష్టు మూల సిద్ధాంతానికి భిన్నంగా పలుమార్లు నొక్కి లిట్వినోవ్ నొక్కి చెప్పేవాడు. "సోవియట్ సమాఖ్య యుద్ధాన్ని ఒక జాతీయ విధానసాధనగా నిరాకరిస్తుంది." అని ఆయుధ విసర్జన సంఘ సమావేశంలో ఆతడు తెలియజేశాడు.

"సోవియట్ ప్రభుత్వం యుద్ధాన్ని జాతీయ విధాన సాధనగా అంగీకరించనప్పుడు, సేనలును, ఇతర సాయుధ బలాలను ఉంచుకోవలసిన అగత్యం దానికి లేదు."

"సోవియట్ భూభాగంపై సామ్యవాద సామాజిక వ్యవస్థను నిర్మించుకే సోవియట్ ప్రభుత్వంయొక్క ఏకైక లక్ష్యం......దాని లక్ష్యాలను సాధించుకొను నిమిత్తం తన భూభాగాన్ని పెంచుకొనుటకుగాని, ఇతర దేశాల వ్యవహారాలలో జోక్యం కలుగ జేసుకొనుటకుకాని సోవియట్ సమాఖ్యకు ఎట్టి అగత్యం లేదు; అందువల్ల సేనలు, నౌకా బలం, యుద్ధ విమాన దళాలు, తదితర సాయుధ బలాలు లేకుండగనే అదిమనగలదు."

ఇట్టి ప్రకటనలు "సోవియట్ రష్యా ఇతరులచేత దండెత్త బడిననేగాని యుద్ధానికి సిద్ధంకాదు. ప్రపంచ దేశాలన్నిటిలో అది అత్యంత 'శాంతికాముక' దేశం" అనే భావాన్ని కలుగ జేయుటలో విజయం సాధించాయి.

1928-వ సంవత్సరంలో జరిగిన కమ్యూనిస్టు ఇంటర్‌నేషనల్ ఆరవ సమావేశ తీర్మానాలు లిట్వినోవ్ ఉపదేశాలకు పూర్తిగా భిన్నంగా ఉన్నాయి. నిర్వాద ప్రభుత్వాధికారం అప్పుడే స్టాలిన్ హస్తగతమైంది. అంతకు ఒక సంవత్సరం క్రితం ట్రాట్‌స్కీ ప్రవాస శిక్షకు గురిగావింపబడి మధ్య ఆశియాకు పంపబడ్డాడు. అతని అనుచరులు హింసింపబడుతున్నారు. జినోవీవ్, కామెనెవ్‌లు పలుకుబడిని కోల్పోయారు. కోమిన్‌టెర్న్ నూతన సంఘం స్టాలిన్ ఉద్దేశ్యాలనే ప్రతిబింబించేది. స్టాలిన్ సృష్టించిన సంఘమే అది. దాని తీర్మానాలు ఈ నాటి వరకు కూడా, యుద్ధం సంభవిస్తే, కమ్యూనిష్టులకు అధికార ఉత్తరువులుగా ఉపకరిస్తాయి. 1939-45 ల మధ్య అవే అనుసరింపబడ్డాయి; ఇంకను అవి ఆచరణ యోగ్యంగానే ఉన్నాయి. ఆత్మరక్షణ, ఆక్రమణ యుద్ధాలగురించి ఆ తీర్మానాలు నిష్కర్షగా వెల్లడించిన అభిప్రాయాలు లిట్వినోవ్ ప్రపంచ ప్రజలకు బోధించిన ధర్మోపదేశాలకు పూర్తిగా విరుద్ధం. యుద్ధాలు "అనివార్యం" "విప్లవాత్మకం" అందుమూలంగా "అవసరం" అని అవి తెలియజేశాయి. చిరకాల శాంతి సాధ్యత గురించి సోవియట్ సమాఖ్య ఎట్టి భ్రమలు పెట్టుకోదు. ప్రజాసత్తాక దేశాలకు బూర్జువా దేశాలకు మధ్య యుద్ధాలు అవసరంగాను, అనివార్యంగాను సంభవిస్తాయి.

దురాక్రమణ యుద్ధం, ఆత్మరక్షణ యుద్ధంవంటి మామూలు సూచనలు యుద్ధ స్వభావాన్ని నిర్ణయించుటకు ఉపకరించవు. "మరొక యుద్ధాన్ని మేమెన్నడు సంభవించ

సీయము,'' "మరో యుద్ధం లేదు" వంటి గంభీర పద జాలాన్నిటినీ కమ్యూనిజము ఎదిరించవలసి ఉంది.

యుద్ధ నిరోధనకు సంబంధించిన సమాధాన సిద్ధాంతాల నన్నిటిని లెనినిజమ్ ఎదిరిస్తుంది......ప్రపంచ పెట్టుబడి దారీ విధానానికి వ్యతిరేకంగా శ్రామికవర్గ నియంతృత్వాం సలిపే యుద్ధాలు అనివార్యం, విప్లవాత్మకం. ఒక వేళ రష్యా యుద్ధంలో చిక్కుకున్నట్లైతే, అన్ని కమ్యూనిష్టు పార్టీలు శ్రద్ధగా రష్యాపట్ల విశ్వాసం చూపుతవని ఆశింప బడింది. యుద్ధకారణ మేదైనప్పటికి, లేక దానిని ఎవరు ప్రారంభించినప్పటికి ప్రపంచమందంతట ఉన్న కమ్యూనిష్టులు సోవియట్ సైన్యాలను బలపరచుటకు సంసిద్ధులు కావాలి. తమ స్వదేశాలపట్ల వారు చూపవలసిన విశ్వాసానికి, నిర్వర్తించవలసిన విధులకు అతీతమైనదిగా పార్టీ క్రమ శిక్షణను పాటిస్తామని వారు ప్రమాణం స్వీకరించే వుంటారు.

1920–49 మధ్యగల ముప్పది ఏండ్ల కాలంలో రష్యా ఆరు విదేశయుద్ధాలలో చిక్కుకుంది. వీటిలో నాలుగు దురాక్రమణ యుద్ధాలు తక్కిన రెండూ ఆత్మరక్షణ యుద్ధా లుగా ప్రారంభమై దురాక్రమణ యుద్ధాలుగా పరిణమిం చాయి. ఒక్క పర్యాయం మాత్రమే యుద్ధం ప్రకటింప బడింది.

1920 లో సోవియట్ నవప్రభుత్వం ప్రప్రథమంగా (అంతర్యుద్ధానికి, పరప్రమేయానికి వ్యతిరేకంగా సలిపే పోరా టానికి భిన్నమైన) అంతర్జాతీయ యుద్ధంలో పాల్గొనవలసి వచ్చింది. జోసెఫ్‌పిల్సు డిస్కి దక్షతక్రింద పోలెండు

యూక్రైన్ నాయకులతో సంధిచేసుకొని లెనిన్ పంపిన శాంతి ప్రతిపాదనలను త్రోసిపుచ్చి రష్యాపై దండెత్తింది. యుద్ధారంభకాలంలో సోవియట్ ప్రభుత్వం పోలెండులోని రాజకీయ నాయకుల పెద్దవర్గంయొక్క సానుభూతిని, ప్రత్యక్ష సహాయాన్ని అభ్యర్థించి పొందగలిగింది. అదే విధంగా వెనుకటి జారిస్టు, సైన్యాధ్యక్షులను, సేనానులను, ఇతర ఉద్యోగులను కోరింది. వారిలో పునః ఉదయించిన దేశభక్తి శత్రువు బారినుంచి స్వదేశాన్ని రక్షించుకొనవలెననే ఆత్మప్రేరణ లెనిన్ ప్రభుత్వానికి సాయపడ్డాయి. మొట్టమొదట పోలెండు సైన్యాలు విజయవంతంగా యూక్రైన్ అంతర్భాగంలోనికి చొచ్చుకుని పోయినప్పటికి అనుభవం, చాలినంత సాధన సామగ్రి లేక పోవుటవల్ల సోవియట్ ప్రతిదాడులవల్ల వెంటనే తిరోగమించవలసి వచ్చింది. ఎఱ్ఱసేనలు వార్సాను సమీపించగానే రష్యాకు విశేష అనుకూలంగా ఉండి ఉండే షరతులతో సంధిచేసుకొనవలసినదిగా లాయిడ్ జార్జి ప్రతిపాదించాడు. ఆ ప్రతిపాదన ప్రకారం 1945 నుంచి పోలెండు, రష్యాల మధ్య ఏర్పడిన సరిహద్దులకు కొంచమించుమించు సరిపడే రష్యా-పోలెండ్ సరిహద్దు ఏర్పాటు ఉద్దేశింపబడింది. దాదాపు తూర్పు పోలెండ్ అంతా సోవియట్ రష్యాకు దఖలుపడి ఉండేది. ఇంకను అంతర్యుద్ధంలో చిక్కుకొని, ఆరు సంవత్సరాల పోరాటం అనంతరం అలసట చెంది నాశనంచేయబడిన రష్యాదేశం, లండన్, పారిస్, వార్సాలనుంచి ఆశింప గలిగిన దానికన్న ఆ ప్రతిపాదన అధికమే.

కాని, లెనిన్ బ్రిటిష్ ప్రతిపాదనను త్రోసిపుచ్చాడు. పోలెండ్‌ను సోవియట్ రష్యా అంతర్భాగంగా చేసుకొని పశ్చిమంగా జర్మనీ పైకి లంఘించు ఉద్దేశ్యంతో వార్సాకై పోరుసల్పుటకే నిశ్చయించాడు. అంతటితో ఆత్మరక్షణ యుద్ధం, జర్మనీ ముఖ్య గమ్యంగా గల దురాక్రమణ యుద్ధంగా పరిణమించింది. లెనిన్ ప్రోద్బలం వల్లనే శాంతి ప్రతిపాదనను త్రోసి పుచ్చవలెననే నిశ్చయం చేయబడింది. స్టాలిన్, జినోవీవ్, కెమెనెవ్‌లు దానిని బలపరచారు. ప్రతిఘటించిన వారిలో లియోన్ ట్రాట్స్కీ అలెగ్సీరికోవ్, కరల్ రాడెక్‌లు ప్రముఖులు. (వారిలో ఒక్క ట్రాట్‌స్కీ మాత్రమే పోలిట్ బూరోకు చెందినవాడు) "జినోవీవ్ నాయకత్వం క్రింద పెట్రోగ్రాడ్ సోవియట్ బూర్జువా అధికారం విచ్ఛిన్నం చేయబడి, సోవియట్ రిపబ్లిక్ ప్రకటింప బడునంత వరకు పోలెండ్‌తో సంధి పొసగరాదు" అని తీర్మానించింది. కొంతకాలం తర్వాత పోలెండ్ గుండా జర్మనీపై విజృంభించి పాశ్చాత్య రాజ్యాలతో "ఖచ్చితమైన పోరాటాన్ని" సలుప ఆశించినట్లు లెనిన్ తన ఉద్దేశాలను విశదపరచాడు.

పోలెండ్ సోవియట్ రాష్ట్రమై ఉన్నట్లైతేను, వార్సా కార్మికులు ఆశించి, ఆహ్వానించిన సోవియట్ రష్యా సహాయాన్ని అందుకొని ఉన్నట్లైతేను, వెర్సాలిన్ సంధి అంతర్జాతీయ విధానం యావత్తూ చిన్నా భిన్నమైపోయి ఉండేది .............మరి కొద్ది రోజులపాటు ఎఱ్ఱసేనలు విజయవంతంగా పురోగమించి ఉంటే వార్సా స్వాధీనం చేసుకొన

బడుట మాత్రమేగాక—అంత ముఖ్యమైనదిగా ఉండి ఉండేది కాదు—వెర్సాలిస్ సంధికే ముప్పువాటిల్లేది.

దురాక్రమణ యుద్ధాన్ని సలుపుటకు సోవియట్ ప్రభుత్వానికి గల హక్కును సూత్ర ప్రాయంగా, ఈ సందర్భం లోనే లెనిన్ స్థిరపరచాడు. "ఆత్మరక్షణ యుద్ధాలను" "దురాక్రమణ యుద్ధాల" నుంచి ప్రత్యేకింప దలచినవారిని ఆతడు శిక్షించాడు. "ఎంతో కాలం క్రిందటనే వాటి అర్థాన్ని కోల్పోయిన మాటలివి;" "అల్ప బూర్జువా సమాధాన వాదం యొక్క చిలుక పలుకులు.............. యుద్ధ తంత్రానికి సంబంధించిన విషయాలలో, యుద్ధ ప్రేరేపకంగా ఎంచబడేడి ఏ పనిని చేయమని వాగ్దానం చేసినట్లైతే మనం అవివేకులం మాత్రమేకాక నేరస్థులం కూడా" అని ఇదివరలో ఉదహరించబడిన ఉపన్యాస సందర్భంలో లెనిన్ ప్రకటించాడు.

అయిదుగురు ప్రముఖ కమ్యూనిస్టులతో గూడిన పోలిష్ ప్రభుత్వాన్ని మాస్కో ఏర్పాటుచేసింది. అది 1941 నాటి "లుబిన్ కమిటీకి" భవిష్యద్సూచకము. ఎఱ్ఱ సేనలతో కూడా అది ప్రయాణం చేసింది. వార్సా స్వాధీనం చేసుకొనబడగానే దానిని చేరే ఉద్దేశ్యంతో బయలిస్టాక్ వద్ద ముఖ్య కార్యాలయాలను స్థాపించుకొన్నది. కాని వార్సా పడిపోలేదు. 1914 లో "మారన్‌పై సంభవించిన అతిమానుష సంఘటన" వంటి "అద్భుత సంఘటన" ఏదో సంభవించింది. చరిత్ర గమనాన్ని అట్టి "అద్భుత సంఘటనలు" కొన్ని సందర్భాలలో మార్చివేస్తాయి. ఎఱ్ఱ

సైన్యము వెనుకకు తరిమివేయబడింది. వెంటనే మాస్కో యుద్ధ విరమణ ఒప్పందం చేసుకొనవలసి వచ్చింది; తరువాత ప్రతికూల షరతులపై శాంతి సంధిని చేసుకొందికూడా. ఈ యత్న వైఫల్యాన్ని సమర్థించ ప్రయత్నిస్తూ ఉద్యమంలో తప్పటడుగులు వేశారని లియోన్ ట్రాట్‌స్కీ, మార్షల్ తుకచవిస్కీలను స్టాలిన్ తరువాత నిందించాడు.

పోలెండ్ యుద్ధ సందర్భంలో లెనిన్ ఒక ఆనవాయితీని సృష్టించాడు. కమ్యూనిష్టు సిద్ధాంత భాగంలో అదికూడా అంతర్లీనమైంది. ఆక్రమణ యుద్ధాలను నిర్వహించు హక్కు సోవియట్ ప్రభుత్వం కలిగివుంది అనే భావన ఆ విధంగా ఉదయించింది. "విమోచన"—మాస్కో చేత అర్థం చేసుకోబడినట్లు సాధనకు నిరంతర కృషిచేస్తున్న ప్రభుత్వం నల్పే ఏ యుద్ధమైన అందువల్లనే "ధర్మ" యుద్ధం.

1920—1929 సంవత్సరాల మధ్య యూరప్‌లో అల్లకల్లోలాల అలజడి తగ్గింది. కాని ఆసియాలో అటుల కాదు. 1929 లో సోవియట్ సమాఖ్య మంచూరియా సరిహద్దువద్ద రెండవసారిగా యుద్ధానికి తలపడింది. చైనా తూర్పు రైలుమార్గం గురించిన నిరంతర వివాదమే దానికి కారణం. చ్యాంగ్-కై-షేక్ ప్రోద్బలంతో మంచూరియా "యంగ్ మార్షల్" ఛాంగ్ హాషిలియాంగ్ మంచూరియా భూభాగంలోని రుసో—చైనీస్ రైలుమార్గాన్ని పట్టుకొన్నాడు. చైనాదేశీయుల జాతీయ ప్రతిష్ట దృఢ నిశ్చయాల వెల్లువ ఆచర్యలో ప్రతిబింబించింది. ఎంతో కాలంగా సహిస్తున్న అవమానాలు, అన్యాయమైన ఒప్పం

దాల వల్లనే అది ప్రేరేపింపబడింది. తమకుతామై రైలు మార్గాన్ని స్వాధీనంచేసుకున్న చైనావారు సైనిక చర్యలు ప్రారంభించుటకు హేతువేదీ లేదు. మొట్టమొదట శతఘ్నుల కాల్పులే లేవు.

ఆ పరిస్థితులలో మాస్కోకు ఉన్నవి రెండే మార్గాలు. న్యాయస్థానం ఎదుట చైనాపై అభియోగం తెచ్చుట మొదటి మార్గం. అయితే న్యాయశాస్త్ర సంబంధమైన ఆలస్యాలు, అపాయాలతో కూడుకొన్న చిక్కు మార్గమది. బల ప్రయోగం రెండవది. అంతకు కొద్దికాలం ముందు జాతీయ విధానసాధనగా యుద్ధాన్ని నిషేధించు కొల్లాగ్—బ్రయాండ్ ఒడంబడికను సోవియట్ ప్రభుత్వం ఆమోదించింది.

ఎన్నో రాయబార ప్రతిపాదనలు విఫలమైన తరువాత సోవియట్ సేనలు తలపడక తప్పిందికాదు. చైనావారు రైలుమార్గాన్ని స్వాధీనం చేసుకొనిన మూడు మాసాల అనంతరం సోవియట్ సేనావాహినులు ఢీ కొన్నాయి. అయితే మధ్యవర్తిత్వానికి జరుపబడిన ప్రయత్నాల నన్నింటిని మాస్కో త్రోసిపుచ్చింది. ఆ పోరాటంలో వేలాది సైనికులు ప్రాణాలు కోల్పోయారు, తుదకు చైనావారు లొంగివచ్చారు. దాని గమ్యాలను చేరు కొనే నిమిత్తం యుద్ధాన్ని ఒక సాధనగా మాస్కో ఉప యోగించు కుంటుందనే సోవియట్ లక్ష్యాన్ని విదేశ భూభాగంగుండా పోయే రష్యన్ రైలుమార్గాన్ని సంపా దించుటకు అది ఉపయోగించిన ఒత్తిడి స్పష్టంగా ఋజువు పరచింది.

ఒక వంక జర్మనీ, జపాన్‌ల దురాక్రమణ తత్త్వం పెరిగి పోతున్నప్పటికి ఈ నాల్గవ దశాబ్దకాలంలో లెట్వినోఫ్ ఉపదేశాలు—సోవియట్ ప్రభుత్వం ఎన్నడూ యుద్ధాన్ని ప్రారంభించదని ఘంటాపథంగా చెప్పే ప్రచారం—కొనసాగించబడుతూ వుండేది.

1938—39 నాటి "సరిహద్దు సంఘటనల"ప్పుడు, జపాన్ వారి క్వాన్‌టుంగ్ సేవకు వ్యతిరేకంగా ఎఱ్ఱ సైన్యం స్వరక్షణ చర్యలను మాత్రమే జరుపడంవల్ల లెట్వినోఫ్ ప్రచారం యదార్థమేమో అనిపించింది. సరిహద్దు కొట్లాటలు కొన్ని సందర్భాలలో అత్యధికమైనప్పటికి వాటిని పెద్ద యుద్ధంగా పరిణమింపజేయవలెనని జపాన్ ఎన్నడు ఉద్దేశించలేదు. రిచర్డ్ సోజ్ ఆధిపత్యాన జపాన్‌లో అతి సమర్థతతో పని చేసిన గూఢచారుల దళం వారిని ఈ విషయంలో అభినందించవలసి ఉంది. జపాన్ ఎత్తుగడలు; పరిమిత లక్ష్యాలు, సైనిక శ్రేణులలోని బలగాల ప్రయాణం గురించిన విషయాలు మాస్కో తెలుసుకుంది.

1930—39 ల మధ్య, మాస్కో యుద్ధము, శాంతుల గూర్చిన దాని సిద్ధాంతాన్ని వెనుకటివలెనే విపులీకరించ సాగింది. స్టాలిన్, అతని అనుయాయులు నూత్న సూత్రాలను కల్పిస్తున్నారు. 1939-వ సంవత్సరం తొలిభాగంలో ప్రవదా సంపాదకుడు లెవ్ మెఖ్‌లిస్, యుద్ధం సంభవించినట్లైతే "సైనిక చర్యలు శత్రుదేశ భూభాగానికి బదలీ చేయవలసి ఉంది; అంతర్జాతీయంగా మనకున్న విధులను నెరవేర్చి, సోవియట్ రిపబ్లిక్‌ల సంఖ్యను అధికం చేయవలసి ఉంది;"

అని తెలియజేశాడు. ఈ కార్యక్రమంలోని రెండు భాగాలు తగినంత స్పష్టంగా నిర్వచించబడ్డాయి. 1944—47 లలో అవి పూర్తిగా అమలుపరచబడ్డాయి కూడా.

1934 నాటి పదిహేడవ పార్టీ సమావేశ నివేదికలో యుద్ధరాకడ గూర్చి స్టాలిన్ విపులంగా చర్చించాడు. సోవియట్ సమాఖ్యతో పోరుసలిపే "ధనికవాద సేనల" వెనుక భాగంలో తిరుగుబాట్లు, విప్లవాలు జరుగుతాయని అతడు వాగ్దానం చేశాడు. యుద్ధకాలంలో ముస్సోలిని, హిట్లర్, టోజోల ప్రభుత్వాలకు వ్యతిరేకంగా మాస్కో ఆశించిన ప్రజోద్యమాల వలెనే ఈ జోస్యంకూడా కార్యరూపం దాల్చలేదు. 1939 లో ప్రచురింపబడిన స్టాలిన్ రచన కమ్యూనిష్టు పార్టీ సంగ్రహ చరిత్రలో "బోల్షివిక్‌లు అన్ని రకాల యుద్ధాలకు ప్రతికూలురు కారని" అతడు పునశ్చరణ చేశాడు. "అధర్మ యుద్ధాలను" వారు వ్యతిరేకిస్తారు; "విమోచన" గమ్యంగాగల దురాక్రమణ యుద్ధాలనైనా వారు ఆమోదించి బలపరుస్తారు కూడా.

1939 ఆకురాలు కాలంలో సోవియట్ ప్రభుత్వం దాని మూడవ సంగ్రామం సల్పింది. సోవియట్ బలాలు పోలెండ్ సరిహద్దులను దాటు సరికే జర్మనీ పోలెండ్‌పై దండెత్తింది. ఆ చర్యను వియాచిస్లావ్ మాలటోవ్ సమర్థించాడు. "పోలిష్ రాజ్యం అంతమయిందని" వార్సాపతనానికి కొంత ముందుగానే ఆయన ప్రకటించాడు. పోలెండ్‌లో నివసిస్తున్న యూక్రేనియన్లు, బైలోరష్యన్లను విముక్తిపరచుటే

సోవియట్ ఉద్దేశ్యమని ఆతడు తెలియజేశాడు. జాతీయ లక్ష్యాలను యుద్ధం ద్వారా సాధించుటకు ఇదొక నిదర్శనం. సైనిక చర్యలు కొద్ది రోజులపాటే జరుపబడ్డాయి. తూర్పు పోలెండ్ సోవియట్ సమాఖ్యలో అంతర్భాగమైంది.

పోలిష్ ఉద్యమానికి, ఫిన్లండ్‌పై దండయాత్రకు మధ్య రెండు నెలలు మాత్రమే వ్యవధి. సోవియట్ దండయాత్రలలో నాల్గవది. ఆ యుద్ధ కారణం విదేశ ఆక్రమణ కాంక్ష కాదని చూప ఎంత ప్రయత్నించినప్పటికీ, దురాక్రమణ యుద్ధానికి విస్పష్టమైన నమూనాను మాస్కో మరొకమారు సమకూర్చింది. మొదటి ఏడు గుండ్లు ఫిన్లండ్ వైపు నుండే కాల్చబడుటవల్ల రష్యన్ సైనికులు మరణించారని ఓట్టో కుసునెన్ ఆధిపత్యాన ఫిన్నిష్ తిరుగుబాటుదారుల ప్రభుత్వం ఏర్పాటు చేయబడిందని మాస్కో ప్రకటించింది. సోవియట్ ప్రభుత్వం మాటవరసకైనా ఫిన్లండ్‌పై యుద్ధం ప్రకటించలేదు. అయితే సైనిక చర్యలు ఫిన్నిష్ కమ్యూనిస్టు మిత్రులకు కేవలం సహాయం మాత్రమే జరుపుతున్నట్లు చెప్పింది. కాని మాస్కో చూపే సాకులు, సమాధానాలు సత్యాన్ని నిరూపించలేకపోయినాయి; వాస్తవ విషయాలు విస్పష్టమయ్యే ఉన్నాయి. మూడు మాసాల పోరాటం తరువాత సోవియట్ విజయంతో యుద్ధం సమాప్తమయింది.

సోవియట్ సమాఖ్య సల్పిన సంగ్రామాలలో అత్యంత ప్రాముఖ్యమైనది అయిదవ యుద్ధం. విశేష రక్తపాతంతో కూడుకున్న దారుణ యుద్ధమది. జర్మనీకి వ్యతిరేకంగా

సల్పిన సంగ్రామం ఆత్మరక్షణార్థమై జరిపిన పోరాటం; కనీసం మూడేండ్లపాటైనా అది ఆత్మరక్షణ యుద్ధంగానే కొనసాగింది.

అయితే 1944-వ సంవత్సరంలో దాని స్వభావం మారింది. మిత్రరాజ్యాల సైనిక చర్యలు ఉధృతమౌతూంటే, "యుద్ధం" శత్రుదేశ భూభాగానికి కొనిపోబడాలి, "సోవియట్ రిపబ్లిక్‌ల సంఖ్య పెంచటానికి" సేనలు సాయపడాలి. అనే పాత వివాదాలు మాస్కోలో తిరుగ తోడబడ్డాయి. ఈ సూత్రం విపరీత దూరదృష్టికి నిదర్శనంగా ఇప్పుడు సోవియట్ నాయకులచేత ఉదహరింపబడుతోంది. ఎంతగానో కార్య రూపంలో పెట్టబడింది కూడా. పోరాటంయొక్క తుది ఘట్టంలో ఆత్మరక్షణ సిద్ధాంతంలో మార్పు వచ్చింది. పారిభాషిక పదాలను మార్చుటే ఈ నాడు సమయోచితమని ఎంచబడుతోంది. తత్ఫలితంగా ఉపగ్రహ దేశాలు "సోవియట్ రిపబ్లిక్"లుగా కాక, "పీపుల్స్ డెమాక్రసీలు"గా పరివర్తన చెందాయి.

జపానుతో జరిపిన యుద్ధం రష్యా చేసిన యుద్ధాలలో ఆరవది. అప్పటివరకూ రష్యా జరిపిన ఆఖరుయుద్ధంకూడ అదే. రష్యా దృష్టిలో అది ప్రత్యేకయుద్ధంగాని, రెండవ ప్రపంచయుద్ధంలో భాగంమాత్రం కాదు. యూరప్‌లో యుద్ధం 1945 మే మొదట్లోనే పూర్తి అయింది. ఆగస్టు 9 తర్వాతగాని రష్యన్ సైన్యాలు తమ సరిహద్దును దాటి మంచూరియా లోకి ప్రవేశించలేదు. ఆ యుద్ధం జాతీయ

లక్ష్యాల సాధనకు రష్యా స్వయంగా జరిపిన యుద్ధంగాని ఆత్మ రక్షణకోసం చేసినయుద్ధం కాదు. రష్యా సంఘర్షణ లోకి దిగకముందే జపాను జోడించబడింది. తర్వాత ఆరు రోజులకే జపాను లొంగిపోయింది. యుద్ధం దీర్ఘకాలం జరప నవసరం లేకుండానే విజయం తేలికగా లభించింది.

ఈ లోపుగా రష్యా ఆశయాలు, లక్ష్యాలు, కార్య క్రమాలు పటిష్టం చేయబడ్డాయి. రష్యా తాను ఆ యుద్ధాన్ని ఎందుకు ప్రారంభించిందో తన ప్రజలకు చెప్పనే లేదు. ఆ విధంగా చెప్పకపోవడం రష్యన్ చరిత్రలో అంతకుముందెన్నడూ జరిగివుండలేదు. జపానువల్ల కలిగే ప్రమాద మేమిటో వెల్లడించలేదు. మిత్ర దేశాలు సాగి స్తున్న ప్రతి ఘటనలో చేరవలసినదిగా ప్రెసిడెంటు ట్రూమన్ చేసిన విజ్ఞప్తికూడ దానికి కారణంగా కన్పించ లేదు. మాల్టా సమావేశంలో రష్యా కిస్తామన్న ప్రాంతాల విషయంలో స్టాలిన్‌కు ఇవ్వబడిన వాగ్దానాలేమిటో ప్రజలకు తెలియనే తెలియదు. ప్రజాభిప్రాయానికి విలువ సన్నగిలి నందున ఆ విషయాలను వారికి తెలియచేయవలసిన అవసరం లేకపోవచ్చును. రష్యన్ దేశభక్తుల పూర్వ విశ్వాసాలు—పాలకులు చెప్పినది గుడ్డిగా నమ్మడం, ఎదురు ప్రశ్నలు వేయకపోవడం—తిరిగి అమలులోకి రావడం ప్రారంభ మైనాయి.

చైనాలోని ఓడ రేవులను కలుపుకోడం, అక్కడి పారి శ్రామిక యంత్ర పరికరాలను రష్యాకు చేరవేయడం,

జపాను పౌరులచేత వెట్టి చాకిరీ చేయించుకోవడం ఆ యుద్ధం యొక్క ప్రధాన లక్ష్యాలు. రష్యాకు చెందని అనేక పెద్ద ప్రాంతాలు సోవియట్ యూనియనులో కలుపబడ్డాయి.

అంతర్జాతీయ రంగంలో బ్రిటను తనకు ప్రధాన శత్రువని రష్యా చాల కాలందాకా భావిస్తూ వచ్చింది. అందువల్లనే సోవియట్ రష్యా బ్రిటిషు సామ్రాజ్యవాదాన్ని నిరసిస్తూ తీవ్ర ప్రచారం సాగించింది. సమీప మధ్య ప్రాచ్యాలలోని వలసలు, అర్ధ వలసలలోగల ప్రజలు ప్రారంభించిన విప్లవోద్యమాలు బ్రిటిషు సామ్రాజ్యాన్ని విచ్ఛిన్నం చేయగలవని రష్యా ఆశించింది. బ్రిటిషు సామ్రాజ్యం చిన్నాభిన్నమై, బ్రిటిషు ప్రాబల్యం క్షీణించి పోతే కమ్యూనిజం బాగా అభివృద్ధి పొందగలదని భావించబడింది.

జర్మనీ లొంగుబాటుతో తమ లక్ష్యం సాధించబడినట్లు రష్యా భావించింది. బ్రిటను ఆరు దీర్ఘ సంవత్సరాలు యుద్ధంలో పాల్గొన్న ఫలితంగా, దాని శక్తి సామర్థ్యాలు క్షీణించిపోయి, రాజకీయంగాను, సైనికంగాను మిక్కిలి బలహీనమైన దేశంగా తయారైంది. ఇంతలోనే బ్రిటిషు సామ్రాజ్యంలోని కొన్ని దేశాలలో జాతీయోద్యమాలు తలెత్తడం, ఆ తర్వాత కొన్ని సంవత్సరాలకు సామ్రాజ్యం క్రమంగా పతనం కావడం ప్రారంభించింది. పూర్వం 50 కోట్ల జనాభాగల ప్రాంతం బ్రిటిషు సామ్రాజ్యంలో

వుండేది. ఇప్పుడది 10 కోట్ల జనాభాగల ప్రాంతం మాత్రం వున్నది. ఈ పరిణామాల పట్ల సోవియట్ రష్యా తన సంతృప్తిని వెల్లడించింది.

రష్యా తాను ప్రధాన శత్రువుగా భావించిన బ్రిటను యొక్క శక్తిసామర్థ్యాలు క్షీణించడం, అంతకంటె బలవత్తర మైన భాగ్యవంతమైన ఒక సోవియట్ వ్యతిరేక దేశం తలెత్తడం ఒకేసారి జరిగాయి. ఈ సంఘటన చరిత్రలో అతి విచిత్రమైనదని చెప్పాలి. బ్రిటనునుంచి తొలగిపోయిన నాయకత్వం రష్యాకు సిద్ధించలేదు. మరొక ఆంగ్లో—శాక్సన్ దేశానికి లభించింది. బ్రిటనుకు అనేక వలసలు, అక్కడి సహజసంపదలు, అంగబలం వున్నప్పటికీ అది కేవలం అట్లాంటిక్‌లో ఒక దీవిగామాత్రం వుండిపోయింది. అమెరికా జనాభా బ్రిటను జనాభాకంటె మూడు రెట్లు ఎక్కువ. ప్రతి యుద్ధంలోను బ్రిటను తన మిత్రదేశాలకు పారిశ్రామిక వస్తువులను సప్లైచేసేది. ఆ పాత్రను ఇప్పుడు అమెరికా నిర్వహిస్తున్నది. అమెరికాలోని పరిశ్రమలు ఉత్పత్తులలోనేమి, నాణ్యతలోనేమి, బ్రిటిషు పరిశ్రమలకంటె ఎన్నో రెట్లు గొప్పవి. పూర్వం బ్రిటను నాయకత్వం క్రింద యుద్ధకాలపు స్నేహసంధులు, అంతర్జాతీయ ఒప్పందాలు జరిగేవి. అవసరమైన సందర్భాలలో అప్పులను, సబ్సిడీలను ఇస్తూవుండేది. ఇప్పుడు అమెరికా చేస్తున్న సహాయంతో పోలిస్తే అది అతి స్వల్పం.

స్టాలిన్, సోవియట్ పత్రికలు తరుచుగా పేర్కొంటూన్న ప్రపంచ "బలసమీకరణ"లో రష్యా ఒక పక్షానికి,

అమెరికా మరొక పక్షానికి నాయకత్వం వహిస్తున్నాయి. కాని ఆ రెండింటి మధ్య కొన్ని తటస్థవర్గాలున్నాయి. వర్గ సంఘర్షణ సిద్ధాంతాల ప్రకారం బూర్జువాలు, రైతులు, మేధావులు సహజంగా తటస్థంగా వుంటారనీ, పెట్టుబడిదారీ వర్గాన్ని వేరుచేయడానికి వారిని శ్రామికవర్గం వైపుకు లాక్కోవాలనీ పేర్కొనబడింది. ఈనాడు వర్గ సంఘర్షణ ప్రపంచమంతటా వ్యాపించింది. భిన్నపక్షాలకు నాయకత్వం వహిస్తున్న ఆ రెండు దేశాలకు మధ్యగల చిన్న దేశాలు అట్టి తటస్థ ప్రతిపత్తిని కలిగివున్నాయి. అవి యూరప్‌లో రష్యా వెలపలవున్న 16 దేశాలు. జర్మనీని కూడ వాటికి చేర్చవచ్చును. ప్రపంచంలో ప్రస్తుతం జరుగుతున్న సంఘర్షణలలో ఆదేశాలు తమకై తాము శక్తిమంతమైన పాత్రను నిర్వహించలేకపోయినా, అవన్నీ ఎటువైపుకు మొగ్గితే ఆ పక్షానికి ప్రాబల్యం చేకూరగలదు. ఆ దేశాలలో పెట్టుబడిదారీ విధానం సమూలంగా నిర్మూలించబడక పోయినా చిన్నాభిన్నం చేయబడింది. కాని కమ్యూనిజానికి మాత్రం ఇంకా అక్కడ ప్రాబల్యం చేకూరలేదు. ఆ దేశాలన్నింటిపైన ప్రాబల్యాన్ని సంపాదించి అమెరికాతో "అంతిమ యుద్ధం" సాగించాలని రష్యా సంకల్పం.

ఇంతకు ముందు తమ దేశంలో మాత్రమే సాగుతున్న వర్గసంఘర్షణలు ఇప్పుడు ఇతర దేశాలకుకూడ వ్యాపించాయి. రష్యాలో విప్లవానంతరం మిగిలిన శక్తిని సమీకరించి, దానిని విపరీతంగా అభివృద్ధిచేసి విదేశ దండ

యాత్రలకు ఉపయోగిస్తున్నారు. ఒకప్పుడు ఆ శక్తిని వినియోగించే శ్వేతసైన్యాలను ధ్వంసంచేసి శ్రామిక ప్రభుత్వాన్ని నెలకొల్పారు. క్రొత్త సైన్యాలను నిర్మించారు. ఇప్పుడు ఉక్కు-తెర వెనుక దేశాలలో పొంగిపోతున్న ఆ శక్తి కట్టలు తెంచుకొని పశ్చిమ యూరప్, ఆసియాలలోకి విజృంభించడానికి ప్రయత్నిస్తున్నది.

# జాతీయత: నాడు – నేడు

జారిస్టు సైన్యాధ్యక్షులైన సువరోవ్, కుటుజోవ్ లనుగూర్చి విప్లవ పూర్వపు రష్యా వైభవమును గూర్చి ప్రప్రథమముగా స్టాలిన్ ఉదహారించుటకు పూనుకొన్నప్పుడు ప్రపంచమే విధంగా భావించినదీ మనకింకనూ జ్ఞాపకముంది. మాస్కో-లోను, రణరంగమందు రష్యనులు భావించినట్లే «వట్టి ప్రచారం సిద్ధాన్త తంత్రం, వారిని యుద్ధంలో జయం సాధించనివ్వండి. రష్యా పూర్వసిద్ధాంతాలు విస్మరింపబడి మార్క్సిజం - లెనినిజమ్, స్టాలినిజమ్ అవతరిస్తాయి" అని విదేశప్రజలుకూడా తలపోశారు.

స్థూలంగా చూచినట్లైతే యీ సంశయవాదం సరియైనదే అయినప్పటికి యుద్ధానంతరం రష్యాలో యీ నూతనవైఖరి కొంతవరకు వ్యక్తమవుతోంది. కేవలం స్టాలిన్ ప్రదర్శనార్థమే ఈ విధానాన్ని అనుసరించక పోవటమే యిందుకు హేతువు. ఆయా దేశాలవారిని 'మంచి' జాతులవారుగా పేర్కొనడం, కొన్ని జాతులవారికంటె యితర జాతులవారు అధికులు

అని భావించుట యుద్ధానంతరం రష్యాలో ప్రబలమయినాయి. ఈ నూతన ధోరణులు పాతకాలపు కమ్యూనిస్టు సిద్ధాంతాలనుగాని బోధనలనుగాని మార్చివేయుటకు మారుగా వాటితో సమ్మిళితమై పోయినవి. తత్ఫలితంగా 'రష్యను జాతివారు సర్వోత్కృష్టమైనవారు' అనే విచిత్రసిద్ధాంతం రూపొందింది. సోవియట్ సమాఖ్యలోని రష్యనులు మినహాయించి ఇతర జాతులవారు, సోవియట్ వెలుపలి ప్రపంచంలోని ప్రజలు పొందరాని ప్రత్యేక ప్రాంతీయ, రాజకీయ, ఆర్థిక స్వత్వాలకు రష్యా అర్హతకలిగి ఉన్నది అన్నదే యీ సిద్ధాంతంయొక్క ఆంతర్యం.

పక్షరాజకీయాల ప్రసక్తిలేకుండా రష్యను మేధావులందరి వలెనే లెనిన్ గూడా విప్లవ పూర్వపు రష్యా వెనుకబడ్డ దేశమన్న విషయాన్ని అంగీకరించాడు. అయినప్పటికీ తన ఆచార్య సహాధ్యాయులతోబాటు లెనిన్ యీ భావనను అఖిలసామాజిక రాజకీయ తత్వంగా వ్యాఖ్యానించాడు. పురోగామి దేశాలుగా వ్యవహరింపబడే పెట్టుబడిదారీ దేశాలు శీఘ్రగతిని నూతన సామాజిక స్వరూపాన్ని రూపొందించు కుంటున్నాయని (ఎంతో మంది సామ్యవాదులు నమ్మినట్లు) లెనిన్‌కూడా విశ్వసించాడు. అయినప్పటికీ రష్యా అట్టి పురోగామి దేశాలలో ఒకటి కాదు. పరిశ్రమ, దానియందలి కార్మికవర్గము ధనికవాదదశకు పూర్వమున్న సామంత నిరంకుశ వాతావరణంలో విజయవంతంగా పురోభివృద్ధి పొందలేవు. కనుకనే ఈ నూతనావస్థకు ధనికవాద దశపూర్వావశ్యకమని లెనిన్ భావించాడు.

అయితే ట్రాట్‌స్కీ తనకు ఉచితమని తోచినరీతిగా ఈ సమస్యను పరిష్కరింప బూనుకొన్నాడు. వెనకబడిన రష్యాలో ఆసన్నమైయున్న విప్లవం పశ్చిమపురోగామి దేశములలో విప్లవ జ్యోతిర్ పంక్తిని వెలిగించగలదని అతని అంచనా. ఆ విప్లవ విజయ పర్యవసానంగా ప్రపంచ ఆర్థిక వ్యవస్థలోని అత్యధిక భాగం సామ్యవాద పద్ధతులపై పునర్నిర్మాణ మొందగలదు. అప్పుడే రష్యా పాశ్చాత్యపురోగామి దేశాలలో అభివృద్ధి పొందిన సామ్యవాద సహకారంతో పాశ్చాత్య ఆర్థిక వ్యవస్థను పోలిన, తన సామ్యవాద ఆర్థిక వ్యవస్థా స్వరూపాన్ని పటిష్ఠం చేసుకోగలదని ట్రాట్‌స్కీ విశ్వసించాడు.

రష్యను విప్లవమును సూటిగా సామ్యవాదపు అంతర్దశగా చిత్రించినవాడు స్టాలిన్. ఈ విషయంలో ఆయన లెనిన్, ట్రాట్‌స్కీల యిరువురకూ భిన్నుడు. రష్యను సామ్యవాద మనే బిడ్డకు, మాతృమూర్తియైన పశ్చిమార్థగోళానికి నడుమ గల బొడ్డుత్రాటిని స్టాలిన్ ఛేదించాడు. ఇతరులను అనుసరించుటవలనగాక స్వయం శ్రమవల్లనే రష్యా దేశము తన సామాజిక స్వరూపాన్ని రూపొందించుకొనగలదని ఆయన విశ్వాసము. ఇదే అతని 'ఒక దేశంలో సామ్యవాదం' అన్న భావన. ఈ భావనను ఆయన ఆచరణలో పెట్టుసరికే లెనిన్ గతించాడు; ట్రాట్‌స్కీ దేశబహిష్కృతుడయాడు. అంతటితో ఒక నూతన జాతీయభావం అలవడింది. ఆ భావం వీలైనన్ని విధాలా పెంపొందింపబడింది.

తరువాతి దశాబ్దం సాంఘిక విప్లవాన్ని పూర్తిచేసింది; ధనికవాదం మొదలంట పెకిలించ బడింది. పారిశ్రామిక, వాణిజ్య వ్యావసాయిక రంగాలలో 'స్వంత ఆస్థి పద్ధతి' రద్దు చేయబడింది. ఇదివరలో విరుద్ధమైన జాతులుగా విభజింపబడియున్న ప్రజానీకమంతా నేడు వర్గరహిత సమాజంగా రూపొందినదని స్టాలిన్ వాదించాడు. 'జాతీయ ఐక్యత' అన్నది. తొలిసారిగా రష్యాలోనే సాధించబడిందని ఆయన పేర్కొన్నాడు. ప్రచారక యంత్రం రానురాను వర్గకల హానికి సంబంధించిన మాటలను విసర్జించింది. 'శ్రామికుడు, కృషికుడు' అన్న పదాలకు మారుగా కష్టజీవులు అన్న శ్రావ్యమైన సమాసం ప్రయోగించబడింది. నేడు వర్గకలహం, అన్నది చాల అరుదుగా వాడబడుతోంది. వర్గమను మాట కూడ సారస్వతంలోగాని బహిరంగ ఉపన్యాసాలలో గాని చాల అరుదైంది. దేశమంతా విడువడని ఒకే మూసలో పోసిన ముద్దగా భావించబడింది.

అధికార సిద్ధాంతరీత్యా వర్గవ్యత్యాసాలు అంతరించిన కొద్దీ జాతి భేదాలు ముందడుగు వేశాయి. పూర్వం శ్రామికులు ఉత్తములుగాను, కులాకులు అధములుగాను, ధనస్వాములు అధమాధములుగాను ఎంచబడేవారు ఇప్పుడు జాతులే ఉత్తమ, అధమ, అధమాధములుగా వ్యవహరింపబడుతున్నారు. వాల్గా జర్మనీ ప్రాంతాలకు జెందిన జర్మనులు మూకుమ్మడిగా ఉత్తర, ప్రాగ్దిశలకు తరలింపబడ్డారు. తరువాత ఐదు అభిధేయ జాతులవారికీ (టాటార్లు, చెచెన్లు,

యింగిష్‌ల్—కార్మికులు, కరాచియన్లు) ఆ గతే పట్టింది. ఈ శతాబ్దపు రెండవ దశాబ్దమందును, మూడవ దశాబ్దపు ప్రథమ పాదమందునుగూడా రష్యన్ అధికారులు పారిశ్రామిక కార్మికులకు భూస్వామ్య వాకులాక్ తరగతులకు మధ్య వ్యత్యాసాన్ని పాటించారు. మొదటివారు అర్హులైన వారును, విశ్వసనీయులుగాను, పరిగణింపబడేవారు. రెండవ తరగతివారు శిక్షింపబడేవారు. ఆ కాలంలో శిక్షలను అమలు జరుపవలసివచ్చినప్పుడు భూస్వాములు, ధనస్వాములు, కులాక్‌లు బహిష్కరణకు గురయ్యేవారు. కాని పారిశ్రామిక కార్మికులు, కర్షకులు వదలివేయబడేవారు. కనీసం ప్రచారాన్నిబట్టి అయినా అట్టి విభజన, విచక్షణ, శిక్షలు రష్యాలో ఉండెడివని ఇప్పుడు ఊహించవలసి ఉంది. ఆ రకపు విచక్షణలు ఎంతమాత్రము పాటింపబడటం లేదు.

రష్యనుడు సర్వ సద్గుణములకు కేంద్రమూర్తి. కమ్యూనిష్టు వ్యవస్థా నిర్మాత ఈ నూత్న తత్వాన్ని యుద్ధానంతర విజయోత్సవాన్ని పురస్కరించుకొని జరిగిన సభలో తన సైన్యాధ్యక్షులకు స్టాలిన్ స్పష్టంగా ప్రకటించాడు. పాతపద్ధతులకు స్వస్తి చెపుతూ, పై సుగుణాలన్నీ సోవియట్ ప్రజానీకంలో రష్యా జాతీయుని ప్రత్యేకత ఆయన వ్యాఖ్యానించాడు. అతడు "సోవియట్ ప్రజల సంక్షేమంకోసం, అందులో ప్రప్రథమంగా రష్యనుల ఆరోగ్యంకోసం నేనీ

పానీయాన్ని స్వీకరిస్తా" అన్నాడు. హర్షధ్వానాలు, హుర్రా అనే కేకలు మిన్ను ముట్టాయి.

"వారే సోవియట్ సమాఖ్యలోని జాతులన్నింటిలో ముఖ్యాతి ముఖ్యమైన జాతివారు, కనుక అవశ్యంగా వారి ఆరోగ్యంకోసం స్వీకరిస్తా; సోవియట్ సమాఖ్య అంతలో, మన ప్రజానీకమంతటిలో వీరే పురోగామి శక్తులు; నిర్మల మనస్కులు, నిష్కళంకశీలులు, ఓర్మివంతులు వారు. కనుకనే వారి ఆరోగ్యంకోసం యీ రొట్టెను చేత నెత్తుతున్నా. సోవియట్ ప్రభుత్వమందు రష్యను ప్రజలకుగల అచంచల విశ్వాసమే, మానవజాతి విరోధియైన ఫాసిజమ్‌ను నివారించ గల నిర్ధారక శక్తియని ముందుముందు చరిత్రే ఋజువు చేస్తుంది." యీ తరహాలో ఆయన ఉపన్యాసాన్ని కొనసాగించాడు.

సోవియట్ సమాఖ్య ప్రజలో రష్యనుల ప్రముఖపాత్ర గురించి ప్రస్తావించటం ఒక నూతన ధోరణి. సోవియట్ ప్రజానీకమందు 'రష్యనులే అధికులు' అన్న రష్యాలో ఉండిన విప్లవాత్పూర్వపు భావనను తిరగ తోడడమే దాని ఆంతర్యం. వినయ విజ్ఞతలతో మెలగవలెనని యితర జాతులవారిపై ఆధిక్యతను కాంక్షించకూడదనే లెనిన్ యిచ్చిన సలహాకు ఇది పూర్తిగా విరుద్ధం. స్టాలిన్ వెల్ల డించిన భావం ఒక కొత్త జాతి సిద్ధాంతానికి సోవియట్ సమాఖ్య జనసంఖ్యలో సగమేగల రష్యనుల ఆధిపత్యానికి ప్రధాన్యమిచ్చే జాతి సిద్ధాంతానికి అంకురార్పణ.

సోవియట్ నవజాతీయ గీతం 1943 డిశెంబరులో ప్రవేశ పెట్టబడింది. ఇప్పుడు అంతర్జాతీయ గీతికా సమ్మేళనంలో దీనినే పాడుతున్నారు. ఇరవైఆరు సంవత్సరాల విరామానంతరం మొదటిసారిగా "రష్యా" అనే పదము జాతీయ గీతంలో పొందుపర్చబడింది. అంతకంటే ప్రధానమైన దేమంటే రష్యా ప్రజలు సోవియట్ భూమిలోని అన్ని జాతులవారికంటెను అధికులుగాను, వారి నాయకుడు గొప్ప ప్రభుత్వ నేత, సామ్రాజ్య నిర్మాతగాను దానిలో అభివర్ణించబడుటయే. అంతకన్న ప్రధానమైన విషయం.

ప్రతి పదము, తూచి, కాచి, వడపోయబడ్డ జాతీయ గీతం యీ విధంగా ప్రారంభమయింది. "ఘనమైన రష్యా స్వతంత్ర ప్రజాస్వామిక రాష్ట్రాల తిరుగులేని సమాఖ్యను నిర్మించింది." పాత క్రొత్త పదాలు కళానిత్వంగా సమ్మిళిత మయాయి. సోవియట్ సమాఖ్యలోని జాతీయ ప్రజాస్వామిక రాష్ట్రం అంటే స్వతంత్ర ప్రజాస్వామిక రాష్ట్రం అనే భావనను స్ఫురింపజేసే పదములన్ని నవ జాతీయగీతంనుంచి తీసివేయబడ్డాయి. సోవియట్ గీతాలలో నేడు కానవచ్చే "ఘనమైన రష్యా" అనేది యిటీవల కూర్చబడిన నూతన పదం. ఇప్పటి రష్యా, రష్యనులు అన్న పదాల స్థానంలో విప్లవమునకు ముందు ఘనమైన రష్యా, ఘనులైన రష్యనులు అన్న పదాలు వాడబడేవి. ఈ రీతిగా నాడునేడు గూడా యుక్రేనియనుల నుండి, బైలో రష్యనులనుండి, రష్యనులు ప్రత్యేకింపబడుచునే యున్నారు.

రష్యా ప్రజలు సాధించిన విజయాలను పెద్దచేసి ప్రచారం చేయటానికి కమ్యూనిష్టు పార్టీ కేంద్ర కమిటీ ఒక ఉద్యమాన్ని లేవదీసింది. అతి గూఢంగానూ, వేగంగానూ, యీ ఉద్యమ పరిమితులు వ్యాకోచించాయి. పూర్వం పశ్చిమ దేశీయులచే సంశోధించబడిన అన్నిరకాల పరిశోధనలు రష్యనేతరులుగాని, సోవియట్ పౌరులకృషి ఫలితాలుగా పేర్కొనబడ్డాయి. పరిశోధకులు జాబితాలో యుక్రేనియన్, జ్యూ, పోల్, జార్జియనుల నామములు అరుదుగాను, చెర్నోవ్ (ఉక్కు), లోడిజిన్ (ఎలెక్ట్రిక్ బల్బు) పొపోవ్ (రేడియో టెలిగ్రాఫ్), డొలివో డోబ్రోవ్‌స్కీ, పెట్రోవ్, (పెట్రోలు, ఎలెక్ట్రిక్ యింజనీరింగ్), చరపనోవ్ (లోకోమోటివ్‌లు), పొల్జనోవ్ (థర్మో టెక్నిక్), యబ్లోచెకోవ్, లోమొనోసోవ్ మొదలైన రష్యను నామములు సాధారణంగాను కనుపిస్తాయి. ప్రాక్ పశ్చిమ ఉపగ్రహ దేశాలలో రష్యను భాష అభ్యసింప బడవలెనని ఆజ్ఞాపింపబడింది. మంగోలియన్ భాషాభ్యాస విషయంలోగూడా దేశీయ అక్షరాల స్థానే రష్యన్ లిపే వాడబడుతోంది. సోవియట్ సమాఖ్య పశ్చిమ సరిహద్దు ప్రాంతాలలో నివసించుటకుగాను రష్యను రైతులు యెందరో తీసుకొనిరాబడుతున్నారు. లిథూనియాలోని స్థానిక ప్రజలను అధిక సంఖ్యలో దేశంనుండి బహిష్కరించి, ఆ ప్రాంతాలకు రష్యను ప్రజలను తీసుకొనిరావటం యిందుకు తార్కాణం.

ఈ మధ్యనే 'ఘనులైన రష్యను ప్రజలు' అను గ్రంథమొక దానిని ప్రభుత్వ ప్రచురణాలయం ప్రకటించింది. ఏ

విధంగా పుస్తకాలను వ్రాయమంటే ఆ విధంగా వ్రాసే, మిస్ ఎ. పాంక్రొటోవా యీ పుస్తక రచయిత్రి. ఆమె తన గ్రంథంలో ముఖ్యంగా సోవియట్ సమాఖ్య యందలి యితర జాతులనుండి రష్యనులను ప్రత్యేకించి, వారి సాధన సంపత్తి, సాధించిన ఘనకార్యములను విశేషించి క్రోడీ కరించింది. దేశమును పారిశ్రామిక మొనర్చటం, భూము లను జాతిపరం చేయటం, పంచవర్ష ప్రణాళికలు, జాతీయ సంస్థలకు సహాయం, జర్మనీతో యుద్ధం మొదలగు సమస్యల నెన్నింటినో 190 పేజీలుగల యీ గ్రంథంలో చర్చించింది. దానిలో రంజకమగు విషయమొక్కటి లేదు సరికదా. ప్రతీ విషయంలోను రష్యనులను ఆకాశానికి యెత్తటంతోటే సరిపోయింది. లక్ష ప్రతులవరకు ముద్రించబడ్డ యీ తరహా గ్రంథానికి ప్రభుత్వ ప్రచురణశాఖ (ఆలయం) ధనసహాయం చేయుటలోనే రాబోయే పరిస్థితి ద్యోతకమవుతోంది.

అతని మరణానికి ముందు రెండేండ్లలోను లెనిన్ అనేక పర్యాయాలు తన తర్వాత అధికారానికి వచ్చు తన అను చరులను 'రష్యను స్వార్థపరులు' అని తీవ్రంగా విమర్శించాడు. "ఏ కమ్యూనిష్టునైనా గీరి చూడండి. మీకు రష్యన్ స్వార్థపరత్వం ఆతని ప్రతి అణువులోను వెంటనే గోచరిస్తుంది." అని 1922 డిసెంబరులో లెనిన్ వ్రాశాడు.

విప్లవానికి ముందున్న స్థితిగతులను ఆయన జ్ఞాపకముంచు కొన్నాడు. అల్పసంఖ్యాక వర్గాల మనో ప్రవృత్తిపై అత్యంత శ్రద్ధాసక్తి కల్గియుండాల్నని నొక్కి వక్కాణించాడు. 'ఘనమైన రష్యన్ జాతి' విషయంలో అప్రమత్తత అవసరం.

వారిలో గల స్వార్థపరత్వమే అల్ప సంఖ్యాక వర్గాలలో ఈర్ష్యాకారణ మవుతోంది. "మనలోగూడ రష్యా భావం చాల పెచ్చుగావుంది. ఆ భావంతో మనం పోరాడుదాం" అని ఆయన అన్నాడు.

స్వతంత్ర జార్జియా పైనగాని, యుక్రెయిన్, పోలెండుల పైనగాని దాడిజరిపే విషయంలో లెనిన్‌కు యే విధమైన సంశయము లేదు. ఆ విషయంలో ఆయన నిజమైన లెనిన్ వాడే. ఎంత త్వరగా చిన్నచిన్న రాజ్యాలు, సోవియట్ సమాఖ్యలో విలీనమై కమ్యూనిష్టు ప్రభుత్వ చ్ఛాయ క్రిందకు వస్తే అంత త్వరగా రష్యనుల ఆధిక్యత దృఢతర మవుతుందని ఆయన విశ్వసించాడు.

కాకేషియన్ కమ్యూనిష్టుల విషయంలో, స్టాలిన్, జర్జిన్‌స్కీ, అర్జోనికి డ్జ్‌ల విధానాన్ని ఆయన తీవ్రంగా ఖండించాడు. కోపంతో వారిని "శుద్ధ రష్యను డెర్జి మోర్డాలు" అన్నాడు. (జోగల్ వివేచనలో డెర్జి మోర్డా అను దానికి "పశుప్రాయుడూ, మూర్ఖుడూ అయిన రక్షక భటు"డని అర్థం) "ఈ పై ముగ్గురు కమ్యూనిష్టు నాయకులూ రష్యనేతరులే. కాని రష్యనుని స్వభావ ప్రకృతులను అలవరచుకొన్న రష్యనేతరు డెప్పుడూ రష్యను విధానాలను గూడా అధిగమించి పోతాడు" అన్నాడు లెనిన్.

'స్టాలిన్ మొదుకుతనము, అధికార వ్యామోహం, పేరు బడ్డ సాంఘిక అహంభావంపై ఆయనకుండే యీసడింపు, చాల ప్రధానమైన పాత్రను నిర్వహించాయి' అని అన్నాడు లెనిన్. "ఇతరులను సాంఘిక దురహంకారులు, స్వార్థ

పరులు, అని నిందించే యీ జార్జియన్ దేశీయుడు (అతడు ఖచ్చితమైన దురహంకారి, స్వార్థపరుడూ మాత్రమేగాక, పశుప్రాయుడైన డెర్జిమోర్డాగూడా) వాస్తవానికి శ్రామికవర్గ ఐక్యతావసరాలకు భంగం వాటిల్ల జేస్తాడు." అని స్టాలిన్‌ను ఉద్దేశించి లెనిన్ వ్రాశాడు. "మనము పతితజాతుల విషయంలో నియంతల పోకడలను ప్రదర్శిస్తున్నామ"ని లెనిన్ వాపోయాడు.

యిటీవలకాలంలో ద్విజాతీయత ఒడ్డు లొరసింది. అంత ర్జాతీయ కార్యకలాపాలలో సోవియట్ యూనియన్ యేకోన్ముఖంగా అనేక జాతుల సమాఖ్యగా ముందడుగు వేసింది. స్థలబలాధికారాలను సాధించింది. దేశీయ వ్యవహారాలలో సమాఖ్యలోని రష్యా భాగందే పైచేయి. దానికే కీర్తి, ప్రతిష్ఠలు. జాతీయ సామ్రాజ్యవాద రంగాలలో అనుసరించబడుతున్న యీ విధానంకు పూర్వముండే విధానానికి పూర్తిగా భిన్నమై ఉన్నది.

అయినప్పటికీ కమ్యూనిష్టుల అనాది సిద్ధాంతమైన అంత ర్జాతీయవాదం పూర్తిగా 'త్రోసి రాజన'బడలేదు. అదికూడా స్టాలిన్ వాదంయొక్క నూతన సిద్ధాంత సంయోగంలో మిళితమై పోయింది. రష్యాయే కమ్యూనిజమును సాధిస్తుంది. పీడిత ప్రజానీకానికి వెలుగు చూపుతుంది. రష్యా సర్వ సద్గుణఖని. ప్రపంచములోని యే దేశముగాని, యే కమ్యూనిష్టు పార్టీగాని, ఏ వ్యక్తిగాని తమతమ జాతీయావస రాలను రష్యా అవసరాలకొరకు బలిచేయదగునా, కూడదా

అనే సందేహానికి లోనైనప్పుడు మాస్కో వారికి "బలి జేయండి" అనే సలహా యిస్తుంది. అంతర్జాతీయవాదం యొక్క యీ నూత్న భావనవల్ల సోవియట్ సమాఖ్యకు యెట్టి సంశయము జనించదు. అది యేవిధమైన త్యాగమూ చేయనక్కరలేదు. త్యాగములో దానికి పాలే లేదు; సంపాదన, ఆర్జన, లాభములలోనే దానికి పాలు.

ఈ విషయం వచ్చేసరికి ఆదర్శాలు ఉపదేశాలు అడుగున పడతాయి. ఇతర దేశాలు చేయరాదని నిషేధించిన యే పనినైనా రష్యా చేయవచ్చును. లెనిన్, స్టాలిన్‌లచే ఒక నాడు తీవ్రంగా ప్రతిఘటించబడ్డ పరదేశ దురాక్రమణ యీనాడు రష్యాచే 'అభ్యుదయం'గా పేర్కొనబడుతోంది. ఇతర దేశాలలో అక్కరలు, ఆస్తులు ఉంచుకొనకూడదని ఒకప్పుడు రష్యా ఆక్రోశాన్నంతా వెళ్లగక్కింది. సోవియట్ బలాధిక్యానికి ఉపయోగపడునట్టివైతే యీనాడు వాటిని రష్యా ఆకాంక్షిస్తోంది. పరిహారములు, చెల్లుబడులు, చందాలు సామ్యవాద దేశములతో సహా యితర దేశాల్పై ఆర్థిక దిగ్బంధనలు, రష్యాకు యీనాడు సమ్మతమే. అవే కమ్యూనిస్టుల పితృభూమి బలప్రతిష్ఠాభి వృద్ధికి నికరమైన ఆధారాలు.

సర్వసాధారణంగా ఈ కార్యకలాపాలకు సంబంధించిన విషయాలు కొంత భాగమే బాహ్యప్రపంచానికి తెలుస్తాయి. మిగతా విషయాలను గురించిన వివరాలేవీ తెలియవు. సోవియట్ సిద్ధాంతవిధానాల కొత్త ధోరణులవల్ల స్వదేశంలో యెట్టి ఫలితాలు సంభవిస్తున్నాయి అనే విషయాన్ని ఉపే

క్షించి, అంతర్జాతీయ రంగంలో వాటి ప్రాబల్యంవల్ల కలిగిన పరిణామాలపైననే కృషి, అంతా కేంద్రీకృతమవటం జరుగుతోంది. వాస్తవానికి విదేశవిధాన దశలో భారీ యెత్తున కొనసాగింపబడిన కమ్యూనిష్టు జాతీయవాద ప్రచారం త్వరితగతిని పక్వమై ఫలాన్ని కాచి యీనాడొక అశుభ సూచకమైన సమస్యగా పరిణమించింది. రష్యాయొక్క వివిధజాతుల మధ్యనుండే సంబంధాల వైపుకు దృష్టి సారిస్తే యీ విధానం నిమ్మదీ, చడీచప్పుడూ లేనిదీ, ప్రకటనారహితమైనదిగా వుంది. పూవు పూర్ణంగా వికసించలేదు. దాని ఆకర్షణ పత్రాలు యింకా మూసుకొనే ఉన్నాయి.

బాట తెరువబడే వుంది; దిశ నలుగురికీ తెలిసే ఉంది.

## సామాజిక విప్లవ పరిసమాప్తి

నూతన జాతీయతా భావపు వెల్లువతోబాటు రష్యాలో సామాజిక విధానాల స్థిరత్వం, రెండవతరం వారి శీఘ్ర పురోభివృద్ధి యుద్ధానంతర కాలంలో ప్రాముఖ్యానికి వచ్చినవి.

ఈనాటి సామాజిక స్వరూపానికి సంబంధించి నంతమటుకు ఏ విధమైన క్రొత్త వెలుగు కానుపించలేదు. ఎగువ దిగువ తరగతులు వారిజీవన స్థాయిలు, సాంస్కృతిక ప్రమాణాలు, ఒండొరుల మనోభావాలు మొదలుగా గల దాని వివిధాంగాల మధ్య ఉండే సంబంధ బాంధవ్యాలు ముఖ్యంగా యుద్ధానికి ముందువలెనే ఉన్నాయి.

ఈ నూతనావస్థ మూలంగా పై అంతస్థులవారికి పూర్వపు దర్జాలు ఒకదాని తర్వాత నొకటిగా తిరిగి పొంద గలమనే ఉత్సాహం కలిగింది. గ్రామ ఆర్థిక వ్యవస్థలో కొల్ఖోజ్ విధానం నిబంధనలు కొంతవరకు సడలింపబడి వ్యక్తి గత క్రియారంభానికి అవకాశం కలుగజేయ బడుతుందని కొందరు ఆశించారు. ప్రతి శ్రామిక కుటుంబం తమ వంతుకు ఒక గుఱ్ఱం చొప్పున ఉంచుకొనే అవకాశ ముంటుందని అనేకులు భావించారు. ఉద్యోగస్తులు వారి అభీష్టాను సారం ఒక ఉద్యోగంనుంచి మరొక ఉద్యోగంలోనికి మారు టను నిషేధించే కట్టుదిట్టమగు చట్టం రద్దుచేయబడుతుందని మరికొందరు విశ్వసించారు. అంతర్జాతీయ భద్రతయొక్క కొత్తదశ అంటే, చిన్న సైన్యం కొద్దిపాటి ఆయుధ సామాగ్రి, పరిమితమైన అధికార నిరంకుశత్వం కలిగియుండటం, పది లక్షలమంది పొలిట్ కామిసార్లు, ప్రచారకులు, M. V. D. వారు, సైనికాధికారులు ఉద్యోగములనుండి తొలగించ బడటం మాత్రమే కాదేమోననే దిగ్భ్రాంతికి, ఇతరదేశ ప్రజవలెనే చాలామంది రష్యాలో కూడ లోనయ్యారు. అయితే అట్టిదేమీ సంభవించలేదు. సామాజిక విధానం పునరుద్ధరించబడి దృఢతరం చేయబడింది. దానితో కమ్యూని జంలో ఒక ప్రముఖ మానసిక పరిణామ ఘట్టం పూర్తయింది.

కమ్యూనిష్టు విశ్వాసంయొక్క అంతరాళంలో శక్తి భక్తి ప్రదాయకాలైన రెండు నైతిక సామాజిక సిద్ధాంతా లున్నాయి. కష్టమంతా అశేష ప్రజాబాహుళ్యానిదే

అవడం, పేదసాదల మధ్య తీవ్రమైన అంతరాలుండడం, నైతికంగా ఘోరం అనేది మొదటిది. వస్తోత్పత్తి సాధ నాలను అధీనము౦ దుంచుకొని, కూలీలను నియమించి, వారి కాయకష్టాన్ని కొంటూ, తద్వారా డబ్బు చేసుకొనే పద్ధతి నీతి బాహ్యమనేదే రెండవది.

నమ్మ శక్యంకానంత అధ్వాసంగా ఉన్న రష్యా ప్రజా సామాన్యం యొక్క జీవనస్థాయి, రాజకీయ విప్లవంవల్లనే పై స్థాయికి తేబడగలదు, తేబడుతుంది, అనేడి ఆశా వాగ్దానాలనుంచే రష్యాలో 1917 కు పూర్వం విప్లవోద్యమ చైతన్యం జనించింది.

లోప భూయిష్టమైన ఆర్థిక వ్యవస్థ, పాపపంకమైన దోపిడీ తత్వం, సుంకాలు, వికలాంగమైన విద్యావిధానం మొదలైన వన్నీ పాతబడిపోయిన ప్రభుత్వ విధాన కారణంగాను, పర్యవ సానంగాను దాపురించినవేమో ననే భావం కలిగింది. ముఖ్యంగా భూస్వాముల జమీాల పంపకమే శ్రమజీవుల కష్ట పరంపరలకు "తుదముట్టింపు"గా ఊహించబడింది. పెరుగు దలకు, అభివృద్ధికి స్వేచ్ఛావకాశముంటే రష్యను ట్రేడు యూనియనులు శ్రామికుల వేతనాలను ఉన్నత స్థాయికి తేగలవని తలపోయబడింది. ఉద్యమారంభంనాటికి శ్రామి కుల, పారిశ్రామిక కార్మికుల సంఖ్య 15 కోట్లవరకు అంటే రష్యా జనాభాలో 100-కి 85 వంతుల వరకు ఉండినది.

రష్యా విప్లవోద్యమంలోగల వివిధసిద్ధాంత వైరుధ్యాల మధ్య యీా విషయానికి సంబంధించి నంతమటుకు యేవిధ మైన అభిప్రాయ భేదాలు లేవు. శ్రామిక ప్రజాబాహుళ్యం

యొక్క అభివృద్ధియే రాబోవు పరిణామంయొక్క ప్రధాన వస్తువుగా నారోడ్నిక్ (పాపులిస్టులు) పక్షంవారు భావించారు. మార్క్సువాదులు లెనిన్‌తో సహా దీనిని శ్రామికోద్యమంగా తలపోశారు. వారుకూడా విప్లవానంతరం శ్రమ జీవుల జీవన ప్రమాణాలలో అభివృద్ధి కలుగుతుందనే ఆశించారు.

ఈ ఆసన్న విప్లవం ద్వారా ముఖ్యమైన అభివృద్ధి, అంటే, నూటికి 5 నుంచి 8 మంది వరకుగల ప్రజలకు మాత్రమే సుఖజీవనం కలుగుతుందని, పాతకాలపు ఉన్నత వర్గీయుల స్థానాలను వారు ఆక్రమిస్తారని ఎవరైనా అభిప్రాయాన్ని వెలిబుచ్చి వున్నట్లయితే తీవ్రంగా తిరస్కరింపబడి ఉండేది. 1918—1925 సంవత్సరాలమధ్య విప్లవం సర్వసమానవాద, ధనిక వ్యతిరేకవాద సిద్ధాంతాలతో ఘనతచెందింది. జీవన ప్రమాణాలను సమతలానికి తెచ్చే ఉద్దేశంతో వ్యక్తి నిర్వాహిత పరిశ్రమ, వక్తిగత ఆస్థి జాతీయం చేయబడ్డాయి. ఈ పర్యవసానం కోసం వందలాది తీర్పులు, ఉత్తర్వులు చేయబడ్డాయి. ఈ గమ్యాన్ని శీఘ్రంగా చేరుకోవటం కోసం ఎంతో నెత్తురు స్రవించింది. సర్వసమత్వవాదానికి ఏవైనా మినహాయింపులు చేయవలసివస్తే సిగ్గుచేటుగా తల పోయబడి గోప్యంగా ఉంచబడ్డాయి.

రష్యాలో యీ పంథాన తీసుకోనబడిన అసమర్థ, అశాశ్వత చర్యలు నాకు బాగా జ్ఞాపకమున్నాయి. 1918 లో రైల్వే సర్వీసులో విప్లవాత్మకమైన మార్పులు తేబడ్డాయి. ధనికులకు (ఒకటి రెండు తరగతుల బండ్లు)

బీదలకు (మూడవ తరగతి పెట్టె బండ్లు) మధ్యవ్యత్యాసం చూపే విధానం రద్దు చేయబడి ఒకేఒక టారిప్ విధానం ప్రవేశ పెట్టబడింది. అయినప్పటికి కొన్ని వారాలలోనే ముందు గమనిక లేకుండానే ప్రతి రైల్వే బండిలోను ఒకపెట్టె "డెలిగేట్లకొరకు" అన్న గుర్తుతో ప్రత్యక్షమయింది. ప్రజలచే ఎన్నుకోబడి, విప్లవానంతరం జరిగిన అనేక సభలకు, సమావేశాలకు పోనుద్దేశింపబడిన స్త్రీ పురుషులకు, పార్టీ, ప్రభుత్వ వ్యవహారాలమీద రాష్ట్ర సోవియట్లకుగాని, మాస్కోకుగాని ప్రయాణంచేసే వ్యక్తులకు అన్నింటికన్న సుఖతరమైన యీ పెట్టె ప్రత్యేకింపబడింది. ప్రజలచే ఎన్నుకోబడి, ప్రజా విశ్వాసాన్ని చూరగొన్న ప్రతినిధులకు ప్రయాణ సమయాలలో కొంత సౌఖ్యాన్ని పొందే హక్కు ఉన్నది అనేదే దాని తర్కం. ఆనాటినుంచి ప్రతి అధికారి ఎన్నుకోబడినా లేకున్నా ప్రతినిధి హోదాలో ప్రయాణం చేసేవాడు. 1918-21 నాటి ప్రతినిధుల సమూహాలు పూర్వం తాము భరించిన అగచాట్లకు, దుస్థితికి బహుకృతిగా, చారిత్రక న్యాయం వారికి యీ ప్రత్యేక హక్కును ప్రసాదించిసదని సమాధానపడేవారు. సమానత ముసుగులో ప్రప్రథమంగా ప్రత్యేకింపు ప్రత్యక్షమయింది.

ఉన్నత ప్రభుత్వోద్యోగులు కొన్ని సామాన్య సదుపాయాలను—ప్రత్యేక గదులను, వారి వ్యవహార గమ్యాలకు జారవేసే కార్లను—పొందగల్గటం గూడా [illegible] ఈ ప్రత్యేక హక్కులను కలిగియుండే విషయమై ఆదిలో వారు తమ ఆత్మలను, అనుచరులను సమాధానపర్చుకో[illegible]

వలసివచ్చేది. లెనిన్ ఎప్పుడూ పరిశుభ్రంగా దుస్తులను ధరించలేదు. బ్రెస్టు—లిటోవ్‌స్క్ శాంతి సమావేశంలో అతని అనుచరులు కూలీల దుస్తులలో, మాసిన పాదరక్షలతో సగర్వంగా విన్యాసాలు చేశారు. అందమైన తివాసీలు, స్వాగతాలు విసర్జింపబడ్డాయి. అంగరక్షక, సైన్యదళ సమేతంగా, సదుపాయంగా ప్రయాణంచేసిన కారణంగానే ట్రాట్స్కీ తీవ్ర విద్వేషాన్ని ప్రేరేపించినవాడయ్యాడు. ఎట్టి సౌఖ్యాల విషయమై ట్రాట్స్కీని దుయ్యబట్టారో అంతకు వంద రెట్లు అధికంగా యీనాడు ప్రతి రాష్ట్రకమిటీ కార్యదర్శి సౌకర్యాలు అనుభవిస్తున్నాడు.

స్వేచ్ఛావాణిజ్యాన్ని ప్రవేశపెట్టి, విదేశ పెట్టుబడులకు దేశంలోనికి దొడ్డిదారిన ప్రవేశమిచ్చి 1921-వ సంవత్సరంలో మొట్టమొదటి సారిగా అధికార పక్షాన N. E. P. సమస్త సిద్ధాంతాన్ని అతిక్రమించింది. ఈ కృత్యం పార్టీ ప్రాథమిక నియమాలకు యే విధంగాను వ్యతిరేకంగాదు. సోవియటు సిద్ధాంత భావంయొక్క పరిణామంగా గాక సమయోచిత స్వరూపంగా, పాతబడ్డ ప్రపంచపు అలవాట్లకు చతురమైన సమ్మతిగా, తాత్కాలిక మాయోపాయంగానే N. E. P. అవతరించింది.

ఉత్తరోత్తర రెండు లక్షణాలూ వైరుధ్యాలు కాజొచ్చాయి. వ్యక్తిపరంగావున్న ఆస్థి, వర్తకాలు నిషేధింపబడ్డాయి. అవరోధాలు అధికం జేయబడ్డాయి. 1929-వ సంవత్సరాంతానికి వ్యక్తినిర్వహిత వ్యాపారం చట్టబాహ్యం చేయ

బడింది. దానితో బ్యాంకులు, పారిశ్రామిక సంస్థలు మొదలగు ప్రాముఖ్యం గల ఏ స్థిరాస్థి లేకుండాపోయింది.

అదే సమయంలో నూతన సమాజంయొక్క అంతస్థుల నిర్మాణం శీఘ్రగతి దాల్చింది. ఒకే తీరు ప్రజానీకంలో బీద, సాద అనే సామాజిక విభాగాలు పొడచూపాయి. ఈ విభజనాక్రమానికి అధికారానుమతి, సహకారం తోడయ్యాయి. అత్యధికంగా ఆర్జించాలనే ఆశ ఆర్థిక రంగంలో పెచ్చు పెరిగింది. ఇప్పుడు అతిభాగ్యం, అతి దారిద్ర్యం స్వభావంగా అవతరించిన సమాజంయొక్క తరువాత విభజనాక్రమమంటే కమ్యూనిజం కళ్లుమూసుకో జొచ్చింది. అదే మూడు దశాబ్దాల పరిణామంయొక్క కుత్సిత ఫలం.

ఈ పరిణామ పర్యవసానంగా ముందు వారు వెనుకకు నెట్టబడ్డారేగాని వెనుకవారు ముందుకు రాలేకపోయారు. ఈ యదార్థాన్ని గుర్తించికూడా కమ్యూనిష్టు నాయకులు యేమాత్రం చలించలేదు. ప్రజలలో కొద్దిమంది మాత్రమే ముందడుగు వేయగలిగారు. ఈ అలజడి ప్రజానీకంలో— అవ్యక్తులు, విధేయులు, తటస్థంగా వున్నవారి విషయంలో —అనేక మార్పులను తెచ్చింది. చితికి శిథిలమైపోయిన ఒక వర్గంస్థానే మరొకవర్గం ప్రతిష్ఠింపబడడం సమానతపేరిట జరిగింది. "మానవులందరు సమానులే"—"దోపిడీ విధానం అంతమొందాలి" అనే నినాదాలు క్రొత్తవే అయినా యీ పునఃప్రతిష్ఠలో "(Ote toi de la que je m'y mette) నీవువై దొలగు—నీ స్థానాన్ని నేనాక్రమిస్తా" అనే అంతరార్థ

మెప్పుడు ఒకటే. అయితే కొత్త అంతస్థుల నిర్మాణం సాగ సైన విధానాలద్వారా సాధించబడలేదు. దాపరికానికి యినుపతెర అవసరమైంది.

కమ్యూనిష్టుపార్టీ కేంద్ర కమిటీలోని ఏర్పాట్లను ఖచ్చితంగా అనుసరించటం ద్వారా యీనాడున్న కొత్త అధికార వర్గం రూపొందింపబడుతోంది. చాల సంవత్సరాలవరకు స్టాలిన్ దాని సర్వాధికారి. నూతన అధికారవర్గ నిర్మాణ నిర్వాహకుడుగా అతని పాత్ర తుదలేని అధికారం అంతులేని స్తోత్రపాఠపరంపరలతో ఘనత చెందింది. లెనిన్ నాటినుండి ఉద్యోగ నియామక వ్యవహారాలను సర్వాధికారాలతో సహా స్టాలిన్ తన అధీనమందుంచుకొనేవాడు. ఆయన కొంత మందిమీద అధికార ప్రభావాలను వర్షించేవాడు; మరి కొందరిపైనుంచి ఆదరాన్ని తొలగించేవాడు. ఇంకా కొంత మందిని మృత్యుగహ్వరానికి సాగనంపేవాడు. బ్రతికి బైటపడ్డవారు ధన్యోస్మి అనాలి—మరణించిన వారిని మరచి పోవాలి.

వెంటాడించటం, బహిరంగ నిందారోపణలు, అరెస్టులు, దోషపరిహారాలు, జైలుశిక్షలు, ఎగ్జిక్యూషనులు అంటే «నీవు చనిపోవాలని గుర్తించుకో» అనే హెచ్చరికను స్ఫురింప జేస్తాయి. ఒకడు భయభ్రాంతుడవతాడు. మరొకడు విధేయుడై మార్పును కలగంటూ మరీ జీవిస్తాడు.

ఉపగ్రహ దేశాలలో యుద్ధానంతరం అధికారానికి వచ్చిన కమ్యూనిష్టు నాయకుల ధోరణులను పర్యాలోకిస్తే బహుళంగా ఉద్యమ ఫలితంగావచ్చిన నూతనావస్థ అర్థ

మవుతుంది. సమత్వం, త్యాగం, వినయం అనబడే ముళ్ళ మార్గంగుండా ప్రయాణం చేయడానికి ఆ నాయకులెప్పుడూ ప్రయత్నించలేదు. ఒకసారి అధికారం చేతబట్టాక తిరిగి సర్వసమత్వ వాదాన్ని మిషగా చేసుకోలేదు.

స్వదేశ ప్రజల, విదేశ ప్రేక్షకుల కళ్లయెదుట సుందర మందిరాలలో వారు జీవించేవారు. వారికి అనేక మంది సేవకులు, ప్రత్యేక రైళ్లు, విమానాలు ఉండేవి. మాస్కో పద్ధతులలో విందులారగించేవారు.

యుద్ధానంతరం జర్మనీ తీవ్ర దుస్థితికి లోనుగాగా క్రొత్త నాయకులు వారి వ్యక్తిగత జీవితాలను సుఖమయంజేసుకో నారంభించారు. జాతీయం చేయబడ్డ సుక్షేత్రాలైన భూములు యీనాడు ప్రజల ఉమ్మడి సొత్తుగా పేర్కొనబడుతున్నాయి. కాని యదార్థానికి జర్మన్ గడ్డపైనున్న స్టాలిన్ మానస పుత్రులే వాటిని అనుభవిస్తున్నారు. పై విషయాలను విన్నప్పుడు తూర్పు జర్మను కమ్యూనిస్టులు యావన్మందీ అంతులేని ఆశ్చర్యానికి లోనయ్యారు. నాటినుంచి కమ్యూనిస్టు పార్టీ క్రొత్త అధ్యక్షుడు 'విల్ హెల్మ్'ను 'మూడవ విల్ హెల్మ్ చక్రవర్తి' అనే పరిహాస నామంతో పిలిచేవారు. అతని జమీాకి 'పిమొకిస్తాన్' అని నామకరణం చేశారు.

రుమేనియా అగ్రకమ్యూనిస్టు ఏనాపాకర్ యొక్క జీవితస్థాయీ ప్రమాణాలను గూర్చి 'లైఫ్' పత్రికలో 'హాల్ లెహ్మన్' యీ క్రింది విధంగా వివరంగా చిత్రించాడు.

"నివసించే యింటి విషయంలో గూడా పాకర్ దంపతులు సగర్వంగా సంచరిస్తారు. స్నెగేవ్ సరోవర ప్రాంతాన

నిర్మింపబడ్డ 47 గదుల రాజనగర్‌ను వారు ఆక్రమిస్తారు. అంతేగాక కనీసం మూడు పట్నవాసపు గృహాలైనా వారి కున్నాయి. వీటిలో ఒకదానికి విద్యుదాధారక ద్వారాలు, 24 సీట్లు గల భోజనశాల ఉన్నాయి. కెరోల్ రాజు ఒకప్పుడు మాగ్‌డాలుపెస్కూకు యిచ్చిన సర్వ సదుపాయాలు గల దివ్యభవనం కూడా యీ మూటిలోనిదే. పారిస్‌లో స్థిరనివాస మేర్పరచుకొన్న ఒక ప్రముఖ ఔషధాల వ్యాపారికి రష్యాలో గల భవనం వీరి మూడవ పట్నవాసపు వసతిగృహం. తన వివిధ భూవసతులను కాపలా కాసే చిన్న సైనికపటాలంయొక్క సామర్థ్యాన్ని పెంపొందించేందుకు ఏనాపాకర్ ఒక వేటజాగిలాన్ని పెంచుతోంది. మార్షల్ టిటోన్ ఆమె యెంతగా ద్వేషించినా, యీ విషయం వచ్చేసరికి ఆయనను అనుకరించి తీరుతోంది.

రష్యానుంచి తిరిగివచ్చిన కొద్ది రోజులకే రుమేనియా రాజధానిలోనున్న వస్త్రశాలలన్నింటిలోను పెద్దది, విలువైనదీ అయిన డిపార్టుమెంటు స్టోరుకు ఏనాపాకర్ వెళ్లింది. తన స్వంత ఉపయోగార్థం ఒక పడవనిండే విలువైన దుస్తులు, పాదరక్షలు, చేసంచీలు కొంది. దుస్తులమ్మే బాలిక కన్నులు పెద్దవి చేసుకొని వింతగా చూచుటతో ఏనాపాకర్ బుసలు కొడుతూ 'కమ్యూనిష్టు చింకిగుడ్డలు కట్టాలనానీ భావన' అని గద్దించింది. ఆమె దుస్తులు ఆరవేసుకొనే జాలకట్లకు యీనాడు రుమేనియాలో లభ్యమయే అందమైన దుస్తులన్నీ అమర్చబడి ఉంటాయి. దుస్తులంటే ఆమెకుండే విపరీతమైన మోజుకు ఆమె విశ్వాసపాత్రులైనవారు కూడ

వెనుదిరిగి నవ్వుకుంటూరు. ఎంతటి విలువైన కోరికైనా ఆమె యీడేర్చుకొంటుంది. ఆమె అభిలాషను యెవ్వరూ విమర్శించరు. ఇంతైనా రుమేనియా దేశపు గొప్ప అందకత్తె కాలేకపోవటం ఆమె దురదృష్టం అయినప్పటికీ ఆమె నవనాగరిక లక్షణాలు ఉట్టిపడే ప్యాషను దుస్తులను విస్తారంగా ధరిస్తుంది. బుఖారెస్టులోని వస్త్రశాల లన్నిటిలోకన్న అందమైన దుస్తులుండే వెయిజర్ దుకాణంలోను, ఉన్నివస్త్రాల నమ్మే అంగళ్లలో శ్రేష్ఠమైన రీచ్ దుకాణంలోను ఆమె తరుచు విస్తారంగా వస్త్రాలు కొంటుంది. పారిస్ నుంచి ఆమె కోసం ప్రత్యేకంగా తయారయిన దుస్తులు వస్తాయి.

అన్ని ఉపగ్రహ దేశాలలోను వెనుకటి సమాజంలోని ఉన్నత వర్గీయులను కమ్యూనిష్టుపార్టీ తొలగించింది. వారి రాజకీయ కార్యకలాపాలను కొనసాగించటంకోసం తన సభ్యులకు విశేషాధికారాల నిచ్చింది. అగ్నిపర్వతాగ్రాన వెల్లుబికిన ఉష్ణశిలాద్రవం గడ్డకట్టినట్లు నూతన వ్యవస్థ స్థిరపడింది. ఆ విధంగా పైకివస్తున్న ఉన్నతవర్గం స్థిరాస్తులు, క్రొత్త తరహాలు సమకూర్చుకొంది.

సామాజిక విభాగాలు యథాతథంగానే ఉన్నాయి. కాని వాటి కూర్పే మారింది. పూర్వపు ఉన్నతవర్గాల వారి స్థానాలను నూతన శక్తులు ఆక్రమించుకొన్నాయి. తూర్పు యూరప్, దూరప్రాచ్యాలలో యిప్పుడు కలుగుచున్న సంచలనం యొక్క ప్రధాన ఫలితమిదే.

ఆయా దేశ ప్రభుత్వాల ప్రకటనలకు భిన్నంగా ప్రాచ్య దేశాలలో సామాజిక విప్లవం 'అశేష ప్రజానీకం యొక్క-

సుఖజీవనాన్ని' కాక కొద్దిమంది సౌఖ్యాలనే సాధించగల్గినది. పాశ్చాత్య దేశాలు కనీవిని ఎరుగనంతటి హెచ్చు స్థాయిలో యుగయుగాల తరబడి ఉన్న దారిద్ర్యాన్ని, దురవస్థను నివారించుటకు ముఖ్యంగా స్వాతంత్ర్య అవరోధాన్ని, కడకు దార్జన్యాన్ని తాత్కాలిక చర్యలుగా ప్రయోగించడం ప్రజలు మన్నించగలరు. అయినప్పటికీ పరిస్థితి రష్యాలోను, దాని ఉపగ్రహ దేశాలలోను యెప్పటివలెనే మార్పు లేకుండా ఉంది. ఆర్థికవ్యవస్థ మార్పు చెందింది. కాని ఆయా దేశాలకు మూలాధారమైన ప్రజల స్థితిగతులలో మార్పేమి లేదు. తిరిగితిరిగి సంభవించే కరువు కాటకాలు, పీడించే సుంకాలు, సరియైన గృహవసతిలేమి, సాధారణ నిత్యావసర వస్తువులకొరత యెప్పటిలాగే ఉన్నాయి.

## సోవియట్ ముఖ్యులు – రెండవతరంవారు

సోవియట్ నవసమాజంలోని ముఖ్యుల జీవన ప్రమాణాలను, స్థితిగతులను, ఆచార వ్యవహారాలను సోదాహరణంగా వర్ణించే వివరాలు ముందు పుటలలో వ్రాయబడ్డాయి. ఆ విషయానికి సంబంధించి నోటిమాటగాను, వ్రాతమూలకంగాను చేయబడ్డ అనేక నివేదికలనుంచి పై వివరాలు సేకరించబడ్డాయి.

# సమాజాయత్తము చేయబడిన వైద్య విధానం గూర్చి సోవియట్ వివరణము

"నేను జర్మనీ, ఫ్రాన్సు, యునైటెడ్ స్టేట్స్ దేశాలలోని శ్రేష్ఠమైన హాస్పిటల్సును చూచాను. కాని, విశేష సాధనసంపత్తి, అమితసౌకర్యాలు గల క్రెమ్లిన్ హాస్పిటలు వంటి దానిని యెన్నడూ చూడలేదు. వైద్యుల, యితర ఉద్యోగుల శక్తి సామర్థ్యాలలో నేమి, ఉపచర్యలుచేసే పరిచారకుల నియామకంలో నేమి, రోగులకు మంచి ఆహారాన్ని సమకూర్చడంలో నేమి దేశంలోని యే యితర హాస్పిటలు కన్నను అది శ్రేష్ఠమైనది. ఔషధాల నిలువల విషయంలో విదేశములలోని యే హాస్పిటలుకు అది తీసిపోదు". అని వైద్య రంగంలో యిరువది సంవత్సరాలకు మించి అనుభవముగల రష్యను వైద్య విజ్ఞానవేత్త డా॥ జియార్జీ అలెగ్జాండ్రోవ్ చెప్పారు.

సోవియట్ ఆరోగ్యశాఖ మంత్రివర్గం అధీనమందు అనేక స్థానిక, జిల్లా ఆరోగ్యకేంద్రములు ఉన్నాయి. స్థానిక క్రెమ్లిన్ ఆరోగ్యకేంద్రం మంత్రివర్గం అధీనమందు లేని స్వతంత్రసంస్థ సోవియట్ నాయకుల దేహారోగ్యాన్ని సంరక్షించే బాధ్యతకలది గనుక, దానికొక ప్రత్యేకత, ప్రాధాన్యతవుంది. 1930 నుంచి అమలులోవున్న ఘోర

ణులకు అనుగుణంగా క్రెమ్లిన్‌లో పనిచేస్తున్న ప్రభుత్వో ద్యోగులు వివిధ వర్గాలుగా విభజింపబడ్డారు. మొట్టమొదట నుంచి నలుభై మంది అత్యంత ముఖ్యులైన సోవియట్ అగ్రనాయకులు ఉన్నత వర్గంలో ఉంటారు. కమ్యూనిష్టు పార్టీకేంద్ర సంఘసభ్యులు, సోవియట్ యూనియన్ మంత్రులు (జాతీయ ప్రజాస్వామిక రాష్ట్రాలమంత్రులు యిందుకు మినహాయింపు), కొద్దిమంది ప్రజాకళావేత్తలు, ఉత్తమశ్రేణి రచయితలు ద్వితీయ ఉన్నత వర్గంలో ఉంటారు. అయితే వారందరూ సామాన్య ప్రజానీకం కన్న హెచ్చు సౌకర్యాలు, హక్కులు అనుభవిస్తారు. ఈ ఉన్నతోద్యోగుల వర్గీకరణ నియమాలు చాలకట్టు దిట్టంగా వుంటాయి. మంత్రి మండలి జారీచేసిన ఫర్మా నాలనుబట్టి ఆయా కుటుంబాలవర్గ నిర్ణయం జరుగుతుంది.

ఉన్నత వర్గానికి చెందిన ప్రతి అగ్రనాయకునకు ఒక స్వంత డాక్టరు వుంటాడు. ఈ డాక్టరుకు తన రోగియొక్క, ఆతని కుటుంబముయొక్క ఆరోగ్య సంరక్షణ తప్ప, ఇతర రోగులను చూడవలసిన, లేక వేరు వైద్యసంబంధమైన బాధ్యతలేమీ లేవు. రోగియొక్క యావత్ జీవన విధానం — ఆతని ఆరోగ్యస్థితిగతులు, పొగత్రాగు అలవాట్లు, ప్రయాణానికి యేర్పాట్లు, విరామవినోదాలు. అన్ని రకాల పరిశోధనా పరికరాలు ఉపయోగించి గడువు ప్రకారం ఆరోగ్యాన్ని సరిచూడడం, అవసరమైనపుడు వైద్యశ్రేష్ఠుల (విదేశవైద్య నిపుణులతోసహా) సలహా తీసుకోవడం పట్ల శ్రద్ధచూపడమనే విధులు 'సంరక్షణ' అనే దానిలో ఇమిడి

ఉన్నాయి. డాక్టరు రోగిని, ఆతని కార్యదర్శి, అంగరక్షకులతో బాటు, ప్రయాణాలలో అనుసరిస్తాడు. ఈ డాక్టర్లు, క్రెమ్లిన్ వైద్యుల హోదాలో తమకు తెలిసిన విషయములు వేటినీ వెల్లడించమని ప్రమాణం స్వీకరిస్తారు.

ద్వితీయ వర్గంలో అయిదారు కుటుంబాలకు ఒక డాక్టరు ఉంటాడు. అలాగే తృతీయ వర్గంలో పదునైదు, ఇరువై కుటుంబాలకు ఒక డాక్టరు నియమింపబడతాడు. హాస్పిటలులో ఉండవలసిన అవసరం కల్గినపుడు ఒక్క ఉన్నత వర్గంవారికే క్రెమ్లిన్ హాస్పిటల్‌లో ప్రవేశార్హత ఉంది. ఇతరులు స్టారొపాన్‌స్కైయీ ఆర్బాట్ వీధులలోని క్లినిక్‌లకు వెళ్లుతారు. ఈ రెండు క్లినిక్‌లలోనికికూడా మాస్కో జనానీకానికి ప్రవేశంలేదు.

క్రెమ్లిన్ హాస్పిటల్, దాని క్లినిక్‌లు క్రెమ్లిన్ భవనాలకు సమీపాన, కోమిన్ టెరన్ (—ఇదివరలో వోజ్ డ్విఝెన్‌కా అని పిలువబడే) వీధిలో ఉన్నాయి. వాటిలో నూరు, నూట ఇరువై మంది రోగులకు మాత్రమే వసతి ఉన్నప్పటికి ఎన్నో భవనాలు వాటి ఆక్రమణ క్రింద ఉన్నాయి. రోగులకు కేటాయించే నిమిత్తం మూడేసి గదులు గల ఎన్నో ఏకాంత మందిరాలు, తివాసీలు, తైల వర్ణ చిత్రాలు అద్దాలతో అమర్చబడి ఉంటాయి. ఏకాంత మందిరాలకు పూలను తెచ్చియిచ్చేందుకుగాను ఇద్దరు తోటమాలులు కూడా ఉన్నారు. వంటశాలలో శ్రేష్ఠమైన ఆహారం లభ్యమవుతుంది. రోగి •కోరినదల్లా, డాక్టర్ అభ్యంతర పెడితేనే తప్ప, తెచ్చియిచ్చే బాధ్యత వంటశాల

వారిపై ఉన్నది. రోగులకు శీతకాలంలో కూడా తాజా బెర్రీలు, పండ్లు, కాకసస్ ప్రాంతపు కాయగూరలు లభ్యమవుతాయి. ప్రశస్తమైన వైద్యపరికరాలు, ఔషధాలు కలిగి ఉండడం క్రెమ్లిన్ హాస్పిటల్ యొక్క విశిష్ట లక్షణం రష్యాలోని ఇతర హాస్పిటల్స్‌లో మందులు చాలా పరిమితంగా ఉంటాయి. కాని క్రెమ్లిన్ హాస్పిటల్‌లో సల్ఫా, పెన్సిలిన్, స్ట్రెప్టోమైసిన్, మొదలైన విదేశ ఔషధాలు విరివిగా నిల్వ చేయబడతాయి. నీరసస్థితిలో ఉన్నవారికి, విశ్రాంతి అవసరమైనవారికి విశ్రాంతి భవనాలు ఏర్పాటు చేయడం క్రెమ్లిన్ వైద్యవిధానంలో ఒక భాగం. ఈ విశ్రాంతి భవనాలు దక్షిణ ప్రాంతాన క్రిమియా (పోరస్) కాకసస్ (సోచి, కిస్లోవాడస్క్, గాగ్రీ, ఝౌకాల్‌టుబా) లలో ఉన్నాయి. జార్ చక్రవర్తి రాజనగరు ఉండి ఉండిన పోరస్ నగరంలోని సానిటోరియంలో A. B. అని రెండు తరగతులున్నాయి. 1936-వ సంవత్సరంలో ఒక రోజుకు A తరగతి రోగికి 22 రూబుళ్లు చొప్పున ఆహారం (త్రాగుడు ద్రవాలు మినహాయించి) నిమిత్తం ఖర్చు చేయబడేది. కాని దానిలో పనిచేసే తోటీ స్త్రీ నెలసరి జీతం 90 రూబుళ్లు మాత్రమే. సానిటోరియమ్ ప్రాంతం బాహ్యప్రపంచంతో సంబంధం కోల్పోయినదా అన్నట్టు ఉంటుంది. ప్రత్యేక పర్మిటు లేనిదే దానిలోనికి ఎవ్వరిని ప్రవేశించనివ్వరు. మఫ్టీ దుస్తులలో ఉన్న అనేక మంది రక్షకభటులు ద్వారాలవద్ద, బయళ్లలోను కావలాకాస్తూ ఉంటారు.

రోగికి మధ్యాహ్న భోజనంలో ఏడెనిమిది రకాల పదార్థాలుంటాయి. శాకపాకాలను సమకూర్చడంలో వంట వాళ్లు ప్రత్యేక శ్రద్ధచూపుతారు. జార్ చక్రవర్తి భోజన శాలలో అడపాదడపా కనుపిస్తూ ఉండే ఫైటుఫ్ చేపలు, కావియర్ బొబ్బట్లువంటి అరుదైన వంటకాలు రోగికి తరచ్చు వడ్డించబడతాయి. ఆకలి మందగించకుండా ఉండే నిమిత్తం ద్రాక్షరసాయనంవంటి శ్రేష్ఠమైన నిషావస్తువులు సప్లైచేయబడతాయి. పాతకాలపు నేలమాళిగలు ఈ మత్తు పదార్థాలతో నిండి ఉంటాయి. పరిసర ప్రాంతాలలో ఉన్న పార్కులు, జారులు నివశించినప్పటికన్న ఎంతో అందంగా, ఆకర్షవంతంగా కనుపిస్తాయి. సరోవరాలలో హంసలు హాయిందాగా విహరిస్తూ ఉంటాయి. అపురూప మైన పక్షులుగల పంజరాలు వృక్షాలకు వ్రేలాడుతూ ఉంటాయి. జీనులువేసిన గుఱ్ఱాలు, యూరప్ దేశాలలో నిర్మింపబడిన మోటారుకార్లు — బ్రిటన్‌లో తయారయ్యే రోల్సు—రోయిస్‌తో సహా అతిథుల అందుబాటులో ఉంచబడతాయి.

నీరసంగా ఉండి, విశ్రాంతి తీసుకొంటున్న రోగి వాంఛించే చిలిపికోరికను సైతం ఆదరించితీరవలసినదే. ఒక సోవియట్ అగ్రనాయకుని తరుణ వయస్కురాలైన భార్య తాను ఫ్రెంచి ఫ్రూన్స్ (పండ్లు) తప్ప వేరొక విరోచనముల మందు ఉపయోగించలేనని డాక్టరుతో చెప్పింది. సానిటోరియమ్‌లో ఫ్రెంచి ఫ్రూన్సు హాజరుగాలేవు. మాస్కోనుంచి వాటిని తెప్పించవలసిందిగా వెంటనే ఫర్మానా జారీచేయ

బడింది. మరుసటి ఉదయం విమానంమీద అవి తీసుకొని రాబడ్డాయి. కొద్ది వారాల తర్వాత మరొక అగ్రనాయకుని భార్యకు ఉదయం కసరత్ చేస్తూంటే పొత్తికడుపులో నరం నొప్పిపెట్టింది. ఒక శస్త్రవైద్య నిపుణుడు, యింకొక స్త్రీరోగ విజ్ఞానవేత్త ఆమె సంరక్షణార్థం మాస్కోనుంచి విమానంలో పంపబడ్డారు. అంతకు ఒక సంవత్సరం మునుపు ఆమె టైపిస్టుగా పనిచేసింది. మరొక సంవత్సరం తర్వాత ఆమె తిరిగి టైపుమిషన్ వద్దకు చేరవలసివచ్చింది. స్పెయిన్ అంతర్యుద్ధ నిర్వహణలో సంభవించిన కొన్ని లోపాలకు ఆమె భర్త కూడా బాధ్యుడని ఆరోపింపబడుటచేత సోవియట్ అధికారులు అతనిని ఉద్యోగంనుంచి తొలగించి ఉరితీశారు.

సాయుధదళ శాఖ మంత్రివర్గమువారికి కూడా స్వంత డాక్టర్లు, హాస్పిటల్స్, సానిటోరియమ్‌లు ఉన్నాయి. ఈ శాఖ ప్రధాన వైద్యకేంద్రం జ్నమెన్‌కా వీధిలో ఉన్నది. ఇతర ప్రభుత్వ శాఖలలోవలెనే రక్షణ శాఖలో కూడా అధిష్ఠానవర్గంలోని అంతరువులకు అనుగుణంగానే వైద్య సహాయము కలుగజేయబడుతుంది. M.V.D. కి కూడా దేశవ్యాప్తంగా ప్రత్యేక చికిత్సా కేంద్రాలు ఉన్నాయి. ఈ శాఖ ప్రధాన చికిత్సాకేంద్రం మాస్కోలోని వర్సానోఫిస్కీ వీధిలో ఉంది.

క్రెమ్లిన్ అధినేతలకు, రక్షణశాఖ మంత్రివర్గానికి, M.V.D. కి సంబంధించినంతవరకు అమలు జరుపబడుచున్న ప్రత్యేక వైద్యవిధానానికి, ప్రజాబాహుళ్యానికై ఉద్దేశింప

బడిన మామూలు వైద్యవిధానానికి మధ్య అంతరం ఎంతో వున్నది. దానిప్రకారం ఒక జిల్లా జనాభాకు (మాస్కోలో 2000—3000 మందికి) ఒక డిస్పెన్సరీ చొప్పున ఏర్పాటు చేయబడి ఉంటుంది. ప్రతి డిస్పెన్సరీలోనూ మామూలుగా ఒక డాక్టరు, ఒక నర్సు ఉంటారు. డాక్టర్లు డిస్పెన్సరీలలో మూడు గంటల వ్యవధిలో ముప్ఫైమందికి తక్కువ కాకుండా రోగులను చూడవలసివస్తుంది. కొంత మంది రోగుల ఇండ్లకు కూడా వెళ్లవలసిన బాధ్యత డాక్టర్లపై ఉండుట మూలంగా వారు డిస్పెన్సరీలలో హెచ్చు కాలం వినియోగించలేరు. సగటున ఒక్కొక్క రోగిని పరీక్షించే వ్యవధి ఆరేడు నిమిషాలకు మించదు. ఈ వ్యవధిలో సగభాగం, రోగి వ్యాధిగ్రస్తుడైన కాలంలో పనికి హాజరు కాలేడని సిఫార్సుచేసే పత్రంలోని వివరాలను నింపుటకే వెచ్చింపబడుతుంది. అట్టి సిఫార్సు పత్రం లేనిచో పనికి హాజరు కానందుకుగాను రోగి శిక్షకు పాత్రుడవుతాడు. డాక్టర్లు తమ కచ్చేరీ పనులకే హెచ్చుకాలం వెచ్చించవలసివచ్చుట చేత రోగుల విషయంలో విశేష శ్రద్ధచూపడం తరచు అశక్యమౌతుంది.

వ్యాధిగ్రస్తులను, వారి ఇండ్లలో చూచే విషయంలో కూడా ఇటువంటి ప్రతిబంధకాలే ఉన్నాయి. పై కోటు నైనా విప్పకోకుండా డాక్టరు రోగి ఆరోగ్యం గురించి ప్రశ్నలు వేస్తాడు, రోగిని పరీక్షిస్తాడు, రోగిని గురించి వ్రాయవలసిన

పత్రంలో వివరాలు నింపుతాడు, ఆదరబాదరగా మరొక రోగి ఇంటికి వెళ్లిపోతాడు.

సామాన్య ప్రజలలో ఏ కొద్దిమందికో మాత్రమే రహస్యంగా డాక్టరు సలహా తీసుకొనే క్షోమత ఉంటుంది. అత్యధిక సంఖ్యాకులు డిస్పెన్సరీల ద్వారా లభ్యమయ్యే వైద్య సహాయంతోనే సంతృప్తి చెందవలసి వుంది. మామూలు ఔషధశాలలో మందుల నిల్వలు చాలా తక్కువ. సర్వసాధారణంగా జనానీకానికి విదేశ ఔషధాలేవీ లభ్యంకావు. విపరీతమైన హెచ్చు ధరలు చెల్లించి ఏ కొద్దిమంది మాత్రమో విదేశ ఔషధాలు చీకటి బజార్లలో కొనుక్కుంటారు. యుద్ధారంభ కాలంలో ఒక గ్రాము సల్ఫోడిన్ 1,000 రూబుళ్లకు విక్రయింప బడేది.

సామాన్య తరగతి రోగుల నిమిత్తం క్రిమియాలోను, కాకసస్‌లోను విశ్రాంతి గృహాలు ఉన్నాయి. వీటిలో చాలాభాగం కార్మిక సంఘాలచేత నడుపబడుచున్నవే. ఏ కొద్దివాటినో ఆరోగ్యశాఖ మంత్రివర్గం నిర్వహిస్తున్నది. సోవియట్ సామాజిక వ్యవస్థలోని పై తరగతుల వారి కొరకు ఏర్పాటుచేయబడ్డ విశ్రాంతి మందిరాలకు, ప్రజా బాహుళ్యం నిమిత్తం నడుపబడుచున్న విశ్రాంతి గృహాలకు మధ్య క్రెమ్లిన్ హాస్పిటల్లకు జిల్లా డిస్పెన్సరీలకు మధ్యవలెనే అగాధమంత అంతరం ఉంది. సామాన్య విశ్రాంతి గృహాలలో పరికరాలు చాలా తక్కువగా ఉంటాయి. పళ్లెముల, గాజు సామానుల, గుడ్డలకొరత సర్వసామాన్యం;

చాలినన్ని విద్యుచ్ఛక్తి బల్బులుకూడా లేవు; భోజన పదార్థాలు మధ్య రకపువిగాను, లేదా చెడ్డవిగాను ఉంటాయి.

విప్లవానంతర కాలంలో సోవియట్ వైద్యశాఖ ఎంతో విస్తరించింది. డాక్టర్ల సంఖ్య, నాల్గురెట్లకు మించి పెరిగింది. కొత్త డిస్పెన్సరీలు, ఇదివరలో లేనిచోట, ఏర్పాటు చేయబడ్డాయి. మొత్తంమీద వైద్యసహాయం హెచ్చు మందికే లభ్యమవుతోందని చెప్పాలి. అయినప్పటికి సామాన్య తరగతి రోగులుపొందే చికిత్స గణ్యతలో హీన స్థాయికి దిగజారిపోయింది. వైద్య విద్యార్థులకిచ్చే తర్ఫీదు—ముఖ్యంగా 1930-వ సంవత్సరపు సంస్కరణల తరువాత నుంచి—కూడా చాలా లోప భూయిష్టంగా ఉంది.

నగరాలలో లభ్యమయ్యే వైద్యసహాయం భయాందోళనలను కలుగజేసేదిగా ఉంది. 1929-వ సంవత్సరము తరువాత రష్యన్ నగరాలు విస్తారంగా పెరిగాయి. అయినను సోవియట్ ప్రభుత్వం వైద్య సదుపాయాలు కలుగ జేయటంలో తగినంత శ్రద్ధ చూపుటలేదు. పారిశ్రామిక కేంద్రాలను పెంపుచేయుటకే ప్రాధాన్యత ఇవ్వబడుతోంది. కుక్క గొడుగులవలె పెరిగిపోతున్న నగరాలలో ప్రజల ఆరోగ్య సంరక్షణార్థం కేటాయింపబడే మొత్తాలు చాలి నంతగా లేవు. హాస్పిటల్సు ఎప్పుడూ రోగులతో క్రిక్కిరిసి ఉంటాయి. ప్రమాద స్థితిలో ఉన్నవారుకూడా ప్రవేశం కొరకు మూడు నాల్గు రోజులు వేచి ఉండవలసి వస్తోంది. తరచు ఈ వ్యవధిలోనే రోగి చనిపోయిన సందర్భాలు ఎన్నో ఉన్నాయి. క్షయ ఆసుపత్రులు క్రిక్కిరిసి ఉండడం

మూలంగా సాధారణంగా ఒక రోగిని సానిటోరియమ్‌లో ఉండనిచ్చే కాలం రెండు, మూడు మాసములు మాత్రమే. కొన్ని ప్రత్యేక పరిస్థితులలో ఈ గడువు నాల్గు నెలల వరకు పెంచబడుతుంది. అంతకు మించి ఏ రోగిని సానిటోరియమ్‌లో ఉండనివ్వరు.

ఆరోగ్య సంరక్షణకు సంబంధించినంత వరకు ధనవంతులకు, పేదవారికి మధ్యగల వ్యత్యాసాలను తొలగించవలెననెడి ప్రధానాశయంతో ఏర్పాటు చేయబడ్డ సమాజాయత్త వైద్య విధానం రష్యాలో సాంఘిక వర్గాలకు మధ్యగల అంతరాలను విస్తృతం చేయుటకే పనికివచ్చినది, అనేది ఒక వైపరీత్యం. దేశమందంతటా వైద్య సహాయం ఉచితంగానే లభ్యమవుతుంది. కాని సోవియట్ సామాజిక వ్యవస్థలో ఒక ప్రత్యేక వర్గానికి చెందిన ప్రముఖ సోవియట్ పౌరుల దేహారోగ్య సంరక్షణార్థం నిర్వహింపబడుచున్న క్రెమ్లిన్ హాస్పిటల్స్, అట్టి కొన్ని ఇతర చికిత్సా కేంద్రాలకుగాను హెచ్చు మొత్తాలు వ్యయపరచబడుతున్నాయి. సోవియట్ ఆయవ్యయ పట్టికలో ఈ పద్దుల అంచనాలు కానరావు. వాస్తవానికి సమాజంలోని ఉన్నత వర్గములవారి ఆదాయముల నికర అభివృద్ధి ఆ పద్దులలో ఇమిడి ఉన్నది. "ఏ ధనికవాద దేశంలోను భాగ్యవంతులకు, పేదవారికి మధ్యగల అగాధం సోవియట్ సమాఖ్యలో ఉన్నంత లోతుగా లేదు. సోవియట్ ప్రజారోగ్య విధానంనుంచి గ్రహించగల ప్రత్యక్ష భావమిదే"; అని డా. అలెగ్జాండ్రోవ్ తన నివేదికలో ఉదహరించారు.

ఎన్‌రిక్ కాస్ట్రో డెల్‌గాడో రష్యాలో తన యుద్ధకాల అనుభవాల గురించి వ్రాసిన పుస్తకంలో యూరల్స్‌లోని యూపా నగరమందుగల రెండు హాస్పిటల్సు గూర్చి ఉదహరించారు. అంతర్జాతీయ కమ్యూనిష్టు సంఘం అధిష్టాన వర్గంలో సభ్యుడగుటచే, కోమిన్‌టెరన్ ఉద్యోగులతో బాటు 1941 ఆఖాంతమందు డెల్‌గాడో, యూఫాకు పంపబడినాడు. అక్కడ ఆయన ప్లూరసీ (ఊపిరితిత్తులలో నీరుపట్టి) వ్యాధితో బాధపడ్డాడు. ఉన్నతస్థాయికి చెందినవాడగుటచేత, క్రిక్కిరిసి ఉన్నప్పటికి స్థానిక హాస్పిటల్‌లో ఆతనికి త్వరగానే పడక ఇవ్వబడింది. కాని రోగులకిచ్చే చికిత్స భోజన సదుపాయాలులతో అసంతృప్తి పొంది తనను ఇంటికి పంపివేయవలసినదని గట్టిగా పట్టుబట్టాడు. ఆతని స్నేహితులు ఆశ్చర్యపడి, అలజడిజెంది ఆ దేశ నగరంలో ఉన్న N.K.V.D. హాస్పిటల్‌కు ఆతనిని బదిలీచేయుటకు ఏర్పాట్లు చేశారు. యుద్ధం మూలంగా ఆహారపదార్థాల కొరత, ఉద్యోగుల కొరత వంటి ప్రతి బంధకాలు ఉన్నప్పటికి N.K.V.D. హాస్పిటల్ స్థితిగతులు మొత్తం మీద ప్రశంసనీయంగా ఉన్నాయి డెల్‌గాడోకు అవసరమైన మందులు ఇవ్వబడ్డాయి. 1942-వ సంవత్సరంలో అపురూపంగా ఎంచబడే పాలు కలిపిన కాఫీ, సిగరెట్లు వంటివి విరివిగా ఆతనికిచ్చేవారు. పరిచర్యలు దయతోను, సమర్థతతోను కూడుకొనినవిగా ఉండేవి. క్రమేణా డెల్‌గాడో కోలుకున్నాడు. కాని ఈ రెండు హాస్పిటల్సులోను ఆతడు పొందిన అనుభవం ఉత్తరోత్తరా పార్టీనుంచి వైదొలగటానికి

ఆతనిని ప్రేరేపించిన కారణాలలో ఒకటి. "క్రోమ్లిన్ సెరన్‌లో (A. B. C.) మూడు తరగతులున్నాయి; కమ్యూనిస్టు కుట్రదారులలో ప్రముఖులు బసచేసే లక్సు హొటల్‌లో (A. B. C.) మూడు తరగతులు, హాస్పిటల్సులో కూడా A. B. C. తరగతులున్నాయి; ఇక వర్గ రహిత సమాజమని వారు దానిని ఎందువల్ల పిలుస్తారో" అని ఆయన అనుమానం వెల్లడించారు.

## గ్రామీణ గృహాలు

సమాజంలో ఒక వర్గంవారి స్వభావ, స్వరూపాలను, వారు నివసించే ఇండ్లు, విరామకాలాన్ని వారు వినియోగించుకునే వైఖరి తెలియజేసినట్లు ఇతర విషయాలు తెలియజేయలేవు. విల్లా అనే పదం వివేకవంతమైన కమ్యూనిస్టు శ్రవణేంద్రియాలకు రాచరికపు, లేక పెట్టుబడిదారీ జీవన విధానాన్ని స్ఫురింపజేస్తుంది. అందుచేతనే "స్వంత గ్రామీణ గృహము" అనే పర్యాయపదం రష్యాలో నూతనంగా వాడుకలోనికి వచ్చింది.

మార్షల్ వొరోషిలావ్, మార్షల్ బుడెన్నీ, నికిటా కలుష్చెవ్, కొద్దిమంది అగ్రనాయకులు, విరామకాలాన్ని కాకసస్ (క్రిస్టైమియా, పోలియానాల) లోగల జార్ చక్రవర్తుల వేసవిగృహాలలో గడుపుతారు. ఆ విశ్రాంతి మందిరాలకు చేరుటకుగాను కొండదొలచి, ఒక ఏటవాలు

కోనప్రక్కగా అయిదు మైళ్ళకుపైగా రోడ్డు వేయబడింది. ఆ మందిరాలచుట్టూ ప్రత్యేకంగా పెంచబడ్డ పెద్ద అడవి ఉంది. జార్ చక్రవర్తి రెండవ నికొలాస్‌కు వలెనే సోవియట్ అధిష్ఠానవర్గంవారికి ఎలుగుబంట్ల వేట అభిమానక్రీడ, స్టాలిన్ స్వంత గ్రామీణ గృహం "నడె ఝూడావిల్లా" (ఆయన రెండవ భార్య పేరున పిలుపబడేది) నల్ల సముద్ర ప్రాంతాన సోచి, ఆడ్లర్‌లమధ్య ఉంది. విఖ్యాత సోవియట్ శిల్ప శాస్త్రజ్ఞుడు యోఫాన్ తయారుచేసిన ప్లానుల ప్రకారం ప్రకృతిసిద్ధమైన కాకసస్ సుందర ప్రాంతాలలో స్టాలిన్ స్పెక్వేసమీపాన అది 1933 లో నిర్మింపబడినది. అత్యద్భుత మైన సమపాయాలు, సంపూర్ణమైన రక్షణ ఏర్పాట్లు కలిగి ఉండడం దాని విశిష్టలక్షణం.

మాస్కో నగరాన్నుంచి దూరంగా ఉండడంవల్ల ఈ విల్లాలు దీర్ఘ విరామకాలాలలో మాత్రమే ఉపయోగ పడతాయి. స్టాలిన్ ఆదివారాలు మాస్కోకు 25 మైళ్ల దూరాన బైలో రష్యా - బాల్టిక్ రైలుమార్గంపైగల పెర్ఖుష్కోవ్‌లోని అతని మరొక గ్రామీణ గృహంలో గడుపుతాడు. దానికి సమీపాననే మాలటోవ్ యొక్క కొద్దిమంది ఇతర పోలిట్ బ్యూరో సభ్యులయొక్క విల్లాలు ఉన్నాయి. చిన్న దేవదారు అరణ్యం మధ్య ఒక కొండ మీద ఆ భవనాలు నిర్మించబడ్డాయి.

స్టాలిన్‌కు నగర సమీపానవున్న విల్లాలో పదునేడు గదులున్నాయి. యుద్ధానికిముందు స్టాలిన్ నియంత ఆది వారాలు అచ్చటనే ఆతని తృతీయకళత్రం రోసాతో గడపే

వాసు. ఆమె సోదరుడు లాజర్ కగనోవిచ్ విల్లాస్టాలిన్ విల్లాకు ఆనుకొనేవుంది. స్టాలిన్ విల్లాలోని విశాలమైన ముందుహాలునుంచి రెండవ అంతస్తుకు వేయబడ్డ మేడ మెట్లు దృఢమైన ఓకుకలపతో కట్టబడ్డాయి. గదుల అడుగు భాగాలు, గోడలు, నల్లచేవ, కొండరావి, వాల్‌నట్, మహాగనీవంటి విలువైన కలపతో నిర్మింపబడ్డాయి. గొబెలిన్ తెరలు, దుస్తులు ఉంచే పట్టుజాల కట్టలు ప్రత్యేకమైన నమూనాలలో పోతబోయబడిన కంచు తలుపు గడియలు గదులలో అమర్చబడ్డాయి. కృత్రిమ కాంతిని ప్రసరించే ఏర్పాట్లు అంతటా విస్తరించివున్నాయి. మందిరాల అడుగు భాగాలు, చాలవరకు గోడలు, విలువైన టర్కిస్తాన్, పెర్షియా, చైనా తివాసీలతో కప్పబడి ఉంటాయి. నాయకుల స్వంత గ్రామీణ గృహాల గదులలోని అలంకరణాలేవీ విప్లవాన్ని జ్ఞప్తికి తెచ్చేవిగా (మార్క్సు లెనిన్ చిత్తరువులు, గ్రెకోవ్ రచించిన అంతర్యుద్ధరంగదృశ్యాలు) మచ్చుకైనా ఉండకపోవడం ఆశ్చర్యకరమైన విషయం.

ఆ మందిరాలలోని ఏర్పాట్లన్నీ (కృత్రిమవనాలు, పూపొదరింట్లు, నీట్సైన తెల్లటి దుస్తులు ధరించినపరిచారికలు, పరిచారకులు, వెచ్చచేయబడిన భోజనపు పళ్లెములు, హెచ్చువెలగల కావియర్, డిశంబరు నెలలో తుప్పపండ్లు) మొదటినుంచి చివరవరకు బూర్జువా లక్షణాలతో కూడుకొన్నవిగానే ఉంటాయి.

స్టాలిన్ భవనము ఉన్న ప్రదేశం సర్వదా రక్షక భటుల కాపలా క్రింద ఉంటుంది. అది ప్రాంతీయ, బహిరంతర

శ్రేణులుగా విభజింపబడింది. భవనానికి చుట్టూ ఆరుమైళ్ల వ్యాసార్థముకు లోపలిభాగము ప్రాంతీయశ్రేణి. దాని రక్షణ బాధ్యత ప్రత్యేక "నాయక రక్షక దళం" వారిపై ఉంది. ఈ దళంలో M.V.D. శాఖ ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన OSNAZ డివిజన్ నుంచి కేటాయించబడిన పటాలం ఒకటుంటుంది. విల్లా చుట్టుపట్ల, అడవిలోను రోడ్లమీద, సైనిక దుస్తులలోను, మఫ్టీదుస్తులలోను ఉన్న సైనికులు అప్రమత్తతతో కాపలా కాస్తూ ఉంటారు. ప్రతి రక్షణ స్థానంవద్ద వేటజాగిలంకూడా ఒకటుంటుంది. ప్రత్యేక రక్షణ స్థానాలలో టెలిఫోన్‌లు అమర్చబడి అరణ్యమంతా, బ్యాంకు నేలమాళిగలవలె, విద్యుత్ ప్రసారపు ఏర్పాట్లతో నిండి ఉంటుంది. పొరపాటున ఏ విద్యుచ్ఛక్తి తీగ అయినా తాకినట్లైతే ఎన్నోదీపాలు వెలుగుతాయి, గంటలు మోగుతాయి.

విల్లా వెలుపలి ప్రదేశం రెండవ రక్షణ శ్రేణి. ఈ శ్రేణిలోకూడ రక్షకభట దళం విల్లా సమీపాన రక్షణ స్థానాలు ఏర్పరచుకొని ఉంటుంది. ప్రాంతీయ రక్షణ శ్రేణీలోవలెనే ఈ ప్రాంతమంతటా విద్యుచ్ఛక్తితీగెలు అల్లుకొని ఉంటాయి. "ముందుకు పోవుట నిషేధింప బడింది" అని వ్రాయబడ్డ పోస్టర్లు కొట్టవచ్చినట్లు కనిపిస్తాయి. ప్రాంతం చుట్టున ఎత్తైన గోడ ఉండుటవల్ల, ఇతరు లెవరు లోనికి చూచుటకూడా సాధ్యపడదు. గోడ M.V.D. రక్షక దళాలచేత, వేటజాగిలములచేత పరిరక్షింపబడుతూ

ఉంటుంది. గోడకు సుమారు అరమైలు దూరాన చాదాపు ఆరువందల గజముల ఎడమెడముగ అగ్రనాయకులు అయిదు మందికి గ్రామీణ గృహాలున్నాయి.

గోడకు లోపలి ప్రాంతమంతా మూడవదైన అంతః రక్షణ శ్రేణి క్రిందకు వస్తుంది. M.V.D. దళాలు, తోట మాలులు, వంటవారు, పరిచారకులు, కారుడ్రైవర్లు, పరిచారి కలు, ఈ శ్రేణిలో ఉంటారు. వీరందరు ఒకరిపై ఇంకొకరు కాపలా కాస్తూ ఉండాలి. ఏ చిన్ని పొరపాటుకైనా వారు వ్యక్తిగతముగాను, సాముదాయకముగాను బాధ్యత వహించవలసి ఉంది. ప్రతి ఉద్యోగియొక్క వెనుకటి చరిత్ర M.V.D. వివరముగా తెలుసుకునే ఉంటుంది. వారి చర్యల పైన, రాకపోకలపైన రహస్య రక్షణ భటుల నిఘానిఘా సర్వావస్థలా ఉండనే ఉంది. ఒక సోవియట్ ప్రముఖునకు నూతన గ్రామీణ గృహం కట్టుటకు నిశ్చయించబడినప్పుడు సుప్రీమ్ సోవియట్ ఖజానా శాఖ ప్లానుల నిమిత్తం రహస్య పోటీకి దరఖాస్తులు ఆహ్వానిస్తుంది. మామూలుగా ష్చూసెవ్, రుడ్ నెవ్, అవాచియన్ ష్చూకో, యోఫానివంటి సుప్రసిద్ధ శిల్పకళావేత్తలు పోటీలో పాల్గొంటారు. ప్లానులు పంపిన ప్రతి ఒక్కరు ఉదారంగా బహుకరింపబడతారు. ప్లానులు అన్నీ నిర్మింపబోయే గ్రామీణ గృహ యజమానికి పంపబడతాయి. ఏ ప్లాను అతనికి అంగీకారమో తెలియ జేసిన తరువాత ఖజానా శాఖ గృహనిర్మాణ బాధ్యత వహిస్తుంది.

పోటీలో గెల్పొందిన శిల్పకళావేత్త ఉన్నట్టుండి ఒకనాడు మాస్కో (ఫురల్ పోవా వీధి) లోని M.V.D. గృహ నిర్మాణ శాఖ కార్యాలయానికి పిలువబడతాడు. ఇతర సందర్భాలలో M.V.D. కార్యాలయానికి రావలసినదిగా ఆజ్ఞవచ్చిన దంటే జీవితపు తుదిఘడియలు ఆసన్నమైనవనే అనుకోవచ్చు.

కాని ఈ సందర్భంలో M.V.D. శాఖవారు ఆ శిల్పకళావేత్తను ఎంతో గౌరవిస్తారు. ఆతడు పంపిన ప్లాను ప్రకారం గృహ నిర్మాణం జరిపించే బాధ్యత వహించవలసినదని అభ్యర్థిస్తారు. అందుకుగాను ఆతనికిచ్చే వేతనంకూడా చాలా హెచ్చుగా ఉంటుంది. కాని ఆ ఉద్యోగంలో ప్రమాద కరమైన ప్రతి బంధకాలు ఎన్నో ఉన్నాయి. ఎవరి నిమిత్తమై ఆ విల్లా నిర్మింపబడవలసి ఉన్నదో శిల్ప శాస్త్రజ్ఞునకు తెలియదు. ఆ పని అంతా రహస్యమని, బాహ్య ప్రపంచంతో ఎట్టి సంబంధం కలుగజేసు కోనకుండా దానిని నిర్వహించవలెనని M.V.D. శాఖ ఆతనిని ఆదేశిస్తుంది. పొరపాటున అయినా రక్షణ ఏర్పాటుల గురించి వెల్లడి అయినట్లైతే న్యాయస్థాన నిబంధనలతో సంబంధంలేని శిక్షాస్మృతికి ఆతడు బద్ధుడౌతాడు.

అత్యల్ప అనాలోచిత చర్యకైనప్పటికి నిర్బంధ శిబిరాలలో ఏండ్లతరబడి మ్రగ్గవలసి వస్తుంది. ఆ దారుణ పర్యవసానాల గురించి శిల్పశాస్త్రజ్ఞునికి తెలిసి ఉన్నప్పటికి ఉద్యోగాన్ని తిరస్కరించడమంటే నాయకునిపట్ల, ప్రభుత్వంపట్ల అవిధేయతను ప్రకటించడమే కాబట్టి అందుకు వెనుదీస్తాడు. అంతే

గాక భవన నిర్మాణ కాలంలో ఆతనికివ్వబడే వేతనం, పుష్కలంగా జీవించుటకుగాను చేయబడే ఇతర సౌకర్యాలు ఉద్యోగ స్వీకారానికి ఆతనిని పురిగొల్పుతాయి.

ఒక స్వంత విల్లాకు సంబంధించిన ప్లానులు అతి వివరంగాను, చిక్కులతో కూడుకొన్నవిగాను ఉంటాయి. కట్టడాలు, నీటి ఊటలు, కృత్రిమవనాలు, పూపొదరిండ్లు, టెన్నిస్ కోర్టులు, ఈత వ్యాయామానికై చిన్న కోనేర్లు మాత్రమేకాక భవన అంతర్భాగ అలంకరణ, మరుగుదొడ్లు, నీటి జల్లు క్రింద స్నానంచేసే గదులు, విద్యుచ్ఛక్తితో వంటచేయు సదుపాయాలుగల పాకశాలలు, వస్తువులను చల్లగా ఉంచుటకు ఏర్పాట్లు, ఇతర సాధనసామగ్రి, ఆభరణాలు, పుస్తకాలు, తివాశీలు, పింగాణీ సామగ్రి, వెండి వస్తువులు మొదలైన వాటినన్నిటినీ సమకూర్చడం ఆతని విధి. భవనాన్ని అన్ని ఏర్పాటులతో సహా నిర్దుష్టమైన స్థితిలో, దాని కాబోయే యజమానికి స్వాధీనపరచువరకు అన్ని విషయాలలోను శిల్పవిజ్ఞాని బాధ్యత వహించవలసి ఉంది.

పని ప్రారంభింపబడగానే ముఖ్య శిల్పి, అతని సహాయులు (సహాయులకు భవనంయొక్క పూర్తి ప్లాను ఇతర వివరాలు చూచు హక్కు లేదు.) M.V.D. గృహ నిర్మాణ శాఖ అజ్మాయిషీ క్రింద క్షణక్షణం అనుమాన బాణాలకు గురి చేయబడుతూ పనిచేయవలసి ఉంది. అన్ని వివరములు తయారు చేయబడి కాబోయే యజమానిచే ఆమోదింపబడిన తరువాత ముఖ్య శిల్పి, ఆతని సన్నిహితులు సహాయులు భవన నిర్మాణప్రదేశానికి కొనిపోబడతారు. అక్కడ

M.V.D. శాఖ, వారి నిమిత్తం ప్రత్యేకంగా భవనాలు సేకరిస్తుంది. లేదా నిర్మిస్తుంది. వారు కోరినదల్లా సమకూరుస్తుంది. వారికి నిత్యం ప్రశస్తమైన భోజనం సప్లై చేస్తుంది. అట్టి విల్లాను ఒక దానిని నిర్మిస్తున్న శిల్పితో ముఖ్య M.V.D. ఏజంటు "గరిటనిండా తాజా కావియర్ మీరు తీసుకోవచ్చు, మా దగ్గర లభ్యము కానిదల్లా పక్షిపాలు ఒక్కటే" అని చెప్పాడు.

ప్రశస్తమైన దుస్తులను శిల్పి అందుకుంటాడు. తన గదిలోనే సినీమా చూచుటకుగాను కావలసిన యంత్రాలన్ని ఆతని అందుబాటులో ఉంటాయి. చూడదలచిన చిత్రాలనన్నిటినీ ఆతడు అడుగవచ్చు. ఆతడు చదువగోరిన పుస్తకములన్నీ సప్లై చేయబడుతాయి. విసుగుదలనుంచి ఆతనిని విముక్తిచేసే నిమిత్తం ఆతని అభిరుచి ప్రకారం ("ఏ రకమైనా, ఏ పరిమాణంలోనైనా" అని M.V.D. ముఖ్యాధికారి ఆతనితో చెప్పే తరహా) ఏ సంఖ్యలోనైనప్పటికి స్త్రీలను సమకూర్చడానికి M.V.D. సిద్ధపడుతుంది. "జాబులు వ్రాసుకొనుటకు మీకు స్వేచ్ఛవుంది." కాని ఉత్తర ప్రత్యుత్తరాలు సెన్సారు చేయబడతాయి. అని కూడా ఆతనికి M.V-D. అధికారి తెలియజేస్తాడు. బయటివారి నెవరిని చూచుటకు అతనికి అనుమతి ఇవ్వబడదు. సర్వదా రహస్య రక్షక భటుల అజ్మాయిషీ క్రిందనే ఉంటాడు.

భవన నిర్మాణానంతరం, దానిని కాబోయే యజమానికి స్వాధీనం చేసేముందు ఆతడు అత్యంత ఆతురత చెందేతరుణం ఆసన్నమౌతుంది. మొట్టమొదట ఒక "సాంకేతిక" పరి

శోధన ఏర్పాటు చేయబడుతుంది. నిపుణులగు ప్రత్యేక ఇంజనీర్లదళం ప్రతి చిన్న విషయాన్ని వివరముగా పరిశీలించే నిమిత్తం తీసుకొని రాబడుతుంది. ఉత్తరోత్తరా ఏ లోపము లైనా కనుగొనబడినట్లైతే అందుకు ఇంజనీర్లుకూడా బాధ్యత వహించవలసి ఉంది. అందువల్ల వారు విపరీతమైన విధి నిర్వహణాసక్తితో పరిశోధన జరుపుతారు. ఎచ్చట్లనైనా రహస్యంగా బాంబులు ఉంచబడినవేమో కనుగొనే నిమిత్తం ప్రతి పలక జాగ్రత్తగా తనిఖీ చేయబడుతుంది. ఏ విషయ మైనా "అపార్థం" చేసుకొనబడినట్లైతే శిల్పులు, కార్మికులు, మాత్రమేగాక M.V.D. పర్యవేక్షకులు సయితం వ్యక్తిగతంగా అందుకు బాధ్యులవుతారనే విషయం గమనించినట్లైతే సమగ్రపరిశీల ఆంతర్యం వ్యక్తమౌతుంది. నదేర్ఘుడా విల్లా నిర్మించిన ముఖ్యశిల్పి ఆఖరు క్షణంలో ఆ భవనాలు స్టాలిన్ నిమిత్తం ఉద్దేశింపబడినవని తెలుసుకొనగానే భయకంపితుడై గడగడలాడాడు. స్నానాల గదిలోనికివెళ్లి యాధాలాపంగా నీటి జల్లు పరికరములలో వేడినీటిని, చల్లని నీటిని కలిపే మర చెడిపోయినందున కుళాయిలనుంచి వేడినీరు మాత్రమే వచ్చుట కనుగొని ఎండుటాకువలె వణకడం ప్రారంభించాడు. స్టాలిన్‌గాని, లేక ఆతని ముఠాలోని వేరొకరుగాని మరత్రిప్పి లోపము కనుగొనినట్లైతే సంభవించే ప్రమాద మేమో!

కట్టకడపట కాబోయే యజమాని విల్లాను స్వయంగా పరిశీలిస్తాడు. ఆతడు కోరే పిచ్చికోరికలన్నీ తప్పని సరిగా సంతృప్తిపరుపబడాలి. రైతు-అధ్యక్షుడని పేరుగన్న

కీ. శే. మైఖేల్ కలినిన్ సోవియట్ సమీపాన నిర్మింపబడిన తన నూతన భవనాన్ని పరిశీలించినప్పుడు కిటికీ తెరగుడ్డల నాణ్యాత పట్ల అసంతృప్తి చెందాడు. వాటిని పట్టిచూచి "వాస్తవానికి ఒక అధ్యక్షుని నిమిత్తం మీారు నిజంగా మంచి తెరలను సేకరించగలిగి ఉండవలసినది" అని తన అభిప్రాయాన్ని వెలిబుచ్చాడు.

## బ్లూ ఎక్స్ప్రెస్

యుద్ధమునకు ముందు వేయిమందికి పైగా రష్యన్ ఉన్నతోద్యోగులకు స్వంత రైలుపెట్టె లుండేవి. యుద్ధానంతరకాలంలో నూతన సైనికాధికారులు కొందరికికూడా అట్టి ప్రత్యేక సౌకర్యం కలుగజేయబడుటవల్ల ప్రస్తుతం స్వంత రైలు పెట్టెలుకలిగి ఉన్న వారిసంఖ్య బహుశః పెరిగి ఉండవచ్చు. బ్లూ ఎక్స్ప్రెస్ అని పిలువబడే విశేష నైపుణ్యంగల రైలుబండిలో ప్రయాణంచేసే హక్కు ఈ నాడు వేలాది కుటుంబాలవారు అనుభవిస్తున్నారు.

పోలిట్ బూరో సభ్యులందరకు యు. యస్. యస్. ఆర్. మంత్రి మండలిలోని (మంత్రుల సంఖ్య ఏబదికి మించి ఉంటుంది) యావన్మందికీ, ఉన్నతోన్నత ప్రభుత్వ సంస్థలలోను, పార్టీ సంస్థలలోను గల సభ్యులలో అత్యధిక సంఖ్యాకులకు, పార్టీ ప్రాంతీయ సంఘాల కార్యదర్శులు, జిల్లా సైనిక దళాధ్యక్షులు, రైల్వే మార్గాల ప్రధానాధి

కాపులు, కొంతమంది పార్టీ అధినేతలు. ఇంకెందరకో స్వంత రైలుపెట్టెలు ఇవ్వబడ్డాయి.

1930-వ సంవత్సరానికి పూర్వం సోవియట్ నాయకులు నిరాడంబరంగా ప్రయాణం చేసేవారు. స్టాలిన్‌కు, పోలిట్ బ్యూరో సభ్యులకు మాత్రమే స్వంత రైలుపెట్టెలు ఉండేవి. క్రింది స్థాయి నాయకులందరు సాధారణ పుల్లామన్ పెట్టెల లోనే ప్రయాణం చేసేవారు. ప్రభుత్వంవారి స్వంత ఉపయోగం నిమిత్తం ప్రత్యేకంగా ఒక రైలుబండి నిర్మింపబడవలెనని 1930 దరిదాపున నిశ్చయింపబడింది. తత్ఫలితంగా లక్స్ బ్లూ ఎక్స్‌ప్రెస్ అని పిలువబడే క్రొత్త రైలుబండి నిర్మించబడింది. వేసవి రోజులలోకి స్లోవోడస్కీ- సోబీలలోని విశ్రాంతి మందిరాల మధ్య అది నిరంతరం రాకపోకలు సాగించవలసి ఉంది. అప్పుడప్పుడు మాస్కోకు కూడా వెళ్లాలి. 1933-వ సంవత్సరం మే 1-వ తేదీన అది మొట్టమొదటిసారిగా ప్రయాణం చేసింది. ప్రతి సంవత్సరం మే నెల మొదటినుంచి నవంబర్ మాసం ఆఖరువరకు వాడబడుతూ ఉండేది. శీతకాలంలో పూర్తిగా మరమ్మతుచేసే నిమిత్తము దానిని ప్రతి ఆకురాలు కాలంలోను లైను నుంచి ఉపసంహరిస్తారు. సోవియట్ రష్యాలో మామూలు రైలు పెట్టెలు ఆరు సంవత్సరాలకు ఒక పర్యాయం పూర్తిగా విప్పివేయబడి మరమ్మతు చేయబడతాయి. కాని బ్లూ ఎక్స్‌ప్రెస్ పెట్టెలలోని పరికరాలన్నీ ప్రతీ ఏటా మార్చబడుతాయి. దానివల్ల ప్రతి సంవత్సరం మరమ్మతులకుగాను 5,00,000

రూబుళ్లకు మించి ఖర్చవుతుంది. వీటా బ్లూ ఎక్స్ప్రెస్ నిర్వహాణవల్ల 10,00,000 రూబుళ్లు నష్టం సంభవిస్తోంది.

జార్ చక్రవర్తుల అంగరక్షకులవలె పొడగరులు, స్ఫుర ద్రూపులు అయిన వారినుంచే బ్లూ ఎక్స్ప్రెస్ సిబ్బంది ఎన్నుకోబడతారు. దాని ముఖ్యాధికారిని ఎన్నుకొనుటలో ప్రత్యేక శ్రద్ధ తీసుకొనబడుతుంది. పార్టీ సంఘాలు, G.P.O. శాఖ ఎన్నో తడవలు పరిశీలించి ఆమోదమిచ్చిన తరువాతనే ఒక వ్యక్తి ఆ ఉద్యోగానికి అర్హుడవుతాడు.

ప్రప్రథమంగా బ్లూ ఎక్స్ప్రెస్ నిర్మాణం త్రెగుబోవ్ దక్షత క్రింద కొనసాగింది. దాని నిర్మాణానికిగాను ఆతడు వివిధ రైల్వే మార్గములనుంచి పది ఉత్తమమైన పెట్టెలను ఎన్నుకున్నాడు. బండి పరుగిడు సమయంలో చక్రముల రొద ప్రయాణీకులకు వినిపించరాదు, కుదుపరాదు అన్న నాయకుల అభీష్టానుగుణంగా వాటిని తీర్చి దిద్ది పునర్నిర్మింప జేశాడు. పెట్టెల అడుగుభాగం దిగువ ఉదహరింపబడిన రీతిగా నిర్మింపబడి—(దళసరి సీసపు పూతపైన అట్టగా నొక్కబడిన మెత్తటి ఉన్నిపొర, దానిపై ఒక పొరబెండు, దాని మీద అట్టగా నొక్కబడిన ఇంకొక పొర మెత్తటి ఉన్ని, దానిపై నున్నటి బల్ల పలకలు తాపడం, వాటిపై అట్టగా నొక్కబడిన మరొక పొర మెత్తటి ఉన్ని, దానిపై దళసరిగా అవిసినూనె పూసిన కాన్వాస్ గుడ్డ, అన్నిటికిపైన మెత్తటి తివాసి). హంసతూలికాతల్పమా అన్నట్లుంటుంది. విశ్రాంతి

తీసుకొనుటకుగాను కేటాయించబడిన పెట్టెలలో ఉండే తివాసీ, కంట్రోలు వెలలకు వస్తువుల నమ్మే మాస్కోలోని ప్రభుత్వం అంగళ్లలో, ఒక్కొక్కటి 5,000 రూబుళ్లకు విక్రయింపబడుతుంది. ఇతర దుకాణాలలో అయినట్లైతే అది 50,000 రూబుళ్లకైనా లభ్యంకాదు. పెట్టెలు సక్రమంగా నిర్మింపబడినవో లేదో తెలుసుకొనుటకుగాను ఒక విచిత్రమైన పరిశీలన జరుపబడుతుంది. అంచుల పైవరకు నీరుగల గ్లాసును ఒక మేజాపై ఉంచుతారు. బయలుదేరినది మొదలు తిరిగి నిర్ణీత ప్రదేశంలో ఆగేవరకు గ్లాసులోని నీరు ఒక చుక్కైనా చింది బల్లమీద పడకూడదు. అప్పుడే ఆ పెట్టె సక్రమంగా నిర్మింపబడినదన్నమాట.

పెట్టె వెలుపలి నాల్గు ప్రక్కలూ నీలిరంగులతోను, కప్పువేత నీలిరంగుతోను పూయబడి ఉంటాయి. మెట్లు ఒక మచ్చగాని లేక గీతగాని కానరానంతగా బంగారువన్నె వార్నిష్‌తో మెరుగుపెట్టబడి ఉంటాయి. పెట్టె లోపలి లోహపు భాగములన్నీ నికిల్‌తో గాని స్టెయిన్‌లెస్ స్టీల్‌తో గాని తయారుచేయబడినవే, కిటికీలు అద్దపు పలకలతో కూర్చబడి ఉంటాయి. ఒక పెట్టెలోనుంచి ఇంకొక పెట్టెలోనికి పోయే మార్గం, ప్రయాణీకుడు గుర్తింపలేనంత చాతుర్యంగా నిర్మింపబడి ఉంటవి.

పెట్టెలు, 23 మీటర్ల నిడివిగల పుల్లమన్ నమూనావి. మామూలు పుల్లమన్ పెట్టెలలో 64 సీట్లుగాని, 38 బెర్తులు గాని ఉంటాయి. కాని బ్లూ ఎక్స్‌ప్రెస్ పెట్టెలో 16

మందికే వసతి ఉంటుంది. బ్లూ ఎక్స్‌ప్రెస్‌లో ప్రయాణం చేయుటకు ప్రత్యేకంగా వ్యక్తులకు కాకుండా ఆయా సంస్థల కార్యాలయాలకే టికెట్లు ఇవ్వబడుతాయి. టికెట్లలో కూడా మూడు తరగతులున్నాయి. ఆయా ప్రయాణీకులకు ఏర్పాటుచేయవలసిన భోజన సదుపాయాలలోని వ్యత్యాసం తెలియజేయుటకే ఈ విభజన ఉద్దేశింపబడింది. మొదటి తరగతి ప్రయాణీకులు భోజనశాలలో లభ్యమయ్యే ఏ పదార్థాన్నైనా, ఏ పరిమాణంలోనైనా, కోరినంత ఉచితంగా ఆరగించవచ్చు. రెండు మూడు తరగతుల వారికి కూడా భోజన, మద్యాలు ఉచితంగానే ఇవ్వబడతాయి. కాని వాటికి ఒక పరిమితి అంటూ ఉంది. అంతకు మించి వారు ఏ వస్తువులు తీసుకున్నా వాటి మూల్యాన్ని చెల్లించాలి. భోజనశాలలో రకరకాల రుచ్య భక్ష్యాలు, పండ్లు, మద్య పానీయాలు లభ్యమౌతాయి.

రైలు బయలుదేరే ముందు కండక్టర్ అన్ని పెట్టెలలోను ఉడుకులోన్ చల్లుతాడు. మేజాలపై గల పూల కూజాలలో పువ్వు గుచ్ఛాలు ఉంచతాడు. ప్రయాణ సమయంలో పండ్లు, కలకండ, మంచిరకపు సిగరెట్లు ప్రయాణీకులకు స్వయంగా అందజేస్తాడు. సైన్యాధ్యక్షుల, దళనాయకుల, ప్రజాప్రతినిధుల, పార్టీ ప్రాంతీయ సంఘాల కార్యదర్శుల విపరీత జిహ్వాచాపల్యం, చిలిపికోరికలు ఎంతటి దుబారా ఖర్చుతో కూడుకొన్నవైనప్పటికీ, అవశ్య కర్తవ్యంగా భావింప బడవలసినదే.

పోలిట్ బూరో సభ్యులు ప్రతివారికి స్వంత పెట్టె ఉంటుంది. అవసరమైనప్పుడు అది బ్లూ ఎక్స్ప్రెస్కు వెనుక తగిలించబడుతుంది. బాహ్య స్వరూపంలో దానికీ, ఎక్స్ప్రెస్ పెట్టెలకు వ్యత్యాసమేమీ ఉండదు. అధిష్ఠాన వర్గంవారు ప్రయాణం చేస్తున్నారనే గుట్టు బట్టబయలు కాకుండుటకే ఈ సాదృశ్యంకాని పెట్టెలోపలి సదుపాయాలు, సాధన సామగ్రి ఎక్స్ప్రెస్ పెట్టెలలోకన్న విపరీతంగా ఉంటాయి. ఆ పెట్టె ఏ మహామహునకు ఉద్దేశింప బడినదో, ఆతని అభీష్టానుగుణంగా, అలంకారాదులు అమర్చబడవలసి ఉంది. ఖర్చు ప్రసక్తే తేనక్కరలేదు. అందుకుగాను ఎంత మొత్తం కావలసినా బ్యాంకు ఎట్టి అభ్యంతరం చెప్పకుండా సమకూరుస్తుంది.

స్టాలిన్కుగాను ఉద్దేశింపబడిన పెట్టెలో రెండు పడక గదులు, ఒక హాలు, ఒక ఆఫీసు గది, ఆతని కార్యదర్శికింకొక ఆఫీసు గది, అనుచరుల నిమిత్తం ఒక హాలు, ఒక స్నానాల గది, ఒక వంట గది ఉన్నాయి. పెట్టె గోడలు, లోపలి మేజాలు, కుర్చీలు, సోఫాలు, మొదలైనవన్నీ మొహాగనీ కలపతో చేయబడినవే. ఇతర అగ్రనాయకుల యొక్క పెట్టెలుకూడా ఇదే ఫక్కీలో ఉంటాయి. కాని వాటి చట్రపుకట్టు, పరికరాలు వేర్వేరు నమూనాలలో వేర్వేరు కలపలతో తయారుచేయబడి ఉంటవి. కగనోవిచ్ పెట్టె కొండరావి కలపతోను, మాలటోవ్ పెట్టె స్టాలిన్ పెట్టెకు

అన్నిటిలోను ఖచ్చితమైన ప్రతిరూపంగాను నిర్మింపబడడం ఇందుకు నిదర్శనము.

అధిష్టాన వర్గంవారికి తక్కువ స్థాయిలోనివారైన సోవియట్ ఉన్నతోద్యోగులు తమ నాయకులను అనుకరించుటలో ప్రయత్నలోపం చేయరు. వారి స్వంత పెట్టెలలో, సాధన సామగ్రిని, పరికరాలను సమకూర్చుకొనుటలో ఎంత మాత్రం వెనుదీయరు. ఇందుకు ఉదాహరణాల కొదువ లేదు. 1936-వ సంవత్సరంలో అనేక మంది రైల్వే శాఖాధికారులకు పెట్టెలు బహూకరింపబడ్డాయి. ఉత్తర కాకసస్ రైల్వే అధిపతి మైయవిస్కీకి, ఒకప్పుడు జార్ చక్రవర్తికి చెందిన బండిలోని మొదటి నంబరు పెట్టె బహూకరింపబడింది. దానిని స్వాధీనముచేసుకొనే నిమిత్తం త్రొగుబోవ్ మాస్కోకు పంపబడ్డాడు. జార్ చక్రవర్తి బండి అక్టోబర్ రైల్వేస్టేషన్‌లో ఒక పక్కగా నిలచివుంది. దానిలోని ప్రతి వస్తువు, పింగాణీ సామాను, పక్కగుడ్డలు దేలు, సరిగా జార్‌ల కాలంలో ఉండినట్లే భద్రంగా ఉన్నాయి. కాని అది డీకావ్‌కజ్‌కు తీసుకొనిరాబడినపుడు దానిని చూచి మైయవిస్కీ హెచ్చు ఆశాభంగాన్ని వెల్లడించాడు. దానిని పూర్తిగా విడగొట్టి పాత వస్తువులను మార్చి కొత్త వస్తువులనుపయోగించి పునర్నిర్మించవలసినదిగా ఫర్మానా జారీ చేశాడు. పెట్టెచుట్టూ ఉండే బల్లకూర్పు, అడుగుభాగంతో సహా ఒలిచివేయబడ్డాయి. మార్పులకు, మరమ్మతులకు ఎన్నో వందల వేల రూబుళ్లు వ్యయం అయింది. మూడు నెలలకుపైగా పని కొనసాగిన తరువాత మిరమిట్లుగొలిపే

అంపచందాలతో పెట్టె తయారైంది. ఇంతకూ సోవియట్ సమాఖ్యలో గల ఇరవైనాల్గు రైలుమార్గాలలో ఒక్కదానికి మాత్రమే మైయువిస్కీ అధిపతి. అట్టి వేలాది పెద్ద చిన్న సోవియట్ అధికారుల నిమిత్తం స్వంత రైలుపెట్టెలు, విల్లాలు, విశ్రాంతి మందిరాలు, చికిత్సాకేంద్రాలు, అంతఃపురాలు, ప్రత్యేక అంగళ్లు, ఫలహారశాలలు, చిత్రప్రదర్శనశాలలు, మేళతాళాలు, విందుభోజనాలు, ఏర్పాటు చేయుటవల్ల అయ్యే ఖర్చు అంచనా ఊహకు అందని విషయం.

స్టాలిన్, మాలటోవ్, ఝుడనోవ్, కగనోవిచ్ లేక అగ్రనాయకులలో ఎవ్వరైనా విశ్రాంతి మందిరానికి ప్రయాణము చేసినపుడు అతని రైలుపెట్టె ఎక్స్ప్రెస్ చివర జతచేయబడుతుంది. ప్రయాణానికి ముందు రైలుమార్గాన్ని కాపాడే N.K.V.D. శాఖ కార్యాలయంవారు ఎక్స్ప్రెస్ ముఖ్యాధికారిని పిలువనంపుతారు. ప్రయాణం చేయబోయే ముఖ్యుని ఆకారస్వరూపాదుల గురించి ఆతనికి తెలియజేస్తారు. రహస్యాన్ని కప్పిపుచ్చెదననే ప్రమాణ పత్రంపై చేవ్రాలు చేయించుకుంటారు; భద్రతకుగాను తగు ఏర్పాట్లు చేయవలసినదిగా ఆజ్ఞాపిస్తారు.

స్టాలిన్ ప్రయాణం చేస్తున్నప్పుడు ఎట్టి ఆలస్యం సంభవించకుండా భగవంతుడే కాపాడాలి. అటువంటి దుస్సంఘటన 1936 లో ఒకనాటి రాత్రి సంభవించినది. ఎక్స్ప్రెస్‌కు ముందుగా గాసొలైన్ నూనె టాంకులుగల బండి వెళ్లింది.

ఒక స్టేషన్‌వద్ద, పనిలోవున్న ఉద్యోగి, అది ఎక్స్‌ప్రెస్ బండి వచ్చేలోగా తరువాత స్టేషన్ చేరుకోనగలదని భావించి టాంకుల బండి ముందుకు వెళ్లుటకు సమ్మతించాడు. స్టాలిన్ ఎక్స్‌ప్రెస్ బండిలో ఉన్నాడని తెలిసి ఉన్నట్లైతే సహజంగా ఆతడు ఇలాచేసి ఉండెడివాడే కాదు. దురదృష్టవశాత్తు ఆ స్టేషన్‌కు తరువాత రైలుమార్గం ఎత్తైన ప్రదేశముగుండా పోవలసివచ్చుటచేత నూనె టాంకులున్న బండి ఇంజన్ ఆగి పోయింది. ఈలోగా స్టాలిన్ బండి స్టేషన్ సమీపించింది. కాని గేటు మూయబడి ఉండుటవల్ల ఆగవలసివచ్చినది. వెంటనే రక్షక దళంవారందరు పెట్టెలలోనుంచి హడావడిగా బయటకు దుమికి బండిని చుట్టుముట్టారు. రైల్వేల N.K.V.D శాఖ ముఖ్యాధికారి "గేటు ఎందువల్ల మూయబడింది," అని ఆర్భాటంగా అరుస్తూ పరుగెత్తుకొనివచ్చాడు. ఇంతకూ జరిగిన ఆలస్యం మూడు నిమిషాలు మాత్రమే. తరువాత యథాప్రకారంగా రైలుబండి ముందుకు సాగిపోయింది. కాని డ్యూటీలో ఉన్న స్టేషన్ ఉద్యోగి తక్షణమే నిర్బంధింప బడ్డాడు. ఆ సమయాన ఇంటివద్ద నిద్రపోతూ ఏమి సంభ వించినదో తెలియని స్టేషన్‌మాష్టర్ కూడా నిర్బంధింప బడ్డాడు. అలజడి సమయంలో స్టాలిన్ తన రైలుపెట్టెలో శాంతంగా హాయిగా నిద్రించాడు.

ఎక్స్‌ప్రెస్ సామాన్య ప్రయాణీకులు (ప్రజా ప్రతినిధులు, పార్టీ ప్రాంతీయ సంఘాల కార్యదర్శులు, ఇతర "ఛోటా

నాయకులు, వారి భార్యలు") విశ్రాంతి మందిరాలకు ఆరోగ్య రక్షణ నిమిత్తముకాక వేడుకలకుగాను ప్రయాణం చేస్తారు. వారి పరిభాషలో "వేడుక" అంటే త్రాగి తందనా లాడడం, కామక్రీడలలో మునిగి తేలడం అని అర్థం. ఏ ఇతర విశ్రాంతి మందిరాలలోని "వేడుకలు" సోచి కిస్లోవో డస్కు-లలోని వేడుకల స్థాయిని అందలేవు. వారు దైనందిన జీవితంలో చచ్చినంత విసుగెత్తుతారు; ఉన్నతాధికారులు కూడా బగ్గీగుఱ్ఱాలవలె పనిచేస్తారు; ప్రాణాలను గుప్పెటలో పెట్టుకొని భయంతోనే ఉంటారు. త్రెగుబోవ్ చెప్పినట్లు విశ్రాంతి మందిరాలవద్ద వారు బరితెగి సంచరిస్తారు. సోవి యట్ పరిభాషలో అది "జీవిత మాధుర్యాన్ని ఒకసారి చవిచూడడం" అని పిలువబడుతుంది. ఆ సోవియట్ ప్రముఖులు త్రాగి ఆడే తందనాలు, జరిపే కామక్రీడలను గురించిన నిందలు గాథలుగా మారి చిరస్మరణీయాలై పోయాయి. వాటిని గురించి రైలుబండి ఉద్యోగులు తమలో తాము ఎన్నో కథలుగా చెప్పుకుంటారు.

బ్లూ ఎక్స్‌ప్రెస్ ముఖ్యాధికారి పదవి చాలా లాభసాటి ఉద్యోగం. బ్రహ్మాండమైన ఫ్యాక్టరీలలోని పెద్ద ఇంజనీర్లకిచ్చేటంత వేతనం త్రెగుబోవ్‌కు ఇవ్వబడేది. సంవత్సరానికి రెండు పర్యాయాలు క్రొత్త దుస్తులను ఆతడు అందు కొనేవాడు. ఇంకా ఎన్నో మామూళ్లు కూడా ఉండేవి. రైలుబండి చుట్టూ వస్తువులు కోకొల్లలుగా ఉండెడివి. వాటి అజాపజా ఎవ్వరూ చూచేవారే కాదు. ప్రయాణాలలో

ఖర్చుచేయగా మిగిలిన వస్తువులను—నిండు డబ్బాలలో కాలియర్, పండ్లు, మద్యపానీయాలు, సిగరెట్లు—ఎన్నైనా తెచ్చుకోవచ్చు—క్రెగుబోవ్ ఒక సోవియట్ అగ్రనాయకుని స్థాయిలో జీవించేవాడు. కాని ఏ ఘడియలో నిర్బంధింపబడతానో అనే భీతితోనే నిరంతరం వేదనపడేవాడు. N.K.V.D. శాఖ, వివిధ పార్టీ సంఘాలు ఆతనిని సర్వదా అనుమానించి ప్రశ్నిస్తూనే ఉండేవి. ఆతని భయ ఆందోళనలకు ప్రబల కారణం లేకపోలేదు. తుదకు ఆతడు నిర్బంధింపబడ్డాడు. కగనోవిచ్‌ని హత్యచేయుటకు కుట్ర జరిపాడని ఆతనిపై ఆరోపింపబడింది. మరణశిక్ష కూడా విధింపబడింది. కాని ఏ కారణంవల్లనో శిక్ష మార్పుచేయబడింది. యుద్ధకాలంలో రష్యానుంచి బయటపడడానికి క్రెగుబోవ్‌కు వీలు చిక్కింది.

పైన ఉదహరింపబడ్డ విషయాలు, ముఖ్యంగా యుద్ధాత్పూర్వపు పరిస్థితులకు సంబంధించినవైనప్పటికి, యుద్ధానంతర కాలంలో రష్యన్ నాయకుల స్వభావ, వైఖరుల గురించి కూడా తెలుపుదుచేస్తాయి. 1941–వ సంవత్సరానికి పూర్వం నాటబడిన ఆ విషబీజాలు యుద్ధకాలపు అధ్వాన్న పరిస్థితులలో నాశనమైపోయినట్లు పైకి కనుపించినప్పటికి, లోలోపల వేర్లుతన్ని సోవియట్ సమాఖ్య మామూలు పరిస్థితులకు రా ప్రారంభించునప్పటికి బలమైన తీగలుగా పెరిగి సోవియట్ సామాజిక వ్యవస్థ చుట్టూ అలముకొన్నాయి.

పై రిపోర్టులలోని ప్రతి విషయం సోవియట్ సమాజంలో ఉన్నత వర్గీయుల స్వభావ లక్షణాలను స్పష్టంగా తెలియజేస్తుంది. జీవితములపట్ల వారు చూపే అలక్ష్య వైఖరి, విధినిషేధాలు పాటించక బరితెగి స్త్రీ, పురుషులు అనాగరికులవలె హేయభోగాలకు ఎగబడడం, కార్యాలయాలలో గొడ్లవలె బండచాకిరీ చేయడం, మంచీ చెడ్డా వివక్షత లేకుండా మొరటుగా ప్రవర్తించడం, జారు చక్రవర్తుల కన్న మిన్నగా భోగభాగ్యాలను అనుభవించ గోరడం, ఆ సౌకర్యాలనన్నింటినీ సమకూర్చే బాధ్యత ప్రభుత్వం పైననే ఉన్నదని భావించడం, అనేవి సోవియట్ ప్రముఖుల ప్రత్యేక లక్షలలో కొన్ని. కాని అట్టి సౌకర్యాలు పార్టీ నాయకత్వంపట్ల అచంచల విశ్వాసంగల వ్యక్తే పొందగలుగుతాడు. కాని అవిధేయుడు క్షణకాలంలో తన హోదా, ఉద్యోగం, బ్లూ ఎక్స్ప్రెస్ టికెట్టు, విల్లా సుప్రసిద్ధులైన వైద్యులు, కడకు వ్యక్తి స్వాతంత్ర్యం కూడా కోల్పోతాడు.

ద్వితీయ ప్రపంచ సంగ్రామానికి పూర్వం సోవియట్ సామాజిక వ్యవస్థలోని ఉన్నత వర్గీయులలో విప్లవము యొక్క మొదటితరంవారే అధికంగా ఉండేవారు; యుద్ధం తరువాతనుంచి రెండవ తరంవారు వారి పూర్వుల స్థానాలను త్వరిత గతిని ఆక్రమించుకొంటున్నారు. సోవియట్ ప్రభుత్వ యంత్రంలోని ప్రముఖ స్థానాలలో ఈనాడు ఎంతో మంది యువకులు కనుపించడం గమనింపతగ్గ విషయం. పూర్వుల

వలె కాక బాల్యదశనుంచి కమూనిష్టు సిద్ధాంత. విధానా లకు, క్రమశిక్షణకు కట్టుబడ్డ, తర్ఫీదును పొందినవారు.

రెండవ తరంవారు పలుకుబడికి, అధికారానికి రావడ మనేది యుద్ధానంతర కాలంలో వచ్చిన అతి ముఖ్యమైన మార్పులలో ఒకటి. ఈ తరంవారు తమ తల్లిదండ్రుల కన్న సుఖవంతమైన బాల్యాన్ని గడిపినవారు. వారి అల వాట్లు అంత అనాగరికమైనవి కావు; నడతలు, హెచ్చు నాజూకైనవి. వారి తండ్రులు ఉన్నత స్థానములను చేరు కొనినంతనే తమంతట తాము ఎరిగివున్న జీవన విధానంకన్న శ్రేష్టమైనదానిని తమ బిడ్డలకు ఏర్పాటు చేయవలెనని, విశేషంగా స్తుతించబడుచున్నప్పటికి "కార్మికుల, కర్షకుల" గుంపులుగా దిగజారనివ్వరాదని కాంక్షించారు. తత్ఫలి తంగా తమ బిడ్డలను విద్యాభ్యాసానికై, కళాశాలలకు, విశ్వవిద్యాలయాలకు పంపారు. ఆ ఉన్నత విద్యాకేంద్రా లలో వారు, లెనినిజమ్—స్టాలినిజమ్ వాదాలకు మించిన విద్యను అభ్యసించారు. ప్రపంచ వాఙ్మయంలోని ఉత్తమ గ్రంథాలను చదివారు; వస్తు, చిత్ర ప్రదర్శనశాలలను మ్యూజియమ్‌లను సందర్శించారు. ప్రకృతిశాస్త్ర విజ్ఞాన పరి శోధనాలయాలలో శాస్త్రజ్ఞానాన్ని అలవరచుకున్నారు. 1920—1940-వ సంవత్సరాల మధ్యకాలంలో కూడా పాత కాలపు బుద్ధిజీవులకు, క్రొత్తవారికి నడుమ బ్రహ్మాండమైన అంతరముండేది. మొదటివారు రెండవవారికన్న విజ్ఞానం లోను, బాహ్యప్రపంచంలోను ఉత్తములు; అయినప్పటికి రాజకీయవిశ్వాసాల దృష్ట్యా అంత విశ్వసనీయులు కారు.

క్రమేణా ఈ రెండు వర్గములవారి సంతతుల మధ్య అంతరం సన్నగిలుతోంది. అనతికాలంలో అది పూర్తిగా అదృశ్యమై పోతుంది. పాత, క్రొత్త ప్రకృతుల సమ్మేళనం కొనసాగు తోంది.

సోవియట్ సమాజంలోని ఉన్నత వర్గీయుల రెండవ తరం వారికి సోవియట్ సమాఖ్య స్థాపన ఉత్క్రాంతలూగించే ఘనవిజయం కాదు. నిత్యం త్రాగే నీరువలె దినదినం ప్రకాశించే సూర్యచంద్రులవలె, స్థిరమైపోయిన వ్యవస్థగా వారు దానిని భావిస్తారు. అది వారిలో తీవ్ర ఉద్రేకాన్ని గాని, నిష్కపట అతిశయాన్నిగాని రేకెత్తించదు. వారిలో అధిక సంఖ్యాకులు సోవియట్ ప్రభుత్వంపట్ల విశ్వాస మున్నవారు. అయితే గాఢభక్తికి, విశ్వాసానికి మధ్య బ్రహ్మాండమంత వ్యత్యాసముంది. మొదటి తరంవారు కేవల భక్తిప్రపూరితులు. రెండవ తరంవారికున్నది ఒక విశ్వాసము మాత్రమే. ప్రతి విషయం సక్రమంగా జరిగి నంతవరకు...యంత్రం పనిచేస్తుంది, చక్రాలు తిరుగుతాయి, ప్రజలు మాట వింటారు, నాయకుని నక్షత్రం ధగద్ధగాయ మానంగా మెరుస్తుంది. ఎట్టి ప్రశ్నలు జనించవు. ఒడి దుడుకు లేకుండా పరిపాలనా యంత్రం పనిచేయటానికి విశ్వాస మొక్కటే చాలు. కాని క్లిష్టపరిస్థితులు తప్పని సరి; బహుశా ఆసన్నమైనా యేమో కూడా.

వ్యక్తిగత స్నేహానికివలెనే రాజకీయ విశ్వాసానికి కూడా దుర్దశ కొలబద్ద. అంతర్జాతీయ విషయాలలో సోవియట్ నాయకత్వానికి సంభవించే పరాజయాలవల్ల దాని సర్వజ్ఞ

త్వంలోని నిగ్గుబట్ట బయలవుతుంది. వెంటనే కృత్రిమ ఏకీభావము అంతరించిపోతుంది. ఇదివరలో తప్పనిసరి అని అంగీకరింపబడిన...రహస్య రక్షకభటులు, నిర్బంధాలు, వెట్టిచాకిరీ, పునరాయుధ ధారణ, పంచమాంగ దళాలు— పెనువిమర్శకు గురి అవుతాయి. ప్రభుత్వ విధానాలు శంకించడం సంభవిస్తుంది. రాజకీయ, ఆర్థిక రంగాలలో ఓటమి సంభవించిన తరువాత భిన్నాభిప్రాయాలు తప్పని సరి; కలతలు సమాజంలో అట్టడుగున ఉన్న సామాన్య ప్రజలవర్గమునకే పరిమితమై ఉండవు. పైకి కనుపిస్తూన్న రాజకీయ ఏకమత్యం బ్రద్దలవడం తొలుత ఉన్నత వర్గం లోనే సంభవింపవచ్చు. క్రమేణా ఒక తరంవారి స్థానాన్ని తరువాతి తరంవారు ఆక్రమించుకొనుచూ రాగా రాగా సమాజంలోని ఉన్నత వర్గీయుల అభిజ్ఞత్వం పరీక్షకు తట్టుకో వలసివస్తుంది. ఆ వర్గాలవారిలో అధిక సంఖ్యాకులు కమ్యూనిష్టు పార్టీకి చెందినవారు, పార్టీ క్రమశిక్షణ, విధే యతా ప్రమాణాలకు కట్టుబడి ఉన్నవారు అనే విషయాలు యదార్థం. అయినప్పటికి ఈనాడు కమ్యూనిష్టు పార్టీయే ఒక నూతన రూపాన్ని దాలుస్తోంది.

## యుద్ధానంతర కమ్యూనిష్టు పార్టీ

1939-వ సంవత్సరంలో యుద్ధం ప్రారంభమయ్యే ముందు సోవియట్ యూనియన్ కమ్యూనిష్టు పార్టీ సభ్యత్వ సంఖ్య దాదాపు 25,00,000. 1941-వ సంవత్సరంలో జర్మన్

దాడికి ముందు దాని (అది) మొత్తం 37,00,000. ఈ నాడు పార్టీలో సుమారు 70,00,000 మంది సభ్యులున్నారు. వారిలో నూటికి రమారమి డెబ్భై అయిదు మంది క్రొత్తగా పార్టీలో చేరిన పిన్నవయస్కులగు స్త్రీ, పురుషులు. ఈ (ఆ) పదేండ్ల కాలంలోనే కమ్యూనిష్టు యూత్ లీగ్ సభ్యత్వ సంఖ్యకూడా 40,00,000 నుంచి 1,00,00,000 కు పెరిగింది. దాని అధీన సంఘాల సంఖ్యకూడా 2,01,000 నుంచి 4,50,600 కు పెరిగింది.

గత 12 సంవత్సరాల కాలంలో పార్టీలో కన్పించే అస్థిర స్థితికి భిన్నంగా, నాయకత్వం దాని అధికారాన్ని సుస్థిరం చేసుకుంది. వుద్రిక్త పరిస్థితులతో కూడుకొనియున్న ఈ దీర్ఘకాలంలో పోలిట్ బూరోనుంచి ఒక్క నికోవాయ్ వోజెన్ సెన్‌స్కీ మాత్రమే తొలగించ బడ్డాడు. వోజెన్ సెన్‌స్కీ విశేష ప్రాముఖ్యం కలవాడు కాదు. సిద్ధాంత, రాజకీయ రంగాలలో ఆతనికి చెప్పుకొనతగిన ప్రజ్ఞ ఏమీ లేదు. పోలిట్ బూరో నుంచి తొలగింపబడిన తరువాత ఆతని గురించి అందరు మరచిపోయారు.

పోలిట్ బూరోలోని ఇతర సభ్యులు, సమర్థులు, ప్రతిభా వంతులు, సంవత్సరాల తరబడి జాగ్రత్తగా వారిని పరిశీలించిన మీదటనే స్టాలిన్ వారిని పోలిట్ బూరోకు ఎన్నుకున్నాడు. ఆతని అభిప్రాయాలకు అనుగుణంగానే వారు సర్వదా సంచరిస్తారు. వారిలో ఎవ్వరూ ఎన్నడూ కనీసం కొద్దికాలం పాటైనా, పార్టీలోని స్టాలిన్ వ్యతిరేక వర్గానికి

గాని, లేక ఏ ఇతర రాజకీయ పక్షానికి గాని చెందినవారు కారు. వారి నా వున్నతస్థితికి తెచ్చినది స్టాలినే. వారి రాజకీయ జీవితాల అభ్యున్నతి ఆతని ఆదరాభిమానాల పైననే ఆధారపడి వుంది. పోలిట్ బూరో సభ్యుల సగటు వయస్సు ఏభై ఎనిమిది సంవత్సరాలు. వయోవృద్ధుల హస్తగతమై యున్న ప్రపంచ దేశ ప్రభుత్వాలలో సోవియట్ ప్రభుత్వం ఒకటి. తెలిసి, తెలియకకూడా సోవియట్ నాయకులు స్టాలిన్‌ను, స్వభావ, ప్రసంగ, కడకు వస్త్రధారణ విషయాలలో అనుకరిస్తారు. సామ్యం ఈ బాహ్యలక్షణాల తోనే అంతంకాదు. నియంతకు వలెనే ఎవ్వరికి విశేష మేధా సంపదగాని, వ్యక్తిత్వంకాని లేదు. పోలిట్ బూరో లోని వారెవ్వరు, గొప్ప ఆలోచనాపరులు, ప్రతిభావంతు లైన సిద్ధాంత సూత్రకారులు, విఖ్యాత రచయితులు గాని కాదు. 1948-వ సంవత్సరంలో చనిపోయిన, పోలిట్ బూరో సభ్యుడు కీ. శే. ఆండ్రీ ఝుడనోవ్ ఒక్కడే నాయ కత్వం వహించుటకు వలసిన వ్యక్తిత్వం కలవాడు.

స్టాలిన్ తనను మించిన మేధావి, ప్రజల నాకర్షించి మన్నన లను పొందగల శక్తి కలవాడు ఉండుట సహించలేడు. ఆతని ముఖ్య అనుయాయు లందరు సామాన్య బుద్ధి కుశలత కలవారైనప్పటికి, కార్య శూరులు, కష్టించి పనిచేసే వారు, మంచి నిర్మాణాత్మక శక్తి కలవారు, పరిపాలనాదక్షులు, నిర్దయులైన అధికారులు. వారిలో ఒకడైన వియాచిస్లావ్ మొలటొవ్ గుణగతాలను దగ్గరనుంచి పరికించే అవకాశం ప్రపంచంలోని ఇతర దేశాలవారికి కలిగింది. వేలహామైన

భావాలు రాజకీయ వ్యవహారాలలో మూర్ఖపు పట్టుదల, నిర్దయ, నిర్విరామంగా పనిచేయడంవంటి మాలటోవ్ లక్షణాలు అనేకం సోవియట్ సమాఖ్యలోని ఆతని సమకాలిక నాయకత్వం యొక్క లక్షణాలకు మచ్చు తునకలు.

ఈ మధ్యకాలంలో ముగ్గురు పోలిట్ బూరో సభ్యులు దివంగతులయ్యారు. వారు, U.S.S.R. అధ్యక్షుడు మైఖైల్ కెలినిన్, ఆండ్రి ఝడనోవ్, అలెగ్జాండర్ షహెర్‌కోవ్‌లు. వారి తరువాత ఆస్థానాలు ఆక్రమించినవారు, అంతకు ముందుగానే ఎన్నుకోబడినవారు. ఇటీవలనే వారు వున్నత స్థానాలు చేరుకున్నారు, లేదా చేరుకోవటానికి సంసిద్ధమౌతున్నారు. వారు: స్టాలిన్‌కు నమ్మకస్తుడైన చిరకాల స్నేహితుడు, కమ్యూనిస్టు పార్టీ కంట్రోల్ కమిషన్ సభ్యుడు అయిన యమ్. ష్కిరియాటోవ్, ప్రవదా సంపాదకుడు పొస్‌పెలోవ్, బైలో రష్యా పార్టీ అధినేత వుద్యోగం నుంచి ఇటీవలనే ఉన్నతస్థాయికి కొనిరాబడిన పి. పొనమరెంకో; జి. పొపోవ్, యమ్. సుస్లోవ్‌లు. పోలిట్ బూరోలో సభ్యులుగ ఇంకను నియమింపబడక పోయినప్పటికిన్ని అన్ని విధాలా అధిష్టాన వర్గంలో ఒక భాగంగానే వారు ఎంచబడతారు. పన్నెండు మంది పోలిట్ బూరో సభ్యులు ఇతర "అభ్యర్థులు"తో బాటు వారుకూడా సోవియట్ సమాఖ్యలో విశేష అధికారం చలాయిస్తారు. అయినప్పటికి వారి, వారి హోదాలు, పలుకుబడులలో చాలా వ్యత్యాసాలున్నాయి. పోలిట్ బూరో సభ్యులలో హెచ్చుమంది నిర్వహించవలసిన కార్యకలాపాలు కొన్ని ప్రత్యేక రంగాలకే.

పరిమితమై వుంటాయి. ప్రభుత్వ విధాన నిర్ణయాధికారం స్టాలిన్‌చే ఎన్నుకోనబడిన ఒక చిన్న వర్గం హస్తగతమై వుంటుంది. యుద్ధ కాలంలో స్టాలిన్, మాలటోవ్, బెరియా, మాలెన్కోవ్, వొరోషిలోవ్‌లతో కూడిన దేశ రక్షణ సంఘ నిర్మాణంలో ఆ అంతర్ప్రభుత్వ అధిష్ఠాన వర్గపు ఉనికి బహిర్గతమైంది. వాస్తవానికి అది యుద్ధానికి పూర్వం కూడా ఉండేది. ప్రస్తుతకాలంలో కూడా కొనసాగుతోంది. అనధికారంగా అయినప్పటికి, ఆ వర్గంలోని సభ్యులకు క్రెమ్లిన్‌లో, స్టాలిన్ పఠన మందిరాన్ని ఆనుకొని స్వంత కార్యాలయాలు, ఉన్నాయి. స్టాలిన్ అధినేతగాను, లెవ్ రింటా బెరియా, జియార్జి మాలెంకోవ్, వియాబిస్లావ్ మాలటోవ్‌లు సన్నిహిత సలహాదార్లుగాను ఉన్న ఈ వర్గం ఉన్నతోన్నత ప్రభుత్వ సంస్థ.

ప్రతి "ఛాయాప్రభుత్వా"పు చరిత్రవ్యక్తిగత వైరాలలో ఆవరింపబడి ఉంటుంది. ఆ వ్యక్తిగత కలహాలే రాజకీయ కలహాలుగాను, రాజకీయ అభిప్రాయభేదాలుగాను పరిణమించి కడకు వ్యక్తి సంబంధబాంధవ్యాలపైకి దాడిచేస్తాయి. పోలిట్ బూరోవంటి తక్కువ సభ్యత్వంగల ఒక చిన్న వర్గంలోని వ్యక్తులమధ్య తగవులాటలు విశేష దుఃఖాన్ని కలిగించేవిగా పరిణమిస్తాయి.

ఆ వర్గంలోని ప్రతివ్యక్తి తానొక్కడే ముదుసలి నియంత గౌరవాన్ని కాపాడడానికి, ఆయన సిద్ధాంతాలను తు. చ. తప్పకుండా ఆచరణలో పెట్టడానికి సమర్థుడనని, తరువాత

తానే నియంత అగుటకు అన్ని విధాలా తగిన వాడనని తలుస్తాడు. పాశ్చాత్య దేశాలవారు స్టాలిన్ చర్యలు చూచి అలజడి చెంది, అసహాయులై, ఆ విపత్కర పరిస్థితులనుంచి విముక్తిపొందటానికి ఆతని మరణమొక్కటే శరణ్యమని భావించి దానికై ఎదురు చూస్తారు; కాని స్టాలిన్ చుట్టు ఆవరించుకొని ఉన్న ఉన్నతాధికారులందరు ఆతని అంత్యానికి ఇంకెక్కువ ఆతురతతో కాచుకొని ఉన్నారు. బలవంతులు, ఆశాపరులు అయిన వీరిలో ప్రతి ఒక్కడు "ప్రియనాయకుడు" రంగంనుంచి అంతర్థానమయ్యే దినంకొరకు అతి జాగ్రత్తగా పథకాలు తయారు చేసుకున్నారనేది నిర్వివాదాంశం.

అధిష్ఠాన వర్గంలోని సోవియట్ నాయకమ్మన్యుల మధ్య గల అంతఃకలహాల గురించి తెలిసింది చాలా తక్కువ. మాలెంకోవ్ విశేషమైన పలుకుబడిగల అనేక మంది ఆతని సహచరులతో వ్యతిరేకంగా సలిపిన పోరాటం ఇటీవలి విషయం. ఆ పోరాటమే వ్యతిరేక ముఠాలమధ్య చిన్న యుద్ధంగా పరిణమించింది. ఈ రహస్య యుద్ధకాలంలో మాలెంకోవ్ ప్రబల విరోధి ఝుడనోవ్ 1948 వేసవిలో మరణించాడు. ఆ తరువాత కొద్ది మాసాలకు మాలెంకోవ్ యొక్క మరొక ముఖ్య ప్రత్యర్థి మాలటోవ్, బెర్లిన్‌పై విధించిన దిగ్బంధన విఫలం కావడంతో (క్రింది) స్థాయికి తగ్గించ బడ్డాడు. దాని ఫలితంగా ప్రస్తుతం మాలెంకోవ్ దే పై చేయిగా ఉంది.

అట్టి విద్వేషాలు, కుట్రలు, విరోధాలు మనలను ఉద్వేగ మానసులుగా చేయునంత స్థాయిని ధ్వనింపవచ్చు. కాని వాటి ఆంతర్యాన్ని అతిశయోక్తిగా చెప్పరాదు. సోవియట్ సమాఖ్యలో "మాలటోవ్ విధానం" అనిగాని, "మాలెంకోవ్ విధాన"మనిగాని లేక "ఖ్రుశ్చోవ్ విధానం" అనిగాని ఎన్నడూ లేదు. ఉన్నదల్లా ఒక్క "స్టాలిన్ విధానం" మాత్రమే. స్టాలిన్‌ను "పోలిట్ బూరో బందీ" అని పిలవడం అవ్యక్తం. అదే విధంగా ఆతని కార్యాచరణ విధానాన్ని అడ్డగించడానికి ఆ ఉన్నతస్థాయిన సుసంఘటిత వర్గాలున్నాయని విశ్వసించడంకూడా అవ్యక్తమైన పనే: ఆతడు ప్రతికూలతను సహించడు. ఆతని అధికారం అపరిమితం.

తరచు నాయకుడు ముందుగానే నిశ్చయించిన దానిని మాట వరసకు ఆమోదించి ఆచరణలో పెట్టే నిమిత్తమే పోలిట్‌బూరో సమావేశ పరుపబడుతుంది. క్రొత్త సమస్యలు ఉత్పన్నమైనప్పుడు పోలిట్ బూరోలో అభిప్రాయభేదాలు సంభవిస్తాయి. సభ్యుల అభిప్రాయాలను ఓర్పుతో వినే శక్తిగల స్టాలిన్ ఆతని సహచరులు వారి వారి దృక్పథాలను వెల్లడించడానికి అనుమతిస్తాడు కాని ఆ సమస్యా పరిష్కార మార్గం ఆతనికి స్పష్టంగా గోచరించగానే తన అభిప్రాయాన్ని వెల్లడిస్తాడు...... దానితో ఆ అభిప్రాయమే చెల్లుబాటవుతుంది.

కమ్యూనిష్టు పార్టీ కేంద్ర కమిటీయొక్క స్పెషల్ సెక్టార్ అనే సంస్థకు స్టాలినే స్వయంగా ఆధిపత్యం వహించడం అనేది ఆతని ప్రత్యేక ప్రాబల్యాన్ని సూచిస్తుంది. ఆ

స్పెషల్ సెక్టార్‌లో నాయకునిపట్ల అచంచల విశ్వాస విధేయతలు కలవారుగా ఎన్నుకోనబడిన నాల్గువందలకు పైబడ్డ సంఖ్యగల సిబ్బంది ఉంటుంది. ఈ సంస్థ స్టాలిన్ యొక్క వ్యక్తిగత ఆజ్ఞలకు బద్ధమై, ఆతని వ్యక్తిగత ప్రభుత్వ యంత్ర సాధనగా పనిచేస్తుంది. స్పెషల్ సెక్టార్ వేర్వేరు శాఖలుగా విభజింపబడి, వైదేశిక, పారిశ్రామిక, వ్యవసాయిక, విదేశవాణిజ్య, సైనిక విషయాలు మొదలైన వాటిలో వ్యవహరిస్తుంది. ఆ శాఖలలో సెక్యూరిటీ సెక్షన్ కూడా ఉంది. స్టాలిన్ ఆజ్ఞానువర్తియై పనిచేసే ఆతని స్వంత M.V.D. శాఖ అది. సోవియట్ సమాఖ్య ఆంతరంగిక పోలీసు శాఖ, రక్షణ బలాల శాఖ అయిన యమ్. జి. బి; యమ్. వి. డి. ల అధినేత, సర్వాధికార సమన్వితుడు అయిన లావేరెంటి బెరియాకు సెక్యూరిటీ సెక్షన్ పై అధికారం లేదు.

పోలిట్‌బ్యూరో సభ్యులు రాజధానిలో వున్నపుడూ, ప్రయాణాలమీద ప్రదర్శనాలవద్ద, ఇతరత్రా ఎక్కడ వున్నా వారిని రక్షించే బాధ్యత బెరియా ప్రథమ దళానిది. (దానినే నాయక రక్షణదళం అని పిలువడం కూడా కద్దు). క్రెమ్లిన్‌కు వచ్చేవారిని, పోయేవారిని తణిఖీ చేయటానికి, దానిని చూడగోరేవారికి అనుమతి పత్రాలు ఇవ్వటానికి నియోగించబడిన క్రెమ్లిన్ బహిర్ రక్షకదళం కూడా బెరియా ప్రథమ దళం పర్యవేక్షణ క్రిందనే పనిచేస్తుంది. క్రెమ్లిన్ ఆవరణంలోని వేర్వేరు భవనాలు రక్షించే బాధ్యత కూడా ఈ ప్రథమ దళానిదే. స్టాలిన్‌యొక్క స్వగృహం,

కచ్చేరీలు మాత్రమే దాని పర్యవేక్షణకు మినహాయింపు. వీటి రక్షణ విషయంలో ఆతని సన్నిహితానువర్తి బెరియాను కూడా స్టాలిన్ నమ్మలేకపోయాడు. క్రెమ్లిన్ యొక్క ఈ గర్భగుడి స్పెషల్ సెక్టార్ పోలీసు బలగంచే కాపలా కాయబడుతూ వుంటుంది. ఈ పనికై సాయుధ సైనిక దళాన్ని పోషిస్తుంది. రహస్య రక్షకభటుశాఖలోని వున్నతాధికారులతో కూడి మహానాయకుని అంగరక్షక దళం. దాని విధేయత, సమర్థతలపైననే స్టాలిన్ జీవితం ఆధారపడి వున్నందుననే అంత శ్రద్ధ, ధనవ్యయమూను. వున్నతాధికారులతో కూడుకొన్న ఆ ప్రత్యేక దళానికి బెరియా క్రెమ్లిన్ రక్షణదళంపై కూడ అధికారం వుంది.

మాస్కో నగరం అక్షరాలా కమ్యూనిజానికి రాజధాని. దానిలో ప్రస్తుతం వివిధ—రంగాలలో పనిచేస్తున్న 3,000,000 స్త్రీ పురుషులలో, అనగా నగరంలోని బాల బాలికలు మినహా మిగతా జనాభాలో, 407,000 (అనగా నూటికి 13 వంతులు) కమ్యూనిష్టు పార్టీ సభ్యులు, 480,000 (అనగా నూటికి 16 వంతులు) కమ్యూనిష్టు యూత్ లీగ్ సభ్యులు. అయినప్పటికి 9,000,000 ల జనాభాగల మాస్కో రాష్ట్రంలో 195,000 ల మంది మాత్రమే కమ్యూనిష్టులు (అనగా మొత్తం జనాభాలో నూటికి 2 వంతులు).

యుద్ధంవల్ల, దాని 30,100,000 ల జనాభాలో హెచ్చు భాగం నష్టపోయిన లెనిన్‌గ్రాడ్‌లో 200,000 మంది మాత్రమే పార్టీ సభ్యులు. మరికొన్ని జాతీయ ప్రజా

స్వామికాలలోని పార్టీ సభ్యత్వసంఖ్యా వివరాలు ఈవిధంగా వున్నాయి:—

దాదాపు 40,000,000 ల జనాభా కలిగి వున్న యూక్రైన్‌లో కమ్యూనిష్టు సభ్యత్వ సంఖ్య 684,000. 1940 నుంచి సభ్యత్వ సంఖ్యలో వచ్చిన నూటికి 31 వంతుల పెరుగుదలను కలుపుకొనినా కూడా అది మొత్తం జనాభాలో నూటికి రెండు వంతులకు లోపే.

10,000,000 ల మంది ప్రజలుగల బైలో రష్యాలో కమ్యూనిష్టు సభ్యుల సంఖ్య 110,000—నూటికి రమారమి 1·1 వంతులు.

కజక్ ప్రజాస్వామిక రాష్ట్రంలోని 6,000,000 లకు మించిన జనాభాలో 229,000 ల మంది పార్టీ సభ్యులు—దాదాపు నూటికి నాల్గు వంతులు.

జార్జియా 3,500,000 ల జనాభాలో 166,000 ల మంది మాత్రమే కమూ నిష్టు సభ్యులు—(రమారమి నూటికి 5 వంతులు.)

కిర్ ఘిజ్ రాష్ట్రంయొక్క 1,500,000 జనాభాలో కమ్యూనిష్టులు 46,000 ల మంది మాత్రమే—నూటికి 3 వంతులు.

లిథునియా, 3,000,000 జనాభాలో 24,000 మంది మాత్రమే కమ్యూనిష్టు పార్టీ సభ్యులు—దాదాపు నూటికి 0·8 మంది.

లట్వియా కమ్యూనిష్టు పార్టీ సభ్యత్వం సంఖ్య 31,000 లు. దీనిలో సగభాగం, లేక మొత్తం దేశజనాభాలో నూటికి ఒకటిన్నర వంతులు, మాత్రమే లట్వియన్లు.

సోవియట్ సమాఖ్య మొత్తంమీద పార్టీ సభ్యత్వం జనాభాలో నూటికి 3·7 వంతులు. సమాఖ్యయందలి వివిధ ప్రజాస్వామిక రాష్ట్రాలలోని పార్టీ సభ్యత్వ సంఖ్యల యందలి వ్యత్యాసాలు కమ్యూనిజంపట్ల ప్రజల భిన్నవైఖరులను సూచింపవు. అట్టి వ్యత్యాసాలు చూచాయగా అయినా తెలిసేకాలం రష్యాలో ఎప్పుడో గడచిపోయింది. ప్రస్తుత సభ్యత్వ సంఖ్యలు ఆయా ప్రాంతాలలోని ఉద్యోగుల సంఖ్యా బలాన్ని మాత్రమే సూచిస్తాయి.

ఇటీవలనే ఆక్రమించుకొనబడిన లిథునియా, పశ్చిమ యుక్రైన్, పశ్చిమ బైలో రష్యాలవంటి నూతన రాష్ట్రాల స్థానిక సంఘాలను సోవియట్ సమాఖ్యలోని సంఘాల స్థాయికి తెచ్చే విషయంలో పార్టీ ఇంకను విజయం సాధించ లేదు.

కొన్ని ప్రత్యక్ష కారణాలవల్ల ఎంతోకాలం క్రిందట నుంచే (ఎంతోకాలంగా) పార్టీ దాని పూర్తి సభ్యత్వసంఖ్యల వివరాలను ప్రకటించడం మానుకుంది. ఈ వివరాలకు చాలా ప్రాధాన్యత వుంది. అందువల్ల పార్టీ సభ్యుల యొక్క జాతీయత, వయస్సు, సమాజంలో వారు ఆక్రమించే అంతస్తు సరిగా అంచనావేయడం అసాధ్యం.

కాని వార్తాపత్రికలలో అక్కడక్కడ ప్రచురింపబడే అసంపూర్ణ వివరాల నాధారంగా, ప్రస్తుతం పార్టీ సభ్యులుగా వున్నవారిలో అధిక భాగం యుద్ధకాలంలోను, తరువాత పార్టీలో చేరినవారేనని, విప్లవానికి పూర్వంనుంచీ సభ్యులుగా

వున్న వృద్ధ బోల్షివిక్‌లు, 1920–వ సంవత్సరంనుంచి పార్టీలోవున్న అనుభవజ్ఞులైన కమ్యూనిస్టుల సంఖ్య నానా టికి క్షీణించిపోతోందని స్పష్టమౌతుంది. ఆనాటికానాడు ఈ పెద్దలు తమ స్థానాలను నూతనంగా పార్టీలో చేరిన కొత్త యువక కమ్యూనిస్టులపరం చేస్తున్నారు. ఈనాడు పార్టీ సభ్యులలో హెచ్చు మంది యువక కమ్యూనిస్టులే. యుద్ధ ప్రారంభకాలం నాటికి చాలా పిన్న వయస్కులు. ఏదో ఒక వీరోచితకృత్యాన్ని జరుపుటవల్లనో లేక ధారా ళంగా ఉపన్యసించినందువల్లనో వారికి పార్టీ ప్రవేశార్హత కలుగజేయబడింది.

బోల్షివిక్‌లలో మొదటి తరంవారు జారిజమ్‌కు, ధనిక వాదానికి వ్యతిరేకంగా పోరాడారు. సమాజంలో విప్ల వాత్మకమైన మార్పులు తీసుకొనిరావలెననే ఆశయమే వారి నందుకు ప్రేరేపించింది. సోవియట్ ప్రభుత్వం అధికారం లోనికి వచ్చిన తరువాత మొదటి పది సంవత్సరాలలో పార్టీలో చేరినవారు ట్రాట్‌స్కీ, స్టాలిన్, బుఖారిన్‌లలో నుంచి నాయకుని ఎన్నుకొనుటలోనే నిమగ్నులై వుండవలసి వచ్చింది. రష్యాలో సామ్యవాద సామాజిక వ్యవస్థ నిర్మా ణానికన్న కలలే వారిలో ఉత్సాహాన్ని, పట్టుదలను రేకెత్తిం చాయి. ఇటీవల పార్టీలో చేరిన నూతన సభ్యులు నాజీ సైన్యాలకు వ్యతిరేకంగా పోరుసల్పిన యోధులు. విదేశ దురాక్రమణ, "జర్మన్ పశువులు", సోవియట్ పితృభూమి, విప్లవ నాయకునిగాకన్న, జాతీయ నాయకునిగా స్టాలిన్‌ను గుర్తించడం వరకే వారు పొందిన ఆరంభ రాజకీయ విద్య.

పార్టీ నూతన సభ్యుల తొలిరాజకీయ భావాలలో కమ్యూని నిజం పూజ్యం, అని దాని తాత్పర్యం. తరుణ వయస్సులో కలిగే భావాల ప్రభావం వ్యక్తి మనస్సుపై యావజ్జీవం నిలిచి వుంటుంది.

ముఖ్యంగా సోవియట్ సమాఖ్య కమ్యూనిస్టు పార్టీ వంటి సంస్థలో అధిక సంఖ్యాబలం కల వర్గానిదే అధికార మని భావించకూడదు. వాస్తవాధికారం నాయకుడు, ఆతని యొక్క సన్నిహితులు, కొద్దిమంది గల చిన్న వర్గంయొక్క అధీనమందే వుంటుంది. కమ్యూనిష్టు దృక్పథానికి భిన్నంగా కొత్త లక్షణం ఏదైనా గోచరిస్తే స్టాలిన్ దానిని మొగ్గలోనే త్రుంచివేస్తాడు; లేదా తన అధీనంలోనికి తెచ్చుకుంటాడు. తన అధీనంలోనికి తెచ్చుకునే సందర్భంలో దానిని తన స్వీయ భావాలకు అనుగుణంగా మార్చి, ఆమోద ముద్ర వేసి తన కార్యాచరణ విధానంలో అంతర్భాగంగా చేసు కుంటాడు. తంత్రాలు, ఎత్తుగడలు, జిత్తులు వేయడంలో స్టాలిన్‌కుగల అపార సామర్థ్యమే దాదాపు ముప్పై ఏండ్లుగా ఆయన విజయానికి మూలాధారంగా వుంటోంది.

పార్టీ నాయకత్వం తన ఆధిపత్యం సుస్థిరమైనదని ఎన్ని కల ద్వారాగాని—విప్లవం ద్వారాగాని తనకు పతనం సంభ వించే భయంలేదని గుర్తించినదే తడవుగా, పార్టీలోని అధిక సంఖ్యాక వర్గంవారికి తనను ఆజ్ఞాపించే అధికారం లేదని, తన సిద్ధాంతాలను ఆచరణలో పెట్టుటే దాని విధియని భావించ మొదలిడింది.

దేశంలోని ప్రతిభావంతులనువారు ఏ ప్రత్యేక విష యంలో సమర్థత గలవారైనప్పటికి, స్త్రీ, పురుష భేదం పాటించక, అందరను వివిధ కమ్యూనిష్టు సంస్థలలోనికి విలీనం చేసుకోవడం ప్రస్తుతం పార్టీ లక్ష్యము.

వివిధ రంగాలలోని ప్రతిభావంతులందరు పార్టీ సభ్యులని ప్రచారంచేసి ప్రజాబాహుళ్యంపై పార్టీ నాయకత్వాన్ని సుస్థిరంచేసుకొనడమే ఈ లక్ష్యంయొక్క ఆంతర్యము. అందు వల్ల సమర్థుడైన ప్రతి వ్యక్తి,—తేనెటీగలు పెంచువాడు, వృక్షశాస్త్రజ్ఞుడు, సినీమానటుడు, వేటకాడు, జ్యోతిష్కుడు, మొదలైనవారందరు—పార్టీలో తప్పనిసరిగా చేరితీరాలి. అందుకుగాను ఆతనిపై ఒత్తిడి తేబడుతుంది. అంతేకాక పార్టీ సభ్యులకు కలుగజేయబడిన ప్రత్యేక హక్కులు ఆతని భయసందేహాలను చాలావరకు తొలగిస్తాయి. ఆ ఒత్తిడి, ఆకర్షణలకు ఆతడు లొంగిపోయి కడకు పార్టీలో చేరడానికి అంగీకరిస్తాడు. దేశంలోని మేధావులను, ప్రతిభావంతులను పార్టీ సిద్ధాంతాల పలుకుబడి క్రిందకు తీసుకొనివచ్చి వారిని పార్టీలో విలీనం చేసుకొనుటకే ఆ విధానం ఉద్దేశింప బడింది. ఈ ముఖ్యులు పార్టీ నాయకుని అభిప్రాయాను గుణంగా వర్తిస్తారు. ప్రజాబాహుళ్యం ఈ ప్రతిభావంతుల నాయకత్వాన్ని అంగీకరిస్తారని ఆశింపబడుతూంది.

స్టాలిన్ అభిప్రాయ ప్రకారం కమ్యూనిష్టు పార్టీ కను సన్నలలో మెలగే శ్రామిక ప్రజా బాహుళ్యంతో కూడిన సమాజమే సామ్యవాద సామాజిక వ్యవస్థ.

యుద్ధ దుమారం సద్దుమణిగి భవిష్యత్కాలంలో నిర్వహించవలసిన బ్రహ్మాండ కార్యకలాపాల సంక్షిప్త స్వరూపాలు బయటపడడంతో వినయవిధేయతలు గల ప్రభుత్వోద్యోగులు ఎంతోమంది వెంటనే కావలసి వచ్చారు. శాంతి కాలంలో పోషింపబడుతూ వుండే సాధారణ సైనిక సంఖ్యకు రెండు మూడు రెట్లు అధికంగా సేనలు ప్రస్తుతం పోషింపబడుతున్నాయి. రాబోయే యుద్ధానికి కావలసిన పెద్ద సైన్యం యొక్క అస్థి పంజరంవలె పదిలక్షల కమ్యూనిష్టులను కీలక స్థానములలో సోవియట్ ప్రభుత్వం కాపుంచవలసి వచ్చింది. యుద్ధం సంభవించబోయే దుర్దిన ఆగమనాన్ని వారు నిరీక్షిస్తున్నారు. ఆక్రమిత ప్రాంతాలలో మామూలు పరిపాలన, ఆర్థిక దోపిడీ కార్యకలాపాలు నిర్వహించే నిమిత్తం క్రమశిక్షణ గల పార్టీ సభ్యులు చాలామంది కావలసి వచ్చారు. నూతనంగా సోవియట్ యూనియన్‌లో కలుపుకోనబడిన ప్రాంతాలలో కమ్యూనిష్టులు కొద్దిమందే వున్నారు. అయినా వారు అంత నమ్మకస్తులు కారు. అందుచేత పరిపాలనకు, పార్టీ నిర్మాణానికి సంబంధించిన పనులు నిర్వహించడానికి, ఉపన్యాసాలు ఇవ్వడానికి వార్తా పత్రికలు ప్రచురించడానికి పార్టీ సభ్యుల పెద్ద పెద్ద దళాలను ఆక్రమిత ప్రాంతాలకు తరలింపవలసి వచ్చింది. వారందరకు ఆయా ప్రాంతాలలో స్థిరనివాసాలు ఏర్పాటు చేయబడ్డాయి. M.G.B.-M.V.D. శాఖ ప్రత్యేక దళాల నిమిత్తం, విదేశాలలో అది నిర్వహించవలసిన నూతన కార్యకలాపాల నిమిత్తం, లక్షలాది కమ్యూనిష్టులు అవసరమయ్యారు. రష్యాలోని

రైతాంగానికి సిద్ధాంత ప్రబోధం చేసే నిమిత్తం ఏర్పాటు చేయబడిన కమ్యూనిష్టు సంస్థలు చాలా తక్కువగా వుండడం, పెద్ద విస్తీర్ణం గల ప్రాంతాలలో కమ్యూనిష్టు సెల్స్ అసలే లేకపోవడం, ప్రభుత్వాన్ని సర్వదా కలవర పెట్టే విషయంగానే వుండేది. సైనికులు యుద్ధ రంగాలనుండి ఇండ్లకు తిరిగివచ్చినపుడు స్వదేశంలోని పార్టీ యంత్రాన్ని బలపరచుకొనటానికి అవకాశం చిక్కింది.

అందుచేతనే లక్షలాది నూతన సభ్యులను పార్టీ వదలుకొని ఉండినట్లైతే అది అవివేకమైన పనిగా భావింపవలసి ఉండేది. కమ్యూనిష్టు పార్టీ విశేష క్రమశిక్షణకు కట్టుబడ్డ సంస్థ. దాని సభ్యుల విధేయతను ఎంతమాత్రం శంకించపనిలేదు. వారందరూ అపార ప్రభు భక్తికి (బహుమానములు) బహుమతులు బడసినవారే. ఏ సంస్థ సభ్యులకైనా దాని విధానాల మంచి చెడ్డలను చర్చించి నిర్ణయించే హక్కు వుంటుంది. కాని సోవియట్ కమ్యూనిష్టు పార్టీకి సంబంధించినంతవరకు అట్టి హక్కు ఎంతో కాలంక్రిందటే రహితమైపోయింది. ప్రస్తుతం పార్టీలో చేరిన సభ్యునకు పార్టీని నడుపవలెననే ఆలోచనే పుట్టదు. పార్టీ సమావేశాలు వాటి ప్రాముఖ్యతను, అర్థాన్ని కోల్పోయాయి. గత సమావేశం జరిగి పన్నెండేండ్లయింది. ప్రతి మూడు సంవత్సరాలకు సమావేశం జరుపవలెననే పార్టీ నియమానికిది విరుద్ధంకాదా అనే ప్రశ్నే ఉదయించదు. ప్రభుత్వ విధానాలమీద ఎట్టి పరిశీలన, విమర్శన లేకపోవడమనేది అతి సహజమైన లక్షణంగా ప్రస్తుతం ఎంచబడుతోంది.

నూతన సభ్యులను పార్టీ ఉన్నత వర్గాలలో వుంచినప్పటికి వారికి కమ్యూనిష్టు సిద్ధాంత, సూత్ర, కార్యాచరణ విధానాలలో తీవ్రమైన తర్ఫీదు ఇవ్వవలెనని పార్టీ నిశ్చయించింది. నిష్కళంకమైనవిగా ఊహింపబడిన వారి మనస్సులను స్టాలిన్ ప్రవచన సిద్ధాంత సూత్రాలతో నింపివేసే నిమిత్తం పార్టీ కేంద్రకమిటీ ఒక పెద్ద కార్యక్రమ పథకం తయారుచేసి ఆచరణలో పెట్టే నిమిత్తం దానిని స్థానిక పార్టీ సంస్థలకు పంపింది. యుద్ధానంతరశకంలో నేటికికూడా, అది పార్టీ ముఖ్య కార్యాచరణ రంగాలలో ఒకటిగా వుంది. ఆ పథకంలోని హెచ్చుభాగం విజయవంతంగానే వున్నప్పటికి కొన్ని ముఖ్య విషయాలలో అది విఫలమైందని చెప్పవలసి వుంది.

యుద్ధం ముగిసిన తరువాత నుంచి పార్టీ అనేక ప్రత్యేక విద్యా సంస్థలు, విశ్వవిద్యాలయాలు నూతనంగా ఏర్పాటు చేసింది. లేదా ఇదివరకు ఉన్న వాటిని హెచ్చుగా పెంపు చేసింది. ప్రస్తుతం కమ్యూనిష్టు పార్టీ కేంద్రకమిటీ ఒక సామాజిక శాస్త్ర విద్యాలయాన్ని, పార్టీకి సంబంధించిన విషయాలలో ఉన్నతవిద్యను గరపే పాఠశాల నొకదానిని స్వయంగా నిర్వహిస్తోంది. అంతేగాక వివిధ పార్టీ అధీన సంఘాల అజ్మాయిషీ క్రింద ఎన్నో ప్రాంతీయ, స్థానిక పాఠశాలలు నడుపబడుతున్నాయి. 1946—47 సంవత్సరాలలో పార్టీ యంత్రాంగం అజ్మాయిషీ క్రింద 112,000 మంది "ప్రచారకులు" వుండేవారు. 1949-వ సంవత్సరం నాటికి వారి సంఖ్య 250,000 లకు పెరిగింది. ఇంకొక 80,000 ల

మంది తర్ఫీదు పొందుతున్నారు. లెనిన్‌గ్రాడ్ పార్టీ సభ్యులలో 170,000 మంది, అనగా దాని సభ్యుల మొత్తం సంఖ్యలో దాదాపు నూటికి ఎనుబది అయిదు మంది, మార్క్సిజమ్—లెనినిజమ్‌ను పాఠశాలలోను, పఠన వర్గాలలోను, లేక వ్యక్తిగతంగాను పఠిస్తున్నారని, 15,000 మంది కమ్యూనిష్టులు ప్రతినిత్యం విడువక ఉపన్యాసాలకు హాజరవుతున్నారని, స్వగృహాలలో గాని, పఠన మందిరాలలో గాని చదువుకొనుచున్న కార్మికులకు 7,000 మంది సలహాదార్లు ఉత్సాహంతో సహాయపడుతున్నారని ప్రచారశాఖ ముఖ్యాధికారి తెలియజేశాడు.

1949-50 సంవత్సరాలలో యూక్రెన్‌లో 9,984 రాజకీయ పాఠశాలలు, లెనిన్, స్టాలిన్‌ల జీవిత చరిత్రలు చదువుతున్న 14,860 జట్లు, స్టాలిన్ రచించిన కమ్యూనిష్టు పార్టీ చరిత్ర చదువుతున్న 23,396 జట్లు, 978, "పార్టీ రాత్రి పాఠశాలలు" యూక్రెన్‌లోని పెద్ద పట్టణాలలో మార్క్సిజమ్-లెనినిజమ్ బోధనకుగాను ఉద్దేశింపబడిన 19 "రాత్రి విశ్వవిద్యాలయాలు"; 40,000 మందికి పైగా అధ్యాపకులు పనిచేస్తున్న 6,000 లకు మించి ప్రత్యేక పాఠశాలలు, 1948-వ సంవత్సరంలో పనిచేస్తున్నాయి; 86,000ల సంపూర్ణ ఉపన్యాసాలు ఇవ్వబడ్డాయి. పార్టీ సభ్యులలో నూటికి తొంభై ఆరు మంది పై విద్యా సంస్థలలో విద్యాభ్యాసం చేస్తున్నారు. 3,200,000ల జనాభా మాత్రమే గల అజెర్ బైజాన్ ప్రజా స్వామిక రాష్ట్రంలో పార్టీ సంస్థలు 16,000 ల ఉపన్యా

సాలను ఏర్పాటు చేశాయి. ఇంకను పూర్తిగా విలీనం చేసు కొనబడని బాల్టిక్ ప్రజా స్వామిక రాష్ట్రాలలో కమ్యూనిష్టు సిద్ధాంతోపదేశ కార్యకలాపాలు పెద్ద ఎత్తున జరుపబడు తున్నాయి. లిటిల్ లిథూనియాలో 1949-వ సంవత్స రంలో 2,915 పురుషులు, స్త్రీలు కమ్యూనిష్టు రాత్రి విద్యాల యాలలో చదువుతున్నారనేది దానికి ఉదాహరణ.

ఈ విధమైన ముఖ్యవివరాలు సోవియట్ వార్తా పత్రి కలలో వరుసగా ప్రచురింపబడతాయి. సిద్ధాంత బోధకు, విలీనీకరణకు బ్రహ్మాండమైన ప్రయత్నం జరుపబడుతోందనే భావాన్ని ఆ వివరాలు వ్యక్తం చేస్తాయి. అట్టి విశ్వప్రయ త్నాన్ని పోలినది గత చరిత్రలో కనుపడదు—యుద్ధానికి ముందు సోవియట్ యూనియన్‌లోగాని, లేక హిట్లర్ జర్మనీలో నాజీ ముఖ్యుల విద్యాభ్యాసానికిగాను పెద్ద ఎత్తున అమలు పరచిన కార్యక్రమంగాని దానితో సరితూగవు.

ఆ విద్యాబోధన విధానం యొక్క లక్ష్యాలు రెండు. స్టాలిన్ నిర్వచనాలకు అనుగుణంగా కమ్యూనిజంను వ్యాఖ్యానించి, వ్యాప్తిచేయటం, సభ్యుల హృదయాలలో పార్టీ నాయకత్వం పట్ల అచంచల విశ్వాసాన్ని, కలుగ జేయుడం మొదటిది; తమ విధుల, ముఖ్యంగా ఆర్థిక రంగంలో, ప్రాముఖ్యతను గుర్తించగల సమర్థులు, మేధా వులు అయిన ఉద్యోగులను తర్ఫీదు చేయడం రెండవది. అధికోత్పత్తి సాధనకు రాజకీయ "చైతన్యం" కీలకమని, శ్రేష్ఠులైన కమ్యూనిష్టులను తర్ఫీదు చేయడమంటే ఆర్థికంగా పురోభివృద్ధిని సాధించడమనే ఎంచబడింది. ఆ విధంగా

విద్య. అధికతర ప్రభు భక్తిని, కార్యాచరణ అభిలాషను జనింప చేస్తుందని ఆశింపబడింది.

అయినప్పటికి యువక సభ్యుని మనస్సును కమ్యూనిజంలో ప్రగాఢ విశ్వాసంతోను, పాశ్చాత్య ప్రపంచం పట్ల విద్వేషంతోను నింపివేసే ప్రయత్నంలో విశేషవిజయం సాధింప బడలేదు.

పార్టీ అధికార పత్రిక బోల్ష్విక్ సూటిగా తెలియ జేసినట్లు ఆ విధాన లక్ష్యం ఇది:—"సోవియట్ సమాఖ్య యొక్క, దాని అధీనదేశాలయొక్క ఆర్థిక, సాంస్కృతిక అభ్యున్నతస్థితిని ధనికవాద దేశాల ఆర్థిక, సాంస్కృతిక పత నావస్థతో పోల్చి వ్యత్యాసాన్ని తెలియజేయడం; ఆంగ్లో—అమెరికన్ యుద్ధోన్మాదులు యుద్ధకాంక్షతో అమలు పరుప దలచిన దోపిడీ పథకాల ఆంతర్యాన్ని ఉద్రేక, ఆగ్రహాలతో వెల్లడిచేయడం, సోవియట్ పౌరుల జాగరూకతను అభివృద్ధి పరచడం, తమ ఉత్కృష్ట సామ్యవాద పితృదేశాన్ని చూచి గర్వపడవలెనని వారికి బోధించడం".

ఆ సిద్ధాంత ప్రబోధ ఉద్యమంపట్ల పార్టీ సభ్యులు ఎట్టి వాస్తవిక శ్రద్ధచూపుటలేదు. విధేయులు విశేషంగా కృషి సల్పేవారు అయినప్పటికి అది ఒక ఉద్యోగిగాని, కార్మికుడు గాని భరించలేనంత బాధ్యతగల భారమని వారు భావిస్తారు. పార్టీ దాని ఆజ్ఞలను సభ్యులు తప్పక పాటించునట్లు బలవంత పెట్ట గలిగిందే గాని, వారిలో ఉత్సాహాన్ని కలుగజేయ లేకపోయింది. పార్టీ పాఠశాలలోని "తక్కువ హాజరులు"

గురించి ప్రవదా పలుమార్లు ఫిర్యాదు చేసింది. "వ్యక్తిగత పఠన"కు సంబంధించినంతవరకు: "మార్క్సిజమ్—లెనినిజమ్" మూలసిద్ధాంతాలను వ్యక్తులకు విడివిడిగా బోధించ అంగీకరించి అనుమతి పొందిన కొందరు కామ్రేడ్లు సల్పిన కృషి అత్యల్పం; అంతేగాక విశేష అర్హతలు గలిగి సమర్థులైన ఉపాధ్యాయులుకూడా సిద్ధాంతబోధన విద్యార్థులవలెనే భారమైనదిగా భావిస్తున్నారు. ఉపన్యాస, బోధనా విధులను వారు సరిగా పాటించడంలేదు. తత్ఫలితంగా కమ్యూనిజం అనగా ఏమో సరిగా తెలియని క్రొత్త నమూనా కమ్యూనిష్టు లక్షలాది సంఖ్యలో తయారవుతున్నాడు. ఆతడు సోవియట్ సామాన్య పౌరునికన్న విద్యావంతుడు; యువకుడు; శక్తిసంపన్నుడు; ఆశాపూరితమైన హృదయం కలవాడు; అధికారులపట్ల వినయ విధేయతలు ప్రదర్శించు వాడు; కాని కమ్యూనిష్టు సిద్ధాంతాలయొక్క ముఖ్య సూత్రాలపట్ల, కార్యాచరణ విధానాలపట్ల ఉత్సాహంలేని వాడు. తన తండ్రి తరచు ప్రార్థనశ్లోకాలను వాటి అర్థం తెలుసుకోకుండా జపించినట్లే ఆతడు "మార్క్సిజమ్ — లెనినిజమ్" మూలసిద్ధాంతాలను యంత్రంవలె వల్లెవేస్తాడు.

ప్రస్తుతం రష్యాలో కొనసాగింప బడుతున్న పాశ్చాత్య వ్యతిరేక ఉద్యమానికి నవకమ్యూనిష్టులు అనుకూలురు కాదు. ఈనాడుకూడా గత శతాబ్దంలోవలెనే సోవియట్ ప్రజలు తాము ఇతర నాగరిక జాతులవారికన్న లొజ్జు అని భావిస్తున్నారు. ఆ భావం దేశవ్యాప్తంగా విస్తరించి వుంది. వాస్తవానికి అది యుద్ధకాలంలోనే విశేషప్రాముఖ్యతకు

ఆ రోజులలో లక్షలాది రష్యన్ పౌరులు, పార్టీ నూతన సభ్యులలో అధిక భాగం వారితో సహా, "పాశ్చాత్య ప్రపంచాన్ని" —(ఆ దేశాలలోని రైతాంగంయొక్క స్థితిగతులు, జీవనవ్యయ ప్రమాణాలు, కార్మికులకు కల్పించబడిన గృహావసతి సౌకర్యాలు, ప్రజానీకంయొక్క ఆరోగ్య రక్షణకు గాను చేయబడిన చక్కటి ఏర్పాట్లు) ఒక్క మాటలో చెప్పాలంటే పాశ్చాత్య "సంస్కృతి"ని కళ్లారాచూచారు. విప్లవం తరువాతనుంచి రష్యాలో 'సంస్కృతి' అనే పదం క్రొత్త అర్థమును స్ఫురింపజేస్తోంది. ప్రస్తుతం "సంస్కృతి" అంటే సత్ప్రవర్తన, మర్యాద, పరిశుభ్రత అని అర్థము. మాస్కోలోను ఇతర నగరాలలోను సంస్కృతి నిమిత్తం, విశ్రాంతి నిమిత్తం పార్కులు ఉన్నాయి. నేలమీద ఉమ్మి వేయడం సంస్కృతి లేమిని సూచిస్తుంది. కిటికీ తెర సంస్కృతికి ఒక చిహ్నం. ఇట్టి సంస్కృతికి పాశ్చాత్య దేశాలకు అవినాభావ సంబంధం ఉన్నదని రష్యన్ ప్రజా బాహుళ్యం విశ్వసిస్తారు. రష్యాలో జరిగే ఏ సాంస్కృతిక చర్చలోనైనను పాశ్చాత్య దేశాలు, గూఢ భావంతో మాత్రమే అయినప్పటికి — సర్వదా ఉదహరింపబడుతూ వుంటాయి.

"పాశ్చాత్య ప్రపంచానికి పాదాక్రాంతులు కావడం" అనే దానిని నిషేధిస్తూ సోవియట్ ప్రభుత్వం జారీచేసే శాసనాలు, ఉత్తరువులు, వార్తా పత్రికలు చదివే ప్రతి సామాన్య అమెరికను పౌరునకు సుపరిచితమే.

కాని ఆశ్చర్యమైనంత చతురతతోను, నిర్దయతోను సోవియట్ అధికారులు నిర్వహించే ఆ ఉద్యమం కొద్ది మాత్రపు ఫలితాలనే ఇవ్వగలిగింది, అన్న విషయం ఆతనికి సాధారణంగా తెలియదు. ద్వితీయ ప్రపంచ సంగ్రామం సంభవించేముందు జర్మనీలో నాజీలు సాగించిన ఉద్యమంకన్న ప్రస్తుతం రష్యా జరుపుతున్న విద్వేష ప్రచారం ఎన్నో రెట్లు ఉధృతంగా ఉంది. దానిని ఆస్థాయిని కొనసాగించడం సోవియట్ ప్రభుత్వం దృష్టిలో అవసరం. ముఖ్యంగా ప్రజా బాహుళ్యం అమెరికన్ వ్యతిరేక ప్రచారంపట్ల చూపే ఉదాసీనతను ఎదుర్కొనవలసి రావడమే అందుకు కారణం.

కమ్యూనిజమ్‌కు వ్యతిరేకంగా సలిపే పోరాటంలో మాజీ—కమ్యూనిస్టు ప్రముఖ పాత్రవహిస్తాడు. అందుచేత అతని అనుభవాలపట్ల అభిప్రాయాలపట్ల విశేషమైన శ్రద్ధ చూపవలసిన అవసరం ఎంతైనా వుంది. ఆ యేటికాయేడు వాఙ్మయంలోను, రాజకీయాలలోను "మాజీ" ప్రస్తావన విస్తారంగా వినవస్తూంది. ఆ కారణంవల్ల ప్రజాబాహుళ్యంతో ఆతని పరిచయం నానాటికి అధికమౌతూంది.

మాజీ—కమ్యూనిస్టుకు, రాజకీయ విశ్వాసాలను మార్చుకొన్న ఏ ఇతర రాజకీయ వాదికి మధ్యగల వ్యత్యాసం ఆశ్చర్యకరంగా ఉంటుంది. రిపబ్లికన్లు డెమోక్రాట్‌లుగాను, డెమోక్రాట్‌లు రిపబ్లికన్లుగాను మారుతారు. కాని ఈ పరివర్తనలతో బాటు వారి సాంఘిక వ్యక్తిగత జీవితాలలో

పెద్ద సంచలనంగాని, ఆకస్మికమైన మార్పులుగాని సంభవించడం అరుదు. రాజకీయ జీవితాలపై భ్రమతొలగిపోయిన, లేదా విసుగుచెందిన పత్రికా సంపాదకులు, శాసన సభ్యులు ఏదో ఒక ఆగంతక అభిమాన వృత్తిని వదలి వేస్తున్నట్లుగా రాజకీయరంగాలనుంచి చడీచప్పుడు లేకుండా మెల్లగా తప్పుకుంటారు.

కమ్యూనిష్టు మహారథానికి బంధింపబడిన వారు విముక్తి పొందడమనేది అంత సులువైన పనికాదు. అది తరచు— నైరాశ్యం, తీవ్రమనో వికారాలవల్లకలిగే వ్యక్తిగత విపత్తులతో జతపడి వుంటుంది. ఆతని పూర్వ జీవితానికి, ప్రస్తుత జీవితానికి మధ్య తీవ్రవ్యత్యాసం కనిపిస్తుంది. పార్టీనుంచి విడివడిన తరువాత మాజీ కమ్యూనిష్టు తన మామూలు ఉద్యోగానికి తిరిగిపోడు. ఆతడు విశ్రమించనూ లేడు. పార్టీకి ప్రబల శత్రువుగా మారిపోతాడు.

వ్యక్తిగత లాభాపేక్షకు లొంగని— అధమం కమ్యూనిష్టేతర పాశ్చాత్యదేశాలలో-నైతిక, రాజకీయ, సామాజిక భావప్రేరణల ఫలితంగానే ఆతడు మొట్టమొదట పార్టీలోచేర నిశ్చయించుకొని ఉంటాడు. సాధారణంగా పార్టీలో ఆతడు విశేష ఆదాయం వచ్చే హోదాకలవాడై ఉండడు. అందువల్ల అధికారాదాయంచేత చెడిపోయే అవకాశం ఆతనికి లేదు. వేరొక రాజకీయ పక్షంలో సమర్థుడైన సభ్యుడుగా ఆతడు గడుపగలిగి ఉండే జీవితవృత్తి, కమ్యూనిష్టు అయినందువల్ల ఆతని అందుబాటులో ఉండదు. క్రూరపోరాటాలలోను, విప్లవ కార్యకలాపాలలోను పాల్గొనడం, ఏదో

విదేశ ప్రభుత్వానికిగాను పనిచేయవలసి ఉండడం మాత్రమే ఆతనివంతు.

త్యాగంచేయడమే తన కర్తవ్యంగా భావించి వెనుకటి కమ్యూనిష్టు చాలా కాలం కృషిసల్పాడు. పార్టీ సభ్యుడుగా పార్టీ కొరకు తన ప్రత్యేక సామర్థ్యాలను, కాలాన్ని వినియోగించాడు; పార్టీ సమావేశాలకు, పఠనవర్గాలకు, పాఠశాలలకు ఆతడు తప్పనిసరిగా హాజరయ్యాడు. వాటిలోనే స్టాలినిజమ్‌యొక్క కృత్రిమ సిద్ధాంత వాదాన్ని ఆతడు అలవర్చుకున్నాడు. పార్టీ పత్రికలను చదవడం విధిగా భావించాడు. అట్టి క్రమశిక్షణకు కట్టుబడి కొంతకాలం గడిపిన తరువాత నూతన సభ్యులు కొందరకు నాయకత్వం వహించి, వారికి పార్టీ సిద్ధాంతబోధ చేయుటకుగాను ఆతడు నియుక్తుడవుతాడు. పార్టీలో చేరినదాదిగా ఆతడు పాటించవలసిన విధులు, చేయవలసిన పనులు చూచి విస్తుపోతాడు. కమ్యూనిష్టు కార్యకలాపాలలో పాల్గొనడం నిరంతర మానసిక, నైతిక వ్యథతో కూడుకొని ఉన్నదని గుర్తిస్తాడు. యుద్ధరంగంలో పాటించవలసిన నీతి కమ్యూనిష్టు పార్టీ నీతి కావడమే ఇందుకు కారణం; కమ్యూనిష్టు పార్టీ నీతినియమాల ప్రకారం అన్ని మార్గాలు మంచిచెడ్డల ప్రసక్తిలేకుండా న్యాయమైనవే. మోసపుచ్చడం, అసత్యం పల్కడం సత్యాన్ని మరుగుపరచడం ఆతనికి నిత్యకృత్యా లవుతాయి. యుద్ధరంగంలో జరిగే సైనిక పోరాటాలకు ఒక కాలపరిమితి అంటూ ఉంటుంది. కాని సహృదయుడైన పార్టీ సభ్యుని మానసిక రంగంలో సాగుతూవుండే పోరాటం ఏండ్ల తరబడి,

దశాబ్దాల తరబడి కొనసాగుతూనే ఉంటుంది. పార్టీ ఎత్తు గడలకే తన కాలాన్నంతా నిత్యం వినియోగించుతాడు. అసత్యం పల్కడమనే ఘోరమనోవ్యాధితో పీడింపబడుతూ వుంటాడు. యుద్ధరంగపు ఒత్తిడివలన తత్కాలికంగా సహించుకొనగలిగిన విపరీత స్థితి సంతత మానసికావస్థగా మారడంవల్ల విసిగి, వేసారి, సహనాన్ని కోల్పోతాడు. దౌర్జన్య విధానం, బానిసత్వం రష్యాలో కానరావని, వాస్తవానికి రష్యన్ కార్మికులస్థితి దుర్భరంగా వున్నప్పటికీ ఆదేశం శ్రమజీవుల భూతలస్వర్గమని రష్యా అధికారులు చిత్రించడం ముఖ్యంగా సహృదయులైన ఎంతో మంది కమ్యూనిష్టులను విశేష మనోవ్యథకు గురిచేసాయి.

పార్టీనుంచి విడివడడం సంభవించినపుడు, ఆతనిలో ఇమిడివున్న పటుత్వం, మూర్ఖపుపట్టుదల, విద్వేషం, సాంఘీక చైతన్యం, జీవితం అభ్యుదయపథాన్ని అందుకొనవలెననే ఆకాంక్ష, వట్టిగా తడి ఆరిపోవు వెనుకకు మరలుతున్న మహా యంత్రంవలె అవి సంతతం పనిచేస్తూనే వుంటాయి. తీవ్ర "అనుకూలవాది" తీవ్ర ప్రతికూలవాదిగా మారుతాడు. ఆతని హృదయంలోని ఒడబాలనం చల్లబడి, ఘనీభవించి హిమం అవుతుంది; ధనం రుణంగా మారుతుంది; కాని శుద్ధశూన్యం మాత్రం ఎన్నడూకాదు. రష్యాను, కమ్యూనిజమ్‌ను ఆతడు ఒకసారిగా మరచిపోలేడు. కాని వాటిని ఉపేక్షచేయనూ లేడు.

రష్యా, పాశ్చాత్య దేశాలలోని కమ్యూనిజం మానసిక, సిద్ధాంత రంగాలలో విచ్ఛిన్నంకావడం అనేది ప్రస్తుతం

ప్రాముఖ్యతకు వచ్చింది. ఈ శతాబ్ది మధ్యకాలం నాటికి కమ్యూనిష్టు సిద్ధాంతం బాగా వ్యాప్తిలోనికివచ్చింది. దాని అనుచరవర్గం సంఖ్య పెరిగింది. వారి మనో, హృదయాల లోనికి అది గాఢంగా చొచ్చుకుపోయింది. ఈనాటి దాని ధోరణికి ఇతర రాజకీయ సిద్ధాంతాలద్వారా అపజయం సంభవించడమనేది అంతకంతకు అసంభవం. ఆ అపజయం కమ్యూనిష్టు సిద్ధాంతవాదుల ద్వారానే సంభవింపవచ్చు. ముందుగా పార్టీలో కలతలుపుట్టి ప్రముఖ వ్యక్తులు, కొన్ని మతాలకు మతాలే తిరుగబడవచ్చు. కేవలం స్టాలిన్ వాదాన్ని, దాని పూర్వ అనుచరులు త్రోసి రాజనవచ్చు కూడా. ఇట్టి ధోరణులు కమ్యూనిష్టు పార్టీలో వుద్భవించా యనటానికి నిదర్శనాలెన్నో వున్నాయి. అవి యింకా శైశవావస్థలోనే వున్నప్పటికి త్వరితాభివృద్ధిని పొంది, వాటి నిజస్వరూపాన్ని ఘనపరిమాణంలో యావత్ ప్రపం చానికి అచిరకాలంలోనే వెల్లడించడం నిస్సందేహం.

## అక్రమ వ్యాపార సరళి

సోవియట్ జాతీయాభివృద్ధి ప్రణాళికల నిర్వహణకు సంబంధించిన అద్భుత కార్యక్రమం, నిలుకడగా, క్రమం తప్పక, దానంతటది పనిచేసే గడియారంవలె నిరాఘాటంగా కొనసాగుతూంది. అడవులతో నిండివున్న ఫిన్లండ్ దేశపు సరిహద్దులనుంచి మంచూరియా మంటిదిబ్బలవరకు విస్తరించి వున్న సోవియట్ యూనియన్ ఆర్థిక వ్యవస్థ మీాటలు

నొక్కితే నడచే (నొక్కుడు మీటలచే నడుపబడే) బ్రహ్మాండమైన యంత్రంవలె పనిచేస్తుంది. ఆదివారం మినహా ప్రతి రోజు ఉదయం ఎనిమిది గంటలకు అసంఖ్యాకంగా వున్న చిన్న చక్రాలు, మీటలు, కప్పీలు మొదలైనవి పనిచేయడం ప్రారంభిస్తాయి. సాయంత్రం అయిదు, ఆరుగంటల వేళకు నిర్ణీతపథకాల ప్రకారం సోవియట్ రష్యా ప్రజలు ఎన్నో వందలకోట్ల రూబుల్లు విలువచేసే వస్తువులను, సాధన సామగ్రిని దేశంలోని ఇరువై కోట్ల ప్రజానీకానికి పంచి యిచ్చేందుకుగాను, వుత్పత్తి చేస్తారు.

వాస్తవానికి ఆ కృషికి విశేష ప్రాముఖ్యత ఇచ్చి "పథకం" అని పెద్దగా వర్ణక్రమం చెప్పవలసి వుంది.

ఈ గంభీర్య బాహ్యప్రదర్శనకు వెనుక విస్తారంగా అక్రమ వ్యాపారం సాగుతూంది. ప్రభుత్వంవారు నిర్ణయించిన ధరలతో ఎట్టి నిమిత్తంలేకుండా, వారివారి ఇష్టానుసారం వెలలు చెల్లించి క్రయవిక్రయాలు స్వేచ్ఛగా జరుపుకునే అరాచక వర్తక విధానాన్ని స్వలాభాపేక్షతో రహస్యంగా కొనసాగించే కుట్రదారులు లక్షలాది ప్రజలే. అయినప్పటికి దానిని గురించిన వ్యాఖ్యాలుగాని, విమర్శలుగాని చేయబడవు. మంచికి ప్రక్కన చెడుగు, అందం తరువాత వికృతరూపం, ధర్మం ప్రక్కన అధర్మం వున్నటుల ఆ గంభీరమైన జాతీయాభివృద్ధి ప్రణాళికలకు ప్రక్కనే ఆర్థిక క్లేశాలతో కూడుకొనివున్న అరాచక ఆర్థిక విధానం అమలులో వుంది. జాతీయాభివృద్ధి ప్రణాళికల కృషి, అక్రమ,

అరాచక ఆర్థిక విధానం పరస్పరానుబంధ వ్యవస్థలుగా ఒక దాని లోటుపాట్లను ఇంకొకటి సవరించుకొంటూ కొనసాగు తున్నాయి. కేవల ధనికవాదం కుంటివానికి చంక కఱ్ఱల వలె కమ్యూనిజము నిలబడడానికి ఊతలు కలుగజేస్తూంది. హద్దుపద్దూలేని ఆ అక్రమ వ్యాపారాన్ని రష్యన్ గ్రామీణ భాషలో "బ్లాట్" అని పిలుస్తారు.

వంచనతో కూడుకొని వున్న ఆ అక్రమ ఆర్థిక వ్యవస్థ ఎంత విస్తృతంగా వున్నదో అనే విషయమే కలవరపరచేదిగా వుంది. రష్యాదేశం ఎంత విస్తీర్ణంకల దేశమో అంత విస్తారంగాను వ్యాపించి వున్నది, ఆ అక్రమ ఆర్థిక వ్యవస్థ. దాని ఉనికి అధికారులకు బాగుగా తెలిసి వున్నప్పటికి దేశ కాల పరిస్థితులకు అనుగుణ్యమను భావనతోనే గత్యంతరం లేక దానిని వారు సహిస్తున్నారు.

"బ్లాట్" యుద్ధానంతర కాలంలో వచ్చిన నూతన పరిణామం కాదు. సోవియట్ విధానం ప్రారంభమైన నాటినుంచి వున్నదే అది. కాని దీని విషయంలో ప్రభుత్వ వైఖరి చంచలమైనదిగాను, పరస్పర విరుద్ధ భావాలతో కూడుకున్నదిగాను వున్నది.

కొంతకాలం దొంగ మార్కెటు వ్యాపారం లంచగొండి తనం కఠినంగా అణచివేయబడ్డాయి. ఆ నేరాలకు మరణ శిక్ష విధింపబడుతుందని శాసనాలు చేయబడ్డాయి. వాస్త వానికి ఎంతో మంది నేరస్థులు, స్వల్పంగా నేరంచేసిన కొందరితో సహా, అక్రమ వ్యాపారాన్ని కొనసాగించి

నందుకు, అక్రమ "బహుమానం" స్వీకరించి నందుకు ప్రాణాలు కోల్పోవలసి వచ్చింది. తరువాత కొంతకాలం వ్యాపార నియమాలు సడలింపబడి వ్యక్తి నిర్వాహిత వ్యాపారం (1920—1930 సంవత్సరాల మధ్య NEP వలె) సహించబడడమే కాకుండా ప్రోత్సహింపబడింది. ఆ అవకాశం తీసుకొని సక్రమధన సంపాదన పేక్షతో, అనేకమంది ప్రభుత్వోద్యోగులు NEP వారితో కలసిమెలసి పనిచేశారు. కాని విధానంలో మరల మార్పు వచ్చింది. పెట్టుబడి దారీ విధానాన్ని నిందించడం తిరిగి ప్రారంభమైంది. వ్యక్తి నిర్వాహిత వ్యాపారాన్ని నిషేధిస్తూ, దానిని ఉల్లంఘించిన వారిపై కఠినశిక్షలు విధించే నియమాలు తిరిగి ప్రవేశపెట్టబడ్డాయి. తుదకు 1935 దరిదాపులనుంచి, ఒక నూతన విధానం రూపొందింది. వ్యాపారం ప్రభుత్వపరంగానే జరుగవలెననే ఖచ్చితమైన నియమాలతో బాటు, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలోని రైతాంగం పరిమితంగా స్వేచ్ఛా వ్యాపారం చేసుకునే సదుపాయం కలుగజేయబడింది. వాస్తవానికి సోవియట్ ఆర్థిక వ్యవస్థయొక్క ఈ రెండు ప్రకృతులకు అనుబంధంగా "బ్లాట్" — అక్రమ ఆర్థిక కార్యకలాప రంగం — దినదినాభివృద్ధి పొందుతోంది. కాని మొదటి రెండు ప్రకృతులకు సంబంధించిన విషయాలే విస్తారంగా ప్రచారంలో వున్నాయి. వాటిని గురించి స్వదేశంలోను, విదేశాలలోను అందరకు తెలిసినదే. మూడవదైన "బ్లాట్" సోవియట్ పౌరుని నిత్య జీవితంలో బ్రహ్మాండమైన పాత్ర నిర్వహిస్తున్నప్పటికి దాని ప్రాధాన్యత

గుర్తింప బడకుండుటకుగాను అందుకు సంబంధించిన విష యాలు పత్రికల అందుబాటులో లేకుండా చేయబడుతుంది.

ఎన్నో వ్యక్తిగత కథనాలనుంచి సేకరింపబడిన విష యాలు, వివరాలు, సోవియట్ రష్యాలోని అక్రమ వ్యాపార కార్యకలాపాలకు మచ్చుతునకల వంటివి, దిగువ ఉదహరింప బడ్డాయి.

బైలో రష్యా అంతర్వ్యాపారాశాఖ ఉద్యోగి యకోవ్ కరాస్ ఆతని వ్యాపార సంస్థకుగాను అధికంగా దుప్పట్లను తీసుకొనివచ్చే నిమిత్తం గ్రోడ్నోనుంచి బియాలిస్టాక్‌కు పంపబడ్డాడు. బియాలిస్టాక్‌లోని వస్త్రముల అంగడి మేనేజరు కరాస్ అధికార పత్రాలు చూచి "మీకు కావలసిన వాటిలో నూటికి ముప్పై అయిదు వంతున నాకు వదిలి నట్లైతే మీకు దుప్పట్లు ఇవ్వగలను. అయితే మీరు మొత్తం ఖరీదుకే రశీదు ఇవ్వాలి" అని చెప్పాడు.

తన కథను సవివరంగా నాకు తెల్పిన కరాస్, యువకుడు, అనుభవంలేని నిఖార్సు మనిషి. మానేజరు విపరీత కోరికలో ఇమిడి వున్న దొంగతనం, మోసం దోపిడీలు ఆతనిని ఉద్రిక్త పరిచాయి. నిర్మొగమాటంగా మేనేజరును నిందించాడు. కాని మేనేజరు తొణకలేదు, బెణకలేదు. మామూలు ధోరణిలోనే "దుప్పట్లు కావలసినది. అక్కర లేనిది నిర్ణయించుకోవలసినది మీరు; మీకు తోచినట్లు చేయవచ్చు" అని చల్లగా తెలియజేశాడు. యకోవ్ అగ్రహావేశ పరవశుడైనాడు. ఆ నగరంలోనే నివసిస్తున్న

చిరకాల మిత్రు లిద్దరిని చూడబోయాడు. "రాత్రిపూటల చలి ఎముకలు కొరుక్కు తింటోంది. హాస్పిటల్సులో దుప్పట్లు లేక రోగులు యాతన పడుతున్నారు. మా కోటా దుప్పట్లలో వాటా కోరుతున్నాడు. బందిపోటు మేనేజర్; ఇది ఎంత దారుణమో ఊహించండి. ఆతని గురించి M.V.D. వారికి తెలియజేస్తాను. "ఏండ్ల తరబడి కఠినవరకం అనుభవిస్తాడు". అని ఉద్రిక్తుడై తెలియజేశాడు.

"ఆ పని మాత్రం చేయవద్దు, మేనేజర్ ఈ విషయా లేవీ తాను చెప్పలేదంటాడు. ఆతని కుతంత్రాన్ని నిరూపించుటకు నీకు సాక్ష్యులు దొరకరు, అసలు అభియోగం ఆరంభమయ్యేసరికే ఎన్నో వారాలు పడుతుంది. ఆతను చెప్పినదానికి ఒప్పుకొని మిగిలిన వాటినే తీసుకో," అని సాషాకు స్నేహితులు సలహా ఇచ్చారు.

ఆవేశాన్ని అణచుకొని విచారగ్రస్తుడై కారన్ అంగడికి తిరిగి వెళ్లాడు. "మా అక్కౌంటెంటుకు ఏమని సద్ది చెప్పను అని మాత్రమే మేనేజరును అడిగాడు. "ఆరాటపడవద్దు; ఆ విషయమై అక్కౌంటెంటు శ్రద్ధ తీసుకుంటాడు." అని మేనేజర్ సమాధానమిచ్చాడు. కారన్‌కు అదంతా ఏదో గూడు పుఠాణీగా ధ్వనించింది. నికరంగా వచ్చిన దుప్పట్లను తీసుకొని ఆతడు గ్రాడ్నోలో చేరుకున్నాడు. ఆఫీసుకి వెళ్లి జరిగినదంతా చెప్పటానికి వచ్చి వెలక్కాయ గొంతుకకు అడ్డుపడ్డంత పనైంది, ఆతనికి. కాని అక్కౌంటెంటు ఎంత మాత్రం ఆశ్చర్యపడలేదు. కోపగించలేదు. ఆశాభంగం పొందలేదు కూడా. అంతా బాగానే ఉంది, "తెచ్చిన

దుప్పట్లలో నేను నూటికి పదివంతులు తీసుకొంటాను, మిగిలినవాటిని నీవు అంగడికి ఇవ్వవచ్చు". అని చెప్పాడు. అప్పటికే అసలు రావలసిన సరకులో మూడవ వంతు నష్టానికి బాధ్యుడగుటచేత, అక్కౌంటెంట్ వాటా తీసుకోవడంపై కారస్ ఏలాంటి అభ్యంతరం తెలుపలేక పోయినాడు, వాదించలేక పోయినాడు కూడా. గత్యంతరం లేక మరి మాట్లాడకుండా అక్కౌంటెంటు అడిగిన దానికి అంగీకరించాడు. కథావిధాన గమనాన్నిబట్టి స్టోరు రూమ్ సూపరెంటెండెంటు కూడా ఆతని వాటా తీసుకుంటాడని మాత్రం కారస్ గ్రహించాడు.

ఆ బేరంతో సంబంధమున్న నలుగురిలోను అనుభవంలేని శుద్ధ బాదస్తుడు కరాస్ ఒక్కడే. ఇతరులు ఏండ్ల తరబడి అట్టి వ్యాపార కార్యకలాపాలు సాగిస్తూ మార్కెటుకు అన్ని రకముల వస్తువులు సప్లై చేస్తున్నారు. తమ మట్టుకు కొంత అదనపు ఆదాయాన్ని కూడా సంపాదించుకుంటున్నారు. ఆ విధంగా కాజేసిన సరుకులలో హెచ్చు భాగం ప్రభుత్వం వారు నిర్ణయించిన వెలలకన్న హెచ్చు ధరలకు రైనాక్ (దొంగ బజారు) అంగళ్లలో అమ్మబడుతుంది.

ప్రపంచంలోని ఇతర దేశాల పట్టణములలోని మామూలు మార్కెటు వంటిదికాదు. ఈ రైనాక్ బజారు. పెద్ద పట్టణాలలోని రైనాక్ అంగళ్లలో ఏవస్తువునైనా చూడ వచ్చు. కాని ప్రభుత్వంవారు నిర్వహిస్తున్న దుకాణాల లోని అలమరలు తరచుకాళీగానే ఉంటాయి. రైనాక్ మార్కెటులో జరిగే అక్రమ వ్యాపారం గురించి పోలీసు

లను తెలిసినప్పటికీ, అసాధారణ పరిస్థితులలో తప్ప దాని విషయంలో వారు జోక్యం కలుగ జేసుకోరు.

ముప్ఫైఏండ్ల క్రిందట, పెట్రోగ్రాడ్ విశ్వవిద్యాలయంలో విద్యార్థిగా ఉండిన మార్కు పోర్ట్‌నోయ్ నాకు తెలుసు. వీణవాయిద్యంలో ఆతనికి చక్కని ప్రవేశముంది. నెమ్మదస్తుడు. ఊహాగానాలు చేస్తూ ముందు ముందు ఉజ్వల భవిష్యత్తు ఉందని కలలుకంటూ ఉండేవాడు. హ్రాస్వనేత్ర దృష్టిని సరిచేసుకొనే నిమిత్తం దళసరి కళ్ల అద్దాలను ధరించేవాడు. భావకవి. తన చదువువల్ల ఉత్తరోత్తరా ఎట్టి ఉపయోగముంటుంది అనే దాన్ని గురించి స్పష్టమైన అభిప్రాయమేదీ లేకుండా న్యాయశాస్త్రం అభ్యసించేవాడు. ఈ ప్రపంచంలో ఉన్నట్లుగా కాకుండా, భూలోకానికి స్వర్గలోకానికి మధ్య తనకుతానై సృష్టించుకున్న ఏదో అగోచర లోకంలో ఉన్నట్లు ఉండేవాడు. ఏదో పరాకు సమయంలో వివాహం చేసుకున్నాడు అనుకుంటాను. ఇప్పుడు ఆతనికి ఇద్దరు కుమార్తెలని తెలిసింది. మార్కు యోగ్యుడు, నిజాయితీ మనిషి అని చెప్పడం నిజంగా ఆతనిని కొంచపరచడమే అవుతుంది. ఎంత ప్రయత్నించి నప్పటికి అక్రమంగా సంచరించజాలని ప్రకృతిగల వ్యక్తుల వర్గానికి చెందినవాడతడు.

విప్లవానంతరం కొద్ది సంవత్సరాలపాటు మా మధ్య ఉత్తర ప్రత్యుత్తరాలుగాని, రాకపోకలుగాని లేవు. రష్యన్ వార్తా పత్రికలలో ఆతని పేరు నే నెప్పుడూ చూడలేదు. ఆతడు ఒక రచయితగాని, వక్తగాని కాదు. ఆతనికి రాజ

కీయ అపేక్షలేపీ లేవుకూడా. ప్రొటోసీ ఏదో పెద్ద పట్టణంలో నివసిస్తున్నాడని, దుస్తులు తయారు చేసే పెద్ద మిల్లులో ఉపనిర్వహణాధికారిగా పనిచేస్తున్నాడని ఇటీవలనే యథాలాపంగా నాకు తెలియవచ్చింది. ప్రస్తుతం ఆతని వేతనం అంత తక్కువగా లేదని, అయినప్పటికి స్వేచ్ఛా వ్యాపారవృత్తి (దొంగ మార్కెట్టు) సాగించనిదే, ఆతనికీ, ఆతని కుటుంబానికి కావలసిన వస్తువులను సేకరించు కొనుటకు అది చాలదని నాకు తెలిసింది.

రష్యాలో, సిల్కు, నూలు వస్త్రాలు, దుస్తులకొరత హెచ్చుగా ఉంది. వస్త్రాలు సరఫరా చేయవలసినదని కోరుతూ ఎన్నో పట్టణాలనుంచి, రాష్ట్రాలనుంచి మార్కు పనిచేయుచున్న మిల్లుకు సర్వదా అభ్యర్థనలు వస్తూనే ఉంటాయి. వీలైనంత త్వరగా, ఎంత లభ్యమైతే అంత వస్త్రాన్ని కొనుటకు కొనుగోలుదార్లు మిల్లుకు వస్తూవుంటారు. ఏ బేరం హెచ్చు ఆకర్షణీయంగా ఉంటుంది, దేనివల్ల తక్కువ ప్రతిఫలం ముట్టుతుంది అనే విషయాలను జాగ్రత్తగా ఆలోచించి నిర్వహణాధికారి, ఆతని సహాయులు, అమ్మకాలు జరిపిస్తారు. అందువల్ల కొందరికి సరుకు దొరకకపోగా, మరి కొందరిపట్ల విశేష అభిమానం చూపబడుతూంది.

స్వాప్నికుడు మార్కుగురించి నాకు పై సమాచారం అందచేసినది సాషా గ్రోన్ స్కీ అనే ఆయన వారిద్దరకు ఆరేండ్లకు పైగా పరిచయముంది. సాషా పోలందు దేశస్థుడు 1940 వరకు భార్యతో బాటు లావ్ సమీపాన నివశించే వాడు. 1940 లో పోలెండు రష్యన్ ఆక్రమణ క్రిందకు

వచ్చినపుడు, సోవియట్ అధికారులు, రష్యాలో డాక్టర్లుగాను, ఇంజనీర్లుగాను, కార్మికులుగాను పనిచేసే నిమిత్తం పోల్ యువతీ యువకులను చేర్చుకొనేవారు. ఆ ఉద్యమంపట్ల పోలులు విశేష ఆదరం చూపలేదు. కాని సోవియట్ విధానం క్రింద సాధింపబడినవని చెప్పబడే గొప్ప విషయాల గురించి విని ఉండడంచేత రష్యాకు పోవటానికి సాషా అంగీకరించాడు. ఒక సోవియట్ ఆర్టెల్‌లో ఆతనికి కుట్టుపని ఉద్యోగం లభించింది. ప్రభుత్వంచే గుర్తింపబడి పంచవర్ష ప్రణాళికలో చేర్చబడిన కార్మిక సహకార సంఘం ఆర్టెల్. దానిలోని సభ్యులు పారిశ్రామిక సంస్థలలో పనిచేసే సామాన్య కార్మికులకన్న అధిక ఆధాయం సంపాదించకుండు టకుగాను, ఆర్టెల్ దానికి కావలసిన ముడిసరకులను ప్రభుత్వ వ్యాపారసంస్థలనుంచి సేకరించుకొని, తయారు చేసిన వస్తువులను ప్రభుత్వంవారు నిర్ణయించిన ధరలకు విక్రయించవలసి ఉన్నది.

మొట్టమొదట సాషాకేమీా గిట్టుబాటు కాలేదు. ఆతని వాటాకు వచ్చేలాభం, నెలకు కొన్ని వందల రూబుల్లకు మించెడిదికాదు. తోటివారికి వలె ఆతనికి కాయగూరలు పండించుకొనుటకు స్వంత తోటలేదు; ఆ ప్రాంతంలోని రైతులలో ఆతనికి బంధువులైన వారెవ్వరూ లేరు. సాషా అక్రమ బేరాలంటే అసహ్యించుకొనేవాడు. ఆతనికి తండ్రి మతభక్తి కలవాడు. పాతకాలపు నైతిక సూత్రాల వాతావరణంలో పెంచబడుటవలన సాషా న్యాయవిరుద్ధంగా ప్రవర్తించ నిరాకరించాడు. శాసనోల్లంఘనమంటే భయ

పడ్డాడు, తత్ఫలితంగా సాషా ఇంటిలో చాలినంత ఆహార పదార్థాలు ఏనాడూ లభ్యమయ్యేవికావు. తరుచు ఆ కుటుంబానికి తినుటకు మామూలు రొట్టెతప్ప ఇంకేమీ ఉండేదికాదు. ఒకరోజున ప్రక్కయింటి యజమాని సాషాను చూడవచ్చి తనకొక జతదుస్తులను తయారుచేసి యివ్వవలసినదని కోరాడు. ఆ పని రహస్యంగా చేయ వలసివుంది. ఆ దుస్తులను కుట్టుటకు అవసరమైనవాని కన్న ఒక గజం గుడ్డ అదనంగానే ఆతడు తెచ్చియిచ్చాడు. సాషాకు ఇవ్వవలసిన కుట్టుకూలికి ప్రత్యామ్నాయంగా వస్తు రూపంలో ఇచ్చుటకే అది ఉద్దేశింపబడింది. ఆర్టెల్ కార్ఖానాకు బయట స్వంతంగా పనిచేయడం, వస్తు రూపంలో కూలి తీసుకోవడం, రెండూకూడా చట్టవిరుద్ధమే. కాని ఆ పనివల్ల వచ్చే ప్రతిఫలం ఎంతో ఆశగొల్పేదిగా వుండుట చేత మొట్టమొదటిసారిగా సాషా ఆశకు లొంగిపోయాడు. త్వరగా బజారుకువెళ్లి గజం గుడ్డను విక్రయించి ధాన్యం, వెన్న, కొని తెచ్చాడు. ఆ ఒక్క తడవకు ఆతని కుటుంబం కడుపునిండా తిండితిన్నారు. బైబిల్ ప్రవచనం ప్రకారం ఆడమ్‌కు కనువిప్పు అగుటకు ఒక ఆపిల్ ఫలం కావలసి వచ్చింది. అలాగే వస్త్రమిచ్చి వస్తుతెచ్చుకొనడంవల్ల సాషా పొందిన ప్రథమ అనుభూతి తరువాత ఆతడు తనచుట్టుపట్ల వున్న ప్రపంచాన్ని వేరొక విధంగా చూడనారంభించాడు.

ఆర్టెల్ పురుషులు ధరించే చొక్కాలు (మిలిటరీ ఫాషన్‌వి, సాదారకంవి) తయారుచేస్తూ వుండేది. కాని చాలినంత వస్త్రం లేకపోవుటవల్ల సగంకాలం పని వుండెడిదే

కాదు. అదే గ్రామంలో వున్న మరొక ఆర్టెల్ ఎప్పుడూ పనిచేస్తూనే వుండేది. దాని సభ్యులు భాగ్యవంతులవు తున్నట్లుగా కూడా కనుపించేవారు. తన ఆర్టెల్ స్థితిగతు లకు, రెండవ ఆర్టెల్ స్థితిగతులకు మధ్యగల వ్యత్యాసానికి కారణమేమా అని సాషా ఆశ్చర్యపడేవాడు. యుద్ధ కాలంలో ఆర్టెల్ సభ్యులలో చాలా మంది సైన్యంలో చేరుటవల్ల సాషా దానికి అధ్యక్షుడుగా ఎన్నుకోబడినాడు. నాటినుంచి రెండవ ఆర్టెల్ అభివృద్ధి పొందుటకుగల హేతు వులను గురించి అన్వేషించాడు. నా పాత స్నేహితుడు మార్కో-పోర్ట్లో దక్షుత క్రింద వున్న వస్త్రాల మిల్లునుంచే ఆర్టెల్‌కు బట్టసరఫరా అవుతున్నట్లు తెలిసింది. మిల్లులోని సరుకు విడుదలకు తగిన ఏర్పాట్లుచేసే కంపినీ శాఖ వున్న తాధికారిని వెంటనే సాషా కలుసుకున్నాడు. వారి ప్రథమ సమావేశంలో వాతావరణం గురించి, యుద్ధం గురించి మాట్లాడుకున్నారు. రెండవతడవ వస్త్రాలు, వాటి వెలలు గురించి సంభాషించారు. వుభయులు కొద్దిగా పానీయాలు కూడా స్వీకరించారు. తన ఆర్టెల్ వస్త్రాల కొరతవల్ల సగం కాలం పనిలేక ఊరకనే వుండుటకు, రెండవ ఆర్టెల్‌కు చాలి నంత వస్త్రం లభ్యమగుటకు కారణమేమని కడకు సాషా ప్రశ్నించాడు. "ప్రభుత్వంవారు నిర్ణయించిన వెలకన్న మీటర్‌కు ఒక రూబుల్ చొప్పున అదనంగా ఇవ్వదలచి నట్లైతే మీరు 10,000 ల మీటర్ల వస్త్రం తీసుకొని వెళ్ల వచ్చు" అని కంపినీ శాఖాధికారి సమాధాన మిచ్చాడు.

ప్రభుత్వంవారు నిర్ణయించిన ధర మీటర్ ఒకటికి 85 కోపెక్‌లు; అయినా బ్లాక్ మార్కెట్‌లో అదే ముప్ఫై నుంచి నూరు రూబుళ్లవరకు విక్రయించబడేది. అందువల్ల నెలకు 10,000 రూబుళ్ళ చొప్పున అదనపు మొత్తాన్ని అక్రమంగా చెల్లించుటకు సాషా సమ్మతించాడు. అట్టి ఇతర ఖర్చులవలెనే వస్త్రాలకుగాను చెల్లించిన అదనపు మొత్తం ఆవర్జా పుస్తకములలో వ్రాయడంగాని సంభవించదు.

అదనంగా వస్త్రం లభ్యమవడంవల్ల సాషా ఆర్టెల్ పని చేయడం ప్రారంభించింది. అయినా బట్టకు ఇచ్చిన అదనపు వెలను ఏదో ఒక విధంగా రాబట్టుకొనవలసి వుంది. అంటే ఆర్టెల్ తయారుచేసే దుస్తులలో కొంత భాగం స్వేచ్ఛా వాణిజ్య రంగానికి తరలించవలెనన్న మాట. చొక్కాలను విక్రయించే మార్గాలు ఎన్నో వున్నాయి. ప్రభుత్వ యాజమాన్యాన్న నడుపబడే చిన్న దుకాణాలకు వాటిని విక్రయించడం అన్నిటికన్న శ్రేష్టమైన మార్గం. ఆ దుకాణాల వారు హెచ్చు వెలలకు దుస్తులను కొని, వాటిలో కొంత భాగాన్ని ప్రభుత్వం నిర్ణయించిన వెలలకు, బారులుతీరి పొడుగైన "క్యూ"లలోనే వున్న ప్రజలకు విక్రయిస్తారు. మిగిలినవాటిని, రష్యాలో ప్రజలు చెప్పుకొనే రీతిగా, "ఎడమ ప్రక్కకు" అమ్మివేస్తారు.

రైనాక్ అక్రమ బేరసారాలను జరిపే నిమిత్తం సాషా వెంటనే ఒక ప్రత్యేక ఏజంటును ఏర్పాటుచేశాడు. జాగ్రత్త గలవాడు, చురుకైనవాడు, నేర్పరి అగుటచే ఆ ప్రతినిధి

అధికారులతో ఎన్నడు తీవ్ర సంఘర్షణపడలేదు. అక్రమ వ్యాపారాన్ని కప్పిపుచ్చే నిమిత్తం సాషా అతనిని అంగడివద్ద "రాత్రి కాపలావానిగా" నియమించాడు. పగటిపూట దుకాణం చుట్టుపట్ల తచ్చాడినప్పటికి కాపలావాడగుటచే ఆతని నెవ్వరు అనుమానించరు. ఆర్టెల్ ఆవర్జాకు అందని అదనపు ఆదాయాలు ఎప్పటికప్పుడు "వాటాదారుల" మధ్య న్యాయంగా పంచిపెట్టబడేవి. అంగడిలోపల, చుట్టు పట్ల వుండే సుమారు ముప్పై మందికి ఆ ఏర్పాట్లు గురించి తెలిసి వున్నప్పటికి, వారిలో ఒక్కడు కూడా ఇతరులెవ్వరినీ, ఎన్నడు నిందించలేదు.

సాషా, బట్టలమిల్లు అధికారులు—హ్రస్వనేత్ర దృష్టిగల మార్కిపోర్ట్‌నాయ్‌తో సహా క్రమేణా స్నేహితులయ్యారు. తాను, తనవంటి ఇతరులు మిల్లు కంపెనీ శాఖవారికి అదనంగా చెల్లించు వేలాది రూబుళ్లు మిల్లు వున్నతోద్యోగులు అనేక మంది పంచుకుంటారని, అధికారులు వుద్యోగులలో ప్రతి ఒక్కరికి అదనపు ఆదాయంవచ్చే ఆధారం ఏదో వున్నదని సాషా తెలుసుకున్నాడు. వారిలో అధిక సంఖ్యాకులు—కొందరు సిద్ధాంతాలపట్ల విశ్వాసంవల్ల, ఇతరులు ఆవశ్యకత వల్ల—కమ్యూనిస్టు మతస్థులే. వారిని పార్టీ సంఘాలు, రాజకీయవాదులను ఒక కంట కనిపెట్టే రక్షకభటు శాఖ (M.G.B.) వారు విడువక పరీక్షిస్తూనే వుంటారు. ప్రభుత్వ శాసనాలను ధిక్కరించడం ఒక మినహాయింపుగా కాకుండా

నియమంగా పాటించే విచ్ఛిన్నకులే సోవియట్ సామాజిక వ్యవస్థలో బహుళ సంఖ్యాకులు.

రష్యన్ పారిశ్రామిక కార్మికుల జీవన ప్రమాణాలను పరికించినట్లైతే వారి స్థితిగతులు కూడా రమారమి పైన పేర్కొన్న ఉద్యోగస్థుల స్థితిగతులవలెనే వున్నట్లు వ్యక్త మౌతుంది. రష్యాలోని కార్మికుని సగటు నెలసరి జీతం ఒక జత కాలిజోళ్లను కొనుగొనుటకైనా చాలదు. సామాన్యమైన దుస్తులను కొనుటకు ఒక బాలిక కనీసం ఆరు వారాల వేతనాన్ని త్యాగంచేయవలసి వుంటుంది. కాని వ్యక్తిగత స్వల్ప ఆయవ్యయాలను కొన్ని సందర్భాలలో అధికం చేసి వారి ఆర్థిక పరిస్థితులను చక్కబరచే సాధనం ఒకటుంది. అదే పంచవర్ష ప్రణాళికల వెనుకప్రక్క కాన్పించే అక్రమ వ్యాపారప్రపంచం.

1916లో జరిగిన గలీషియా యుద్ధాల నాటినుంచి వికలాంగుడుగావున్న మార్టిన్‌మరావ్ జీవనభృతిని సంపాదించు కొనుటలో యిబ్బందులకు లోనుకావలసివచ్చింది. ఆతడు పని చేస్తూవుండే సబ్బుల ఫ్యాక్టరీ వారు యిచ్చే జీతం ఆతని కెన్నడూ సరిపోయేదికాదు. వృద్ధుడైనాడు. భార్య గతించింది. ఫ్యాక్టరీలోనికి వస్తూ పోతూ వుండే కార్మికులను శోధించడం మరావ్ ఉద్యోగధర్మం. కార్మికులు సబ్బులు తీసుకొని పోతున్నారేమో కనుగొనునిమిత్తం మరావ్ వారి జేబులను ఆయా సమయాలలో వెతుకవలసివుంది. కాని ప్రతిరోజూ వెతుకనక్కరలేదు. ప్రభుత్వ ఆస్థితో సహా

పట్టుబడతామనే భీతి నేరబుద్ధిగలవారిని వస్తువులను దొంగి లించుటనుంచి వారిస్తుంది, అనేది అధికార సూత్రం.

కాని అధికార సూత్రాలకన్న దుస్థితి బలీయమైనది. ఫ్యాక్టరీలో పని చేస్తున్న కుటుంబ యజమానులు, గృహిణులు, తమ దారిద్ర్యాన్ని కొంతైనా తగ్గించుకొనుటకుగాను భాగ్య వంతమైన, సర్వాధికార సమన్వితమైన సోవియట్ సమాఖ్యలో తృణమాత్రములను కొద్దిపాటి సబ్బుబిళ్లలను తాము ఎందుకు తీసుకొని పోరాదో అర్థం చేసుకోలేరు. ద్వారపాలకుడు మార్టిన్ షరావ్ కూడా వారిలో ఒకడు. మిగతా వారివలెనే ఆతడుకూడా పేద మానిసే. సబ్బులు తీసుకొని పోతున్నారేమోనని కార్మికులను తణిఖీచేయ వలసినదిగా ఆజ్ఞాపింపబడినపుడు; ఆతడు వారి జేబులలోనికి చేతులను పోనిచ్చి "మూడు, రెండు, నాలుగు, బిళ్లలు," అని లెఖ్కస్తూ వారిని మెల్లిగా బయటకు వదలివేస్తాడు.

కార్మికులుచేసే దొంగతనాల గురించి పై అధికారులకు ఫిర్యాదు చేయటానికి ఆతడు శ్రమ తీసుకోక పోయినట్లైతే సబ్బు ముక్కలను లెఖ్కించడంలోని అంతర్యం ఏమై ఉంటుందో. మరుసటిరోజు కార్మికులు తాము దొంగిలించిన వాటిలో సగభాగం మార్టిన్ (షరావ్) తెచ్చి యివ్వాలి. ఆ పంపకానికి సంబంధించిన లెఖ్కలు ఆతడు మనస్సులోనే గుణించుకుంటాడు. మార్టిన్ కార్మికుల పట్ల సరసంగా ప్రవర్తిస్తాడు, గనుక వారు ఆ వృద్ధునిపై దయచూపుతారు. ఆతనిని వంచించటానికి వారెన్నడూ ప్రయత్నించలేదు.

రష్యాలోని వందలాది ఫ్యాక్టరీల ద్వారాలవద్ద అట్టి విధానమే ఎంతో కాలంగా అమలులో ఉన్నది.

అక్రమ వ్యాపార బేరసారాలు అధికారులకు బాగుగా తెలిసినట్టివే వాటిని గురించి ఈ భూలోకంలో నివశించే వారందరికన్న ఎక్కువగా తెలిసినవారు సోవియట్ రక్షకభట శాఖవారే అయినప్పటికి దగ్గడం, చీదడం అంత తరచుగా వారు అట్టి వార్తలను ఖండిస్తారు. రాజకీయ నేరాల విషయంలో తప్ప, ఇతర సందర్భాలలో రక్షకభట శాఖవారు, అంత నిర్దయగా ప్రవర్తించరు.

సోవియట్ రాజ్యం, దాని అధినేత, లేక ఇతర సంస్థల పట్ల ఒక పౌరుని భక్తి విశ్వాసాలు శకింపబడినపుడు దయా దాక్షిణ్యాలకు ఆస్కారమే లేదు. పాఘసలుగాని, లంచాలు గాని ఆతని కొంతమాత్రం సహాయపడలేవు. ఒక రాజకీయ అనుమానితుడు పట్టుకొనబడవలసి ఉన్నపుడు ఏ అధికారి గాని, స్నేహితుడుగాని ఆతనిని ఆదరించరు. నిర్బంధనలకు బహిష్కారాలకు జారీ చేయబడే ఉత్తరువులను అధికారులను నిస్సంకోచంగా అమలుపరుస్తారు. తాను ఏ విధంగా విపరీత నిఘాకు గురికావింప బడుతున్నది, తన ఉద్యోగాన్ని, కడకు ప్రాణాన్ని రక్షించుకొనుటకు ఎంతటి కఠినతతోను, పట్టుదలతోను ప్రవర్తించవలసి ఉన్నది. సోవియట్ పోలీసు అధికారికి సువేద్యమే.

దొంగతనం, లంచగొండితనం, చీకటి వ్యాపారం హత్యలు వంటి రాజకీయేతర నేరాలు ఎన్నిటిపైననో M.V.D. శాఖ

క్రింద ఉద్యోగులకు ఇష్టానుసారం చర్యతీసుకొనే స్వేచ్ఛ వున్నది. కాని ట్రాట్‌స్కీ వాదం, విభిన్న దృక్పథవాదం, అమెరికన్ అనుకూలవాదం అనే నేరాలు ఆరోపింపబడ్డ వ్యక్తుల విషయంలో వారు అంత స్వేచ్ఛగా వర్తించలేరు. లంచాలు మరిగి కాఠిన్యతవ్రతను తగ్గించుకొని సంచరించడం రష్యన్ రక్షకభట దళాలవారి సాంప్రదాయం. అట్టి వారిలో M.V.D. శాఖ రక్షకభటుడు కడపటి స్థాయివాడు మాత్రమే. అతనిది మిక్కిలి పేదస్థితి. కాని సుఖంగా జీవించగోరుతాడు. అక్రమ వ్యాపారచర్యల అవశ్యకత ఆతనికి అవగతమే. ఆ రీతిగా ఏదో రెండు రూబుళ్లను అదనంగా సంపాదించుకొనే నిర్భాగ్యుల పట్ల కనికర భావమే కలిగి ఉంటాడు. కాని తన కుటుంబపోషణ భారాన్ని తేలిక చేయగల సర్వసమర్థులగు వ్యాపార సంస్థల నిర్వాహణాధికారుల పైన, శాఖాధిపతులపైన ఆతనికెంతో గౌరవం.

• ఆతడు ఒక గిడ్డంగిలోనికిగాని, అంగడిలోనికిగాని ప్రవేశించి చుట్టుప్రక్కల పరికించవచ్చు. వెంటనే మేనేజరు ఆతనిని తను కచ్చేరికి ఆహ్వానిస్తాడు. కుర్చీపై కూర్చొనమని కోరుతాడు. ఒక గ్లాసు బ్రాందీ (వోడ్కా) అందిస్తాడు. వ్యాపారంలో అక్రమాలు ఉన్నవని వారుభయులకు తెలిసి వుండుటవల్ల మేనేజరు ఎంతో మర్యాదగా ప్రవర్తిస్తాడు. ''కామ్రేడ్ పెట్రోవ్; నీవు కుటుంబీకుడవు కదా''; అని ఆ సంస్థ నిర్వాహణాధికారి దయతో విచారిస్తాడు. ''అవును కామ్రేడ్; భార్య, ఇద్దరు బిడ్డలు'' ''నీ భార్యకు

నాజూకైన కాలిజోళ్ల జత అవసరమా"? అని నిర్వహణాధికారి సూచిస్తాడు.

పెట్రోవ్ భార్యకు పాదరక్షల అవసరమెంతేనా వుంది. పై సూచన ఆతనికి సంతోషాన్నే కలిగిస్తుంది. కాని తాను బోనులోనికి శ్రేయబడుతున్నాడా అని అనుమానిస్తాడు. అది అక్రమ వ్యాపారానికి ప్రేరేపణకాదా? (ఆ పదం రష్యాలో ఎంత తరచుగా ఉపయోగింపబడుతుందో!) నిర్వాహణాధికారి చేసిన సూచనపట్ల ఉపేక్షాభావం కలిగినట్లు కనుపించ ప్రయత్నిస్తాడు. దానికి జవాబైనా ఇవ్వడు సరిగదా "గతవారం ఈ దుకాణంనుంచి రాత్రి పూట ఒక లారీ పోవడం నేను గమనించిన సంగతి మీకు తెలిసే ఉంటుంది, ఆ వస్తువులను మీరు నిజంగా ఎవ్వరికి విక్రయించారు?" అని మేనేజరును హడలు గొడతాడు.

ఒక గంట గడుస్తుంది. బ్రాందీ సంభాషణ గమనాన్ని మృదువు పరుస్తుంది. పరస్పరావసరాలేమో తెలుసుకోనబడతాయి. పాదరక్షల గిడ్డంగివద్ద శాంతి భద్రతలు నిరభ్యంతరంగా కొనసాగుతున్నాయని ఆ M.V.D. శాఖ ఉద్యోగి సంతృప్తి చెందుతాడు మరుసటి వారం ఆతని భార్యా, బిడ్డలు "మాస్కోలో ధరింపబడే రకం" కొత్త పాదరక్షలను సగర్వంగా ధరిస్తారు. ఆ బేరంతో సంబంధమున్న వారందరూ సుఖంగానే ఉంటారు.

దేశవ్యాప్తంగా అల్లుకొనివున్న అక్రమ వాణిజ్యం నైతిక పతనాన్ని కలుగజేస్తుందని, ఒక గొప్పజాతికి చెందిన

ప్రజలను అల్పులగు చోరుల, లంచగొండుల స్థాయికి దించి వేస్తుందని తోచవచ్చు. కాని ఆ ఊహ సమంజసమైనది కాదు. అక్రమ వ్యాపార కార్యకలాపాలలో పాల్గొన వెనుదీయనట్టి, లేక, అత్యావశ్యకత వత్తిడివల్ల అందుకు ఒడ బడునట్టి ఆ మనుష్యులే వారివ్యక్తిగత జీవితాలలో నిజా యితీ, మానవత్వం, సుహృద్భావం, కలవారుగా ఉంటారు. సోవియట్ పరిపాలనా కాలంలో రష్యన్ ప్రజా సామాన్యం యొక్క జాతీయ స్వభావంలో కొద్ది మాత్రపు మార్పు వచ్చింది; నిజమైన మిత్రుని పట్ల భక్తి విశ్వాసాలు అవసర మైనట్టైతే "తుదిచొక్కా" నైనా ఇచ్చివేయడం; స్త్రీ పురుషులమధ్య పవిత్రప్రేమ; మితభాషణ, అణకువ, ఈ మార్పుయొక్క లక్షణాలు.

ప్రస్తుతం రష్యన్ జీవిత విధానంలో నీతినియమాల విలువలను నిర్ణయించే రెండు కొలబద్దలు కలవనేది యదార్థ విషయం. వాణిజ్యమంతా ప్రభుత్వపరంగానే జరగాలి, దేశంలోని యావదాస్తి ప్రభుత్వానికే సంక్రమించాలి, అనే విధానాలను వ్యతిరేకిస్తూ ప్రజలు ఏకోన్ముఖంగా ప్రదర్శించే జనరంజకమైన వైఖరి; వ్యక్తికిమధ్య, స్త్రీకి, పురుషునికి మధ్య, ఉండే సంబంధ బాంధవ్యాలను నిర్ణయించే నైతిక విలువలు, (వాస్తవానికి "సనాతన" "పాశ్చాత్య" నైతిక నియమాలకు తుల్యమైనవి.) అండదండగా ఉండడం రష్యన్ జీవిత విధా నంలో గోచరిస్తుంది. ఏదోవిధంగా ఆ రెండు నైతిక విధా నాలు ఎట్టి సంఘర్షణా లేక ఒకదానిప్రక్క ఇంకొకటి జత

పడి ఉన్నాయి. వ్యక్తి ప్రభుత్వ ఆస్తిని వేలాది రూబుళ్లకు విక్రయిస్తాడు. వారం వారం శిక్షాస్మృతిని ధిక్కరిస్తాడు. అయినప్పటికీ తన చర్యలలోని మంచి చెడ్డల గురించి ఊహించనైనా ఊహించడు. రష్యన్ ప్రజాసామాన్యం నేడు ప్రభుత్వం భయంకరమైన, శక్తివంతమైన భూతంగాను, వ్యక్తి అల్పమైన దిక్కుమాలిన మానిసిగాను ఉన్నట్లు భావిస్తున్నారు. పౌరుడు శాసనరీత్యా నెరవేర్చవలసిన విధులు కొన్ని ఉన్నాయి. కాని ప్రభుత్వమనే నీటిరాకాసి పట్ల నిర్వహించవలసిన కర్తవ్యాలు తనపై ఉన్నవనే నైతిక భావనగాని, ఆంతరంగిక ప్రబోధంగాని, ఆతనికి కలుగవు.

అక్రమవ్యాపార నిరోధక చర్యలు జరిపే విషయంలో M. V. D. శాఖవారు ఒక విధమైన పథకాన్ని తయారు చేసుకుంటారు. ప్రతి ఇతర జాబితా వలెనే యీ పథకం కూడా తప్పక నెరవేర్చబడవలసి ఉన్నది. రష్యాలోని ప్రతి M. V. D. శాఖ కార్యలయం న్యాయస్థానం, దొంగ వ్యాపారానికి, ద్రవ్యాపహారణకు లంచగొండి తనానికి నిర్బంధింపబడ్డ, శిక్షింపబడ్డ నేరస్థుల నెలసరి సంఖ్యలను నివేదించవలసి ఉన్నది. మంత్రివర్గం మారు ఈ నివేదికలను పోల్చి చూస్తారు, వివరంగా పరిశీలిస్తారు. ఏండ్లతరబడి పొందిన అనుభవం క్రొత్తగా జారీచేయబడిన ఉత్తరువులు ఆధారంగా తీసుకొని "సాధారణ" నిర్బంధాల సంఖ్యగా ఒక అంకెను నిర్ణయిస్తారు. ముందుకాలానికి అదే "పథకం"గా ఎంచబడుతుంది. ఆ రీతిగా వివిధ తరగతుల నేరాలకు, చెడునడతలకుగాను జరుపవలసిన నిర్బంధాల

సంఖ్యలను నిర్ణయిస్తూ పథకం వెలువడుతుంది. ప్రతి న్యాయస్థానం దాని నిర్ణీత పథకాన్ని నెరవేర్చవలసి ఉంది. పథకంలో సూచింపబడిన నిర్బంధాల, శిక్షల సంఖ్యలను చేరుకొనలేక పోయినట్లైతే అది నేరముల తగ్గుదలకు కాక పోలీస్ చర్య పటుత్వ లోపమునకే చిహ్నమని, "కేంద్ర" అధిపతులు భావిస్తారు. స్థానికాధికారులకు చివాట్లు, వేతనాభివృద్ధుల నిలుపుదలలు తప్పవు. అందువల్లనే నేరమున్నా లేకపోయినా కేసులు బనాయించి నెలకింతమంది అని, రోజుకింతమంది అని, ప్రజలను నిర్బంధించడం జరుగుతోంది. ఆ విధంగా శిక్షలకు గురికావింపబడ్డ వారిలో అత్యధిక సంఖ్యాకులు, అసహాయులు, అమాయకులు, అనుభవహీనులు, పేదవారు, అయివుంటారు.

బెలోవ్ అక్క-చెల్లెండ్రు ముగ్గురిలో ఇద్దరు వరోనెజ్ లోని స్థానిక ఫ్యాక్టరీలో పనిచేసేవారు. ఫ్యాక్టరీనుంచి చాటుగా తెచ్చిన కొన్ని గజాల గుడ్డను రైనాక్ బజారుకు తీసుకొని పోతున్నప్పుడు త్రోవలో వారిని పోలీసులు అటకాయించారు. ఆ బాలికలు యిచ్చిన సమాధానాలు సహజంగానే అసంతృప్తికరంగా వుండడంవల్ల నిర్బంధింపబడ్డారు. వారి మూడవ సోదరి ఆ విషయం గురించి తెలుసుకొనగానే స్థానిక సోవియట్ లో పని చేస్తున్న ఆమె కాబోయే భర్త వద్దకు పరిగెత్తుకొని వెళ్లింది. ఆతడు తన చిరకాల మిత్రుడు, స్థానిక సైనిక దళానికి ముఖ్యాధికారి అయిన వాసియూవద్దకు పోయి "దయయుంచి ఆ బాలికలను

విడుదల చేయించు, అందువల్ల నీకెట్టి లోటు కలుగదు" అని అర్థించాడు.

"వీలులేదు; అధికలాభానికై వస్తువులను విక్రయించే వారిని నిర్బంధించే ఉద్యమం సందర్భంలో జూన్ మాసపు కోటా పూర్తిచేయబడిందో లేదో నా కింకా తెలియదు. అదిపూర్తి కానట్లైతే నేను వారిని విడిపించ సాధ్యపడక పోవచ్చు. అర్ధరాత్రివరకు నిరీక్షించు, లోటు భర్తీచేయవచ్చునేమో ప్రయత్నించి చూస్తాము," అని పోలీసు ముఖ్యాధికారి జవాబిచ్చాడు.

ఆ బాలికలు జైలులోనే వేచివున్నారు. అర్ధరాత్రివేళ వారి సోదరి వరుడు తిరిగి వచ్చాడు. "నీవు అదృష్టవంతుడవోయ్, పథకాన్ని మేము నూటికి 112 పాళ్లు హెచ్చుగానే నెరవేర్చాము" అని పోలీసు ముఖ్యాధికారి ఆతనికి అన అనుమోదం తెలియజేశాడు.

## నటన – నిజం

సామాజిక వ్యక్తిగత జీవితరంగాలలో ప్రభుత్వ ప్రాబల్యం క్రమేణా విస్తృతమవుతూ, వ్యక్తి హక్కులు సంకుచితమవుతూ కఠోరంగా కనుపించే సోవియట్ వ్యవస్థా పరిణామ ధోరణి మూడు దశాబ్దాలపై చిలుకు ఏక ధాటిగా కొనసాగింది. సర్వ సంపూర్ణాధికారాలు గల ప్రభుత్వాభివృద్ధే అతీగోచర మయింది. వ్యక్తి స్వత్వాలు ఒక్కటొక్కటే హరింపబడి ప్రభుత్వాధికారవరం చేయబడ్డాయి.

ఈ విధానం తొలుదొలుత రాజకీయరంగంలోను, ఆ పైన ఒకదాని తర్వాత నొక్కటిగా ఆర్థిక, విద్యా, తాత్విక రంగాలలోను ప్రవేశ పెట్టబడింది. నిర్బంధ సంస్కరణలు విస్తృతము, కఠినతరము కాజొచ్చాయి. పోలీసు రాజ్యం దినదినాభివృద్ధి చెందింది.

స్వల్ప కాలాలు—మహా అయితే కొన్నేసి మాసాల వరకు—సర్వాధికారాలు ప్రభుత్వ పరంచేసే యీ ధోరణి ఆపుజేయబడేది. 1921-వ సంవత్సరంలో ఉరిశిక్ష, భయానకమైన చెక్కా శిక్ష రద్దుపర్చబడ్డాయి. 1934 లో జి. పి. యుకు స్వస్తి చెప్పటం జరిగింది. 1939 లో పోలీసుశాఖ ప్రధానాధికారి నికోలైయ జోవ్ సంహరింపబడ్డాడు. అంతా చారిత్రక న్యాయాను గుణ్యమైనట్లుగా ప్రతి చిన్న విరామానంతరం పాతపద్ధతి తిరుగ తోడబడేది. సర్వ శక్తివంతమైన ప్రభుత్వం చిన్నవగు స్వతంత్ర ద్వీపాలపై బడి, ముక్కలు ముక్కలుచేసి ఒక్కొక్క దానినే కబళించివేసింది.

యుద్ధకాలంలో పార్టీ యంత్ర సముదాయమంతా పటిష్టం చేయబడి, నియామావళి కఠినతరం చేయబడింది. పార్టీ సరసన కొత్తదీ పెద్దదీ అయిన సైనిక యంత్రం నెలకొల్పబడింది. పాతకాలపువి, తక్కువ యింపైనవీ అయిన పార్టీ నాయకుల దుస్తులకు మారుగా మిల్టరీ నాయకుల యూనిఫారాలు వాడవలెనని నిర్దేశింపబడింది. వ్యవసాయ రంగంలోని కొల్ఖోజ్ విధానం తలక్రిందు చేయబడింది. యుద్ధకాలంలో శత్రువు ఆక్రమించిన భూములలోని అనేక కొల్ఖోజులు మటు మాయమయాయి. కొత్తగా లోబరచు

కున్న ప్రదేశాలలో వ్యక్తి నిర్వహిత వ్యవసాయ విధానమే అమలులో ఉండేది. సోవియట్ పత్రికలు, సంచికలు, సానుభూతితో పెట్టుబడిదారీ దేశాలను గూర్చి ప్రస్తావించేవి సోవియట్ బుద్ధి జీవులలో కానవచ్చే "అన్య" సిద్ధాంత ప్రభావాన్ని అప్పటికే కొంతమటుకు నిరాదరణకు గురి అయిన స్టాలినిజమ్ — మార్క్సిజమ్ సైరింపక తప్పిందిగాదు. మత బోధకు తిరిగి అవకాశ మీయబడుటతో అది జాతి జీవితంలో ప్రముఖపాత్ర నిర్వహించుటకు గల అవకాశములను వెదుక నారంభించింది. యుద్ధానంతర కాలంలో అతివిశ్వాస నీయంగా రాగలదని ఆశించిన పరిణామమే యీనాడు కలుగుచున్న మార్పని అనేకమంది విదేశీయులు భావించా రనడం కూడా ఏమంత ఆశ్చర్యకరమైన విషయంగాదు. చాలమంది రష్యనులు సైతం విదేశీయులవలెనే నూతన పరిణామాన్ని నిరీక్షించారు. ఈ మార్పులు తేబడిన కారణాలు సువిదితమే. అడుగునుంచి ఒకుమ్మడిగా వెలికి వచ్చే యీ ధోరణులను అంతమొందించాలని, లేకుంటే రష్యన్ కమ్యూనిజానికి క్షీణదశ తప్పక ఆసన్నమవటమే పర్యవసానమని సోవియట్ ప్రభుత్వం భావించింది. "నశింపు" అన్నదే దానికి యింకా ఖచ్చితమైన మాట. అందుకొరకే సోవియట్ అధికారులు యీ పరిణామాలను మొగ్గలోనే త్రుంచవలసి వచ్చింది.

1946–వ సంవత్సరం లగాయతు "పునరుద్ధరణ—పురోభి వృద్ధి" అనేది సంతత పల్లవి గానమయింది. రాజకీయ పరిభాషలోనికి దానిని తర్జుమాచేస్తే పూర్వ అంతరాలకు

పునః ప్రతిష్ట చేయటం, తద్వారా ఒక వినూత్న, ఉత్త మోత్తమ పరిణామాన్ని తిరిగి స్థాపించటం అని అర్థం. ఆర్థికాభివృద్ధి ప్రయోజనములకు సంబంధించి నంతమటుకు పార్టీయొక్క, ప్రభుత్వంయొక్క యితర కార్యకలాపాలను అవలంబించటమే దీని ఆచరణ సూత్రం. రాజకీయ వ్యవ హారాలు, శాస్త్రాలు, కళలు, సిద్ధాంత వాదాలు, యీ ఆచరణ సూత్రానికి లోబడినవే; నూతన అంతర్జాతీయ రంగాలలో కూడా పాతబడిపోయిన వైదేశిక విధాన ఆదర్శాలే ఉపయోగింపబడాలి. ప్రతి రంగమందు కంటికి కనుపించే పర్యవసానమల్లా, యుద్ధానికి ముందున్న వ్యవస్థను, అంటే పాతబడ్డ విధానాన్ని తిరుగతోడటమే. "ఈ పున రుద్ధరణ తుదకు మనలను ఒక ద్వితీయదశకు తోడ్కొని పోతుంది. అప్పుడు పూర్వ పరిమాణాలను గూడా అధిగ మించే నూతన విజయాలు సాధ్యపడతాయి". అనేదాని అనువృత్తి.

ప్రప్రథమంగా కోలుకోవలసినది పార్టీ. అందుకోసం శీఘ్రగతిని సభ్యులకు ఎన్నో కొత్త సూచనలు చేయబడ్డాయి. ఆ రీతిగా స్థానాలను పార్టీ తిరిగి పొందింది. యుద్ధంలో సాధించిన ఘన విజయాలనుగూర్చి బహుళ ప్రచారం చేయటంద్వారా యూత్‌లీగ్‌తో సహా పార్టీ సంఖ్యా బలాధిక్యతను వృద్ధిచేసుకోగల్గింది. "పార్టీ—ప్రభుత్వం" అనేది మళ్లీ ప్రామాణిక సూత్రమయింది.

దానితో యుద్ధానంతరకాళనలు ఆరంభించబడ్డాయి. నిర్బంధవిధానాలు బహుముఖాలుగా అమలు జరిగాయి.

కార్యనిర్వాహక శాఖోద్యోగులు, రాజకీయ నమ్మక ద్రోహులు, తొలగింపులకుగురి అయ్యారు. ఈ శుద్ధిక్రియలు, రక్త సహితంగాను, రక్త రహితంగాను, బహిరంగంగాను రహస్యంగాను, హంగామాతోనూ, చడీ చప్పుడుగాకుం డాను కూడాజరిగాయి. వాటి తాత్పర్యమెప్పుడూ ఒకటే: పార్టీయొక్క నిర్వివాద సర్వాధిపత్యాన్ని పునరుద్ధరించే ఆధారాలే యీ క్రియలు. మార్క్సిజమ్—స్టాలినిజమ్ యొక్క సిద్ధాంత ఆచరణ ఆయుధాలను తిరిగి సానపెట్టుటకు కూడా యీ తొలగింపులు ఉపకరించాయి. యుద్ధం సమాప్తం కాగానే ఆరంభమయిన యీ తొలగింపులు ఏవిధంగాను ఆపు చేయబడలేదు. సోవియట్ భూమిలో అంతర్ధానమైన రాజ కీయ జీవితానికి అయిదు సంవత్సరాల కాలం యీ చర్యలే ప్రత్యామ్నాయంగా ఆచరింపబడ్డాయి. శీఘ్రగతిని సైన్య పరిపాలన అంతమొందింపబడి సైన్యం అప్రధానం కావింప బడింది. కొందరు సైనికాధికారులు పదవులనుంచి అతి సునాయాసంగా తొలగింపబడ్డారు. మరికొందరు దూర రాష్ట్రాలకు బదిలీ చేయబడ్డారు. స్తుతి పాత్రులైన వీరులు కూడా వారి స్థానాలనుంచి అదృశ్యమైనారు. పోలీస్ విధా నానికి తిరిగి మెరుగు పెట్టబడింది. పశ్చిమార్ధగోళంలోను, ఉపగ్రహ దేశాలలోను అది కొత్త తళుకులతో అధిక విధులను సమకూర్చుకొంది.

1946-వ సంవత్సరం ఆకురాలుకాలంలో కొల్ఖోజ్ విధా నంలోని కఠిన నిబంధనలన్నింటికి పునరుద్ధరించుటకు వీలుగా న్యాయచట్టంకూడా అమలుజేయబడింది. దాని ప్రకారం

కర్షకుల స్వంత భూములు, యుద్ధకాలంలో యేమైనా విస్త రించి వుంటే, అవి పూర్వమందుండే సూక్ష్మాతి సూక్ష్మ స్థితికి తేబడతాయి. ప్రతి కర్షకుడు ఒక ఆవుకు మాత్రమే కామందు. అతను గుఱ్ఱాలను వుంచుకోరాదు. రెండేళ్ళ తర్వాత తూర్పు పోలెండు, బిస్సేరేబియా బాల్టిక్ స్టేట్సు వంటి నూతన ఆక్రమిత రాష్ట్రాలలో సాముదాయిక వ్యవ సాయ విధానం అమలులోకి తేబడింది.

స్థానిక ప్రభుత్వోద్యోగులు, ముఖ్యంగా యుద్ధకాలంలో జర్మను ఆక్రమిత ప్రదేశాలలో గల సిబ్బంది పరిశోధనలకు శోధనలకు లోనయ్యారు. 1945—47 లో యుక్రైన్‌లోని స్థానిక సోవియట్ల అధ్యక్షులు నూటికి డెబ్భై మంది వరకూ తొలగింపబడ్డం దానికి తార్కాణం. కేంద్ర స్థానిక సోవియట్‌ల కార్యదర్శులు నూటికి నలభైమంది పైబడి పద భ్రష్టులయూరు. ఆ కాలంలోనే దేశమంతటా కేంద్ర స్థానిక సోవియట్లకు యెన్నికలు జరుపబడ్డాయి. పార్టీ అదుపు ఆజ్ఞలలో జరిగే ఏకపక్ష యెన్నికలు, అనేక రాజకీయోద్య మాలు, విశేష జనసమూహాలను లేబరు కాంపులకు తరలించడం మొదలైన పార్టీపూర్వ సాంప్రదాయాలు తు. చ. తప్పకుండ అనుసరింపబడ్డాయి. యుద్ధానంతరం పునఃప్రాణ ప్రతిష్ఠ చేయబడ్డ యీ పై విధానాలు ప్రభు త్వానికి వారసత్వంగా వచ్చేవాడుకలక్షణాలు మాత్రమే.

పూర్వ పరిస్థితుల పునరుద్ధరణ కార్యక్రమం విజయవంత మైనదంటే యిదివరకట్టి స్థితిగతులన్నీ యెప్పటివలెనే మార్పు

లేకుండా యథాతథంగా ఉన్నాయని అర్థంగాదు. దానిలో తెలివిగా, సూక్ష్మబుద్ధితో పన్నిన పన్నాగాలనేకమున్నాయి. ఇదంతా వాస్తవికమైన మానసిక పరిణామంగా అభివర్ణిత మైంది. సామాజిక జీవితరంగాలన్నిటిలోను కొత్త పోకడలు కానవస్తున్నాయి. ఈ పుస్తకంలోని అనేక అధ్యాయాలలో ఆ ధోరణులు ప్రస్తావించబడ్డాయి. అయినప్పటికి సోవియట్ నాయకత్వం సిద్ధాంత, ఆచరణ రంగాలలో పాతకాలపు నియంతల ధోరణులను వర్జించునట్లుగా వాస్తవిక పరిణామంగాని, వ్యూహారచనలుగాని చేయలేక పోయాయి. దేశీయ అంతర్జాతీయ కార్యకలాపాలలో భరింపరాని యీ విధానాన్ని మితం చేయుటకుగాని, దానిలో యిమిడి ఉన్న కష్టనిష్ఠూరాలను తగ్గించడానికి నాయకు లెప్పుడూ యత్నించలేదు.

యుద్ధకాలంలోను, యుద్ధమైనాకను, జాతియొక్క చిత్త వృత్తి పార్టీ ధోరణులకు భిన్నమైనదిగా పైకి ప్రదర్శిత మవ జొచ్చింది. అందువల్ల దానిని అణగార్చటమే పార్టీ ప్రధానోద్దేశమయింది. అది నెరవేరాలంటే పార్టీ ఏమి చేయాలి?

రేడియో, చలనచిత్రాలద్వారా అంతులేని అభూత కల్పనలతో, అసభ్యస్థాయిని జరుపబడే సోవియటు ప్రచారం సర్వదా ఏవగింపు పుట్టించేదిగా ఉంటున్నది. దానిలో అనింద్యుడు నిర్దోషి అయిన పార్టీ "సమర్థసభ్యుని" సాహస కృత్యాలను, అతని సహధర్మిణిలేక కాబోయే గృహిణి

ఒనరించిన పరిశ్రమనుగూర్చి అంతులేనంతపొగడ్త వుంటుంది. అయితే ద్రోహి అయిన పూర్వ ధనికవర్గం వారి వంశస్థుడు అంతూదరీ లేని యాతనలకు గురిచేయ బడుతాడు. అతని దోషవివరాలను, శిక్షావివరాలను, విని సోవియట్ ప్రచారకులు మురిసిపోతారు. ఇందుకు భిన్నంగా విధేయులు దాసానుదాసులు అయినవారు తప్పనిసరిగా 'సుఖాంతం' అనే బహు కృతిని పొందుతారు.

ఏ నవలగాని, నాటికగాని సోవియట్ సామాన్యుని దుర్భరావస్థ, కష్టనిష్ఠూరాలు, దుస్థితి, యాతనలను యెరుకపర్చేది ఉండరాదు. రాజకీయ నాయకులను అధిక్షేపిస్తూ ఒక్క మాటైనా అనరాదు. పార్టీ, ప్రభుత్వ అవసరాలే సాహిత్యలక్ష్యం కావాలి. పార్టీలోని నూతన చైతన్యాన్ని ఉత్తేజపరచటం, సోవియట్ సూచనలను శ్రద్ధాసక్తులతో అమలు జరుపడం దాని విధి.

రష్యన్ ప్రేక్షకుడుగాని, శ్రోతగాని ఏదో కొంత యితరత్రా చూడాల్నని, వినాల్ననీ ఎంతో కాలంగా కుతూహల పడతాడు. సన్నిహితంగా అవగతం చేసుకొన్న 'విపరీత వాస్తవికత' అంటే యేవగించుకొంటాడు. ఇతరులందరివలెనే తనూ వస్తువులను వాటి నిజరూపాలలో గుర్తించగలగాలని కోరుతాడు. పై పెచ్చు ప్రపంచంలోని ఇతర సామాన్యప్రజల ఆకాంక్షల వంటివే అతని మానవాపేక్షలుకూడా మంచి కథా వస్తువు ఉత్తమకళా ఖండాలు మానవ స్వభావంలో ఉండే మంచిచెడ్డల రెంటినీ చిత్రించే వర్ణనలకోసం కళ్లు చిల్లులుపడేలా చూస్తాడు. నిష్కల్మష

మైన 'మంచి' క్షీణిస్తున్న 'చెడుగులు' చిత్రించే మొరటు తీరులు అతను నిరాశ చెందునంతగా విసిగిస్తాయి. జన జన్మలకూ సోవియట్ భూమి వద్దు వద్దనుకొంటూనే ఎంతో కాలంగా అతడు అక్కడే జీవయాత్రను సాగిస్తాడు. వాస్త వికతకోసం అతని వెదుకులాట బలీయమైనదీ, పట్టు సడ లనిదీగా ఉంటుంది.

"పరారీ" కావాలనే ఆకాంక్ష (యితర దేశాలలో దానికి వ్యతిరేకార్థం) అతనికి క్రొత్తదేంకాదు. అంతులేని సోవియట్ ప్రచార ఊబిలో కూరుకుపోయిన రష్యన్ సామాన్యుడు టాల్‌స్టాయ్, పుష్కిన్, టర్జినీవ్, చైకోవిస్కీ, గ్లింకా వాఙ్మయ రాజ్యాలలోనికి పరారయేవాడు. లభ్యయి నప్పుడల్లా విదేశసాహిత్య ప్రపంచంలోనికి (అనుకోనకుండా యుద్ధం కొన్నిటిని సమకూర్చింది.) పారిపోతాడు. కడకు యుద్ధానంతర కాలంలో సోవియట్ రచయితలు కొందరు కమ్యూనిష్టు గగనాలనుంచి భూవలయానికి దిగిరా సాహ సించారు. సామాజిక ఆవశ్యకతను చిత్రించే తమ వంతు పుస్తకాలను వ్రాయుటకు మారుగా అనుశృతంగా వచ్చే రచనావ్యాసంగాన్నే స్వీకరించారు. అణగారిన గొంతు కలతో సైతం సోవియట్ ప్రజా జీవనానికి సంబంధించిన యదార్థాలను కొన్నింటిని చెప్పనారంభించారు.

ఇందుకు పార్టీవారిమీద విరుచుకుపడింది. పార్టీ గీసిన గీతకు వారి కళాభావాలు అంతకంతకు దూరమాతున్న కొలది వారి విధికూడా అంతకంతకు అత్యంత బలీయం

కాజొచ్చింది. విఖ్యాత విమర్శకుడు మిఖేల్ జోష్ చెంకూపై చాల సంవత్సరాలవరకూ గ్రంథప్రచురణ చేయరాదనే ఆంక్ష విధించబడింది. అన్ని ప్రచురణాలయాలకు పత్రికలకు అతడు ప్రభుత్వ బ్లాక్ లిస్ట్‌లో ఉన్నట్లుగా ఉత్వర్వులు జారీ చేయబడ్డాయి. ఇతర ప్రముఖ రచయితలుగూడా తీవ్రంగాను బహిరంగంగాను పెనువిమర్శకు గురయ్యారు. 'ది బిగ్ లైఫ్' అనే వాస్తవిక చిత్రం నిర్మాతలపైన రచయితలపైన తీవ్రనేరాలు ఆరోపింపబడ్డాయి. ఆ చిత్రంలో "క్షతగాత్రులైన సైనికులు యుద్ధరంగంలోనే వదలివేయబడ్డారు", "గనిమనిషి భార్య వారిని అలక్ష్యం చేసింది"; "అశ్లీలులైన నిరంకుశాధికారి క్రింది ఉద్యోగులుగా లేవయస్కురాండ్రైన కన్యలు నియమింపబడ్డారు"; అనునవి చిత్రంలోని దోషాలకు ఉదాహరణాలు. నిపుణుల సంఘం ఆ చిత్రంలోని పాటలు శోకప్రధానంగా ఉన్నవని వ్యాఖ్యానించింది. పార్టీ సంతతానంద, నిత్యోల్లాస సిద్ధాంతాలకు అవి భిన్నంగా ఉండడమే ఆ విమర్శకు కారణం. "బెకెటోవ్స్ కెరియర్" రచయిత, ఎ. నాఫ్రెనోవ్ ఒక పారిశ్రామిక కేంద్రంలో పార్టీయొక్క నిర్మాణాత్మక కృషిని చిత్రించలేకపోయిన కారణానికి తెగనాటబడ్డాడు. అట్టి భావాలనే తన నవల "ది డే స్టార్ట్స్ ఇన్ ది యీస్ట్"లో జొప్పించినందుకు దాని రచయిత ఎలగ్జి చరకాసోవ్ నిందితుడయ్యాడు. ఆ రచన సహింపరానంత దోష భూయిష్టంగా వుంది. పార్టీయొక్క సృజనాత్మక విధానక్రమంగాని, స్టాకోనోవైట్లుగాని అందులో కాన్పించకపోవటమే ఆ దోషాలు.

కేంద్ర కమిటీ ఒక ప్రత్యేక రూలింగులో అనేక మంది నాటక కర్తలు సోవియట్ పౌరుని గుణగణాలను, స్వభావాలను చిత్రించనేలేదని గద్దించింది. సమర్థుడు, సుప్రసిద్ధుడును అయిన వేలెంటిన్ కటయవ్ తన నవల 'ఫర్ ది సోవియట్ పవర్'ను ఇటీవలనే ప్రచురించాడు. యుద్ధ కాలంలో జర్మన్ అధీన ప్రప్రచ్ఛన్నంగా సంచరిస్తున్న కమ్యూనిష్టు వర్గంయొక్క కార్యదర్శిని నిశ్చలతకు, విజయంలోగల దృఢ విశ్వాసానికి చిహ్నంగా వర్ణించనందుకుగాను ఆయన అనేక దూషణలకు గురి అయ్యాడు. విదేశ నాటకములవల్ల కలిగే హానిని ఎత్తిచూపడం మరువరాని మరో విషయం "అమెరికన్ యింగ్లీషు నాటకములు" సోవియట్ సమాజ లక్షణాలను వ్యతిరేకమైన దృక్పథంతో ప్రజల మనస్సులను విషమయం చేస్తాయి. అని విమర్శించబడుతూంది.

'పార్టీయినాస్ట్' అనేది పార్టీయొక్క ప్రతినాదం. దానికి ఖచ్చితమైన తర్జుమా యీయటం కష్టం. పార్టీభావం పార్టీయందు విధేయత పార్టీయొక్క ఉత్తరువులను ప్రశ్నించకుండా శిరసావహించటమే ఆ మాటకు తాత్పర్యం. పార్టీసభ్యుడు కానట్టి వ్యక్తియొక్క లక్షణాలకు భిన్నమైనవే పార్టీయినాస్ట్ లక్షణాలు ప్రజాసైన్యం కూడదనటయే పార్టీయినాస్ట్, వ్యక్తి జీవితంలోకళలూ, శాస్త్రాలు పార్టీ ఆశయాల ప్రతిబింబాలు కావటమే పార్టీయినాస్ట్ ఆదర్శవాదం నశించుగాక, పార్టీయినాస్ట్ వర్థిల్లుగాక, పార్టీయినాస్ట్‌ను తు. చ. తప్పకుండా అంగీకరించని కమ్యూనిష్టు శాస్త్రజ్ఞులపై ధర్మయుద్ధం ప్రకటించ

బడింది. ఆర్థిక శాస్త్రజ్ఞులలో అగ్రగణ్యుడైన యుగేన్ వర్గాపై దోషారోపణ చేయబడి దిగువస్థాయికి తగ్గింపబడ్డాడు. యుద్ధకాలంలో పాశ్చాత్య దేశాలకు అనుకూలంగా రచించిన ఒక పుస్తకంలో (కాని తరువాతనే అది ప్రచురించబడింది) అమెరికా ఆర్థిక స్థితిలోగల సుస్థిర స్వభావాలను బయలు పర్చటమే అతడు చేసిన తప్పిదం. 'తత్త్వశాస్త్ర చరిత్ర' వ్రాసిన కారణానికి ఉత్తమశ్రేణిరచయిత జార్జిఅలగ్జాండ్రోవ్ అమితదోషణకు గురి అయ్యాడు. భౌతికవాదానికి భిన్నంగా వేదాంతభావాలను ప్రతిష్టించటంలో ఆదర్శవాదాన్ని ఆసరా చేసుకోవడమే అతని దోషం. "జగద్బంధువాదం" చాల మంది సోవియట్ శాస్త్రజ్ఞులకు, విధేయులగు కమ్యూనిష్టులకు ఇంకెందరనో వ్యతిరేకంగా నిందాపూర్వకమైన సాక్ష్యాన్ని సమకూర్చింది. పత్రికా సంపాదకవర్గాలు తొలగింపబడ్డాయి. క్రొత్తవారు అధికారంలోనికి వచ్చారు. వారి రోజు వచ్చేసరికి వారుకూడా అదృశ్యమయ్యారు.

పార్టీయినాష్ట్ అన్న పదంతోపాటు అవశ్యకర్తవ్యం అనే మరోపదంకూడా అధికారపలుకుబడి సంపాదించుకుంది. అవశ్యకర్తవ్యం పార్టీయినాష్ట్ అనుదానితోబాటు అవశ్యకర్తవ్యం అను ఏవ్యక్తి కానీయండి, యేవిషయం కానీయండి. ప్రతీదీపార్టీ కేంద్రకమిటీ రాజకీయవిధానానికి లోబడే వుండాలి. అన్ని కళారంగాలలోను దానిదే సర్వజ్ఞత దానికే సర్వాధికారాలు తానెప్పుడూ తప్పుచేయదు. అదే హక్కుతో నాటకభాగం, పద్యభాగం, సంగీతంలోని మంచి

చెడ్డలు, వంశపారంపర్య సిద్ధాంతంలోని నిజానిజాలు, ప్రామాణిక, అప్రామాణిక తత్వ శాస్త్ర విషయాలు, అన్నింటా తనదే పై చేయి తన నిర్ణయమే శిరోధార్యం.

యుద్ధకాల సంస్కరణల తర్వాత అమలు పరచిన "పునరుద్ధరణ — పురోభివృద్ధి" విధానానికి ఎరగాని కొన్నింటిలో గ్రీకు సనాతన చర్చి ఒకటి. వైదేశిక విధానంలోని లోసుగులే యీ మినహాయింపుకు ప్రధానకారణం. ఉపగ్రహ దేశాలలో వాటికన్‌కు వ్యతిరేకంగా జరిగే యుద్ధంకూడా ప్రధానకారణాలలో వొకటే. వాస్తవానికి అనేక చర్చిలు తెరవబడ్డాయి. వాటిలోని ఉద్యోగాలు శాసనబద్ధం చేయబడ్డాయి మతప్రబోధనలను సోవియట్ పౌరులు వింటున్నారు. ఒక ప్రక్కనుంచి యిలాసహనం వహిస్తూనే మరొక ప్రక్కనుంచి సహింపరాని నిర్బంధాలను సిద్ధాంతభాగం పై విధించటం జరిగింది. ఇది ముఖ్యంగా తత్త్వశాస్త్రానికి, భౌతిక వాదాన్ని ముడివేయటం, జీవ పరిణామవాదంలోనికి అపభ్రంశాలను చొరనీయటంద్వారా సాధించబడింది. ఈ విధంగా యుద్ధానంతరం సిద్ధాంత ప్రకరణపై జరిగిన ధర్మ యుద్ధంలో జీవశాస్త్రం, తత్త్వశాస్త్రం ప్రాధాన్యతను పొందాయి. పోలిట్ బూరో సభ్యుడయిన యాండ్రీఝుడనోవ్ అట్టి విషయాలలో సర్వకంటకుడుగా చనిపోవు పర్యంతం సంచరించాడు. నవలారచయితల, నాటకకర్తల, సాహిత్య విమర్శకుల, చలనచిత్ర నిర్మాతల, స్క్రిప్ట్ రచయితల శోధన కార్యకలాపాలను ఆయనే నిర్వహించేవాడు. వినమ్రులు

గాని వేదాంతులపై దాడిని నడిపించినవాడితడే. ఇతర రంగాలలో అతని సహాయకులు ప్రక్షాళనోద్యమ బాధ్యతను నిర్వహించారు. ఈ ఉద్యమం సామాజిక శాస్త్రజ్ఞులు, చరిత్రకారులు, ఆర్థిక శాస్త్రజ్ఞులలో ఉండే వ్యతిరేకభావాన్ని చీల్చి చెండాడింది. ఝుడనోవ్ తర్వాత జీవశాస్త్రరంగంలో ప్రక్షాళనక్రియలు ఉధృతమయ్యాయి. ఆ వెనువెంటనే మానసిక, శారీరక వైద్యశాస్త్రజ్ఞులమీద పార్టీవిరుచుకు పడింది.

చరిత్ర, ఆర్థిక శాస్త్రం, సామాజిక శాస్త్రం, తదితరబోధనా శాస్త్రాలు ప్రక్షాళనకు లోనయ్యాయి. ఈ శతాబ్దం మూడవ దశాబ్దపు మొదటి పాదంలో ఒక నిర్దిష్ట సిద్ధాంత స్వరూపం రూపొందించబడింది. రెండవ దశాబ్దపు ఆసాంతంలో వర్తమాన రాజకీయ కార్యకలాపాలతో కించత్ సంబంధంగల తత్త్వశాస్త్రంమీద దండయాత్ర జరిగింది. తర్వాత దశాబ్దపు మొదటి సంవత్సరాలలో మార్క్సిస్ట్ ఆదర్శవాదాన్ని తుదముట్టించటంతో అప్పటికే వ్యక్తిత్వాన్ని కోల్పోయిన తత్త్వశాస్త్రజ్ఞులకు నిలువ నీడలేకుండా పోయింది. పద్యభాగంతో సహా సృజనాత్మకరచనా రంగంలో పార్టీచేసిన బ్రహ్మప్రయత్నాలకు వ్యతిరేకంగా అనేక మరుత్రోవలు పదే పదే ఏర్పడ్డాయి. అయితేనేం యిదికూడా యుద్ధారంభంనాటికి మిగిలిన వాటితోబాటే అయింది.

అయినప్పటికి ఏరివేతగాలి సోకని సువిశాల క్షేత్రమల్లా ప్రకృతి శాస్త్రరంగ మొక్కటే. అత్యవసర జరూరుపనులలో

నియోగింప బడటంచేత అందులోని పనివారల విషయంలో నియమాలను కొంతమటుకు సడలించవలసివచ్చింది. ఆ కారణాన ప్రకృతి శాస్త్రం ఎంతో మందికి ఆత్మరక్షణకు దోహదమిచ్చింది. శాస్త్రసంస్కరణలకు సామాజిక ఆవశ్యకతా సిద్ధాంతంయొక్క వైపరీత్యానికి వ్యతిరేకంగా వేలాది విద్యార్థులు సమర్థులగు అధ్యాపకులు ఈ విజ్ఞానరంగాలలో తలలు దాచుకొనేవారు. లేబరేటరీలోను షాపులలోను, హాస్పిటల్సులోను ఉండేవారికి కొంత ఊపిరాడేది. సహజంగా మానవశాస్త్రాలలో పరిజ్ఞానం గలవారు. చాలమంది పార్టీలో సభ్యులుగా ఉండేవారు. ప్రకృతిశాస్త్ర పరిజ్ఞానం గల పార్టీ సభ్యులు చాలా తక్కువ.

కాని యుద్ధానంతరకాలంలో ఈ శాస్త్ర శాఖలు కూడా కమ్యూనిస్టు దాడికి గురి అయినవి. ఆ రీతిగా సిద్ధాంత, ఆదర్శ శాస్త్ర రంగాలన్నింటిలోను తొలగన క్రియలు విశేష వినాశకర విజయాలను సాధించాయి.

యుద్ధానంతర తొలగనలు అద్భుత బహిరంగ ప్రదర్శనాల ద్వారా జరిగేవి 'ఎకాడమి ఆఫ్ సైన్సెస్' యీ ప్రదర్శనలకు రంగస్థలంగా ఉపయోగపడేది. అక్కడ రచయితల సంఘాల సమావేశాలు, శాస్త్రవేత్తల సభలు జరిగేవి. ప్రదర్శనా క్రమం యెప్పుడూ ఒకేరీతిగా ఉంటుంది. ప్రదర్శనారంభంలో పార్టీ పూర్ణ విశ్వాసాన్ని—కనీసం ఆక్షణానికైనా—చూరగొన్న వ్యక్తి తొలి నివేదికను చదువుతాడు. నివేదిక నుంచి, నూతనంగా అవలంబించబోయే విధానాన్ని, పెద

దారి బట్టిన వారి పేర్లను చదివి, వారిని తూర్పార బడతాడు. నిందితుడు శాస్త్రీయ, క్రిమినల్ తప్పిదాలను అంగీకరిస్తాడు. అనేక సంవత్సరాలుగా తాను పెడదారి పట్టినట్లు ఒప్పుకొంటాడు. తన బహిరంగ అంగీకారంలో ఆత్మ దూషణను, నిర్వాహకులకు సంతృప్తి కలిగేటంతలా, చేసుకొనలేక పోయినట్లైతే అతడు విశ్వాస హీనుడుగా గణింపబడి, క్రొత్త తప్పిదానికి పునః ప్రాయశ్చిత్తం చేసుకొనవలసి ఉంటుంది. ఒక వంక ఈ తతంగాలు, జరుగుతూ ఉంటే ఇంకొక ప్రక్క తొలి నివేదికలోని ఆదర్శాలు చట్టబద్ధం చేయబడతాయి. సర్వ జనాంగీకారమనే తంతు తర్వాత సోవియట్ యూనియన్ అంతలో అమలు జరుపబడుతాయి.

## ఆవర్గా జ

"పునరుద్ధరణ — పురోభివృద్ధి" పథకాలు వివిధ రంగాలలో విజయవంతమైనాయి. స్థూలదృష్ట్యా అవి దేశ భవిష్యత్తును నిర్ణయించేవిగా కనిపించవచ్చు. రక్షకభట దళాలు, పారిశ్రామికోత్పత్తి, పార్టీ క్రమశిక్షణ, సోవియట్ ప్రజలలో ఒదుగుబాటుతనం, వాటిలో యిమిడి వున్నాయి.

పునరుద్ధరణ కార్యక్రమం రాజకీయ విధానం అమలు పరచుటలో యెక్కువగా ఉపయోగపడింది. నేటివలె మున్నెన్నడూ సోవియట్ దేశము యేకేకృత కంట్రోల్ విధానంలో పరిపూర్ణ స్థాయి చేరుకోలేదు. ప్రపంచ చరిత్రలోనే నిరంకుశ ప్రభుత్వాలను గురించి వింటున్నాము.

కాని యే యితరదేశం గూడ యెన్నడూ ప్రస్తుత కాలంలో సోవియట్ దేశం చెలాయిస్తున్న నిరంకుశాధికారాన్ని అమలుజరిపి వుండలేదు. నిశ్చితమైన పనిని దేనినో నెర వేర్చుటకు సంతతం సంసిద్ధమై ఉండడమే నిరంకుశ ప్రభుత్వం యొక్క లక్ష్యమైనట్లయితే నేడు సోవియట్ సమాఖ్య సన్నద్ధత అనే గోపురము యొక్క శిఖరభాగాన నిలబడి ఉన్నదని చెప్పవచ్చు.

విదేశ కార్యకలాపాలలో గూడ "పునరుద్ధరణ—పురోభి వృద్ధి" విధానం గమనింప తగ్గ విషయాలను చేకూర్చింది. 1941-వ సంవత్సరంనాటి సోవియట్ సమాఖ్య సరిహద్దుల పునరుద్ధరణ యుద్ధం సమాప్త మయ్యేసరికి సాధించబడింది. నాటినుంచి సోవియట్ ప్రభుత్వం తరువాతి ఉన్నత ఘట్టాన్ని క్లుప్తంగా చెప్పాలి. అంటే ఆ దేశం సామ్రాజ్యంగా పెరిగిందని, ఆ సామ్రాజ్యం విస్తరిస్తోందని చెప్పవలసి వుంది. భయంకరమైన నూతన ప్రమాణం ఒకటి యేర్పాటు చేయబడింది. 80 కోట్ల జనాభాతో కూడుకొనివున్న ఒక సామ్రాజ్యవాద వ్యవస్థ చరిత్రలో ఉదహరింపబడ్డవియే యితర సామ్రాజ్యం కన్నను విశాలమైనది స్థాపించబడింది. ఆదర్శాలనుంచి విస్తరణ ధోరణులు జనించాయి. వాటి ఫలితమైన సామ్రాజ్య విస్తరణ తిరిగి నూతన సరిహద్దు సమస్యలకు, ఉద్యమాలకు కొత్తవైన ప్రపంచ విజయా కాంక్షలకు, కర్తవ్యాలకు దారి తీసింది.

"పునరుద్ధరణ—పురోభివృద్ధి" సూత్రం అంతర్జాతీయ కమ్యూనిస్టు సంస్థకుగూడ అనువర్తించబడింది. వాస్తవానికి

కోమిన్ ఫారన్ రద్దు కాలేదు. యుద్ధాత్పూర్వముకంటె కూడ యిప్పుడు అది సోవియట్ చెప్పుచేతలలో యెక్కువగా ఒదిగి వుంది. "ఉపగ్రహ దేశ కమ్యూనిష్టు పార్టీలను బల వంత పెట్టి మాస్కో అధికారానికి తలవొగ్గునట్లు చేయటం, నూతన సామ్రాజ్యవాద పద్ధతిలో తన వలుకుబడి చెల్లుబడి అయే దేశాలను అర్థికంగా దోచుకోవటం" అనే బహిరంగ విధానానికి అధికార ముద్ర వేసి అనుమతినీయటమే అంత ర్జాతీయ కమ్యూనిష్టు సంస్థయొక్క కర్తవ్యం. సంభవించదగు పోరాటాలకోసం అనేక సంవత్సరాలుగా కోమెన్ ఫారన్ సన్నద్ధం చేయబడింది. క్రెమ్లిన్ స్టాక్‌హోం శాంతి ఉద్యమంవంటి ప్రచ్ఛన్న కమ్యూనిష్టు ఉద్యమాలు యితర కమ్యూనిష్టు అనుకూల ఉద్యమాలు ప్రారంభించ నుద్దే శించినపుడు 'కోమెంఫారన్'ను తనలో లీనం చేసుకుంటుంది.

సోవియట్ ఆర్థిక లక్ష్యాలను సాధించుటలో "పునరు ద్ధరణ—పురోభివృద్ధి" సూత్రం విజయవంతమైంది. యుద్ధా త్పూర్వపు ఆర్థిక విధానానికి పునఃప్రతిష్ట చేయబడి కొత్త ప్రదేశాలకు వ్యాప్తం చేయబడింది. పారిశ్రామికం చేయు టలో యుద్ధ పరిశ్రమలకు ప్రధానస్థానమిచ్చే విధానం తిరిగి దేశానికి ఉత్తమ న్యాయమైంది. ఉత్పత్తి 1940 నాటి ప్రమాణానికి తేబడటం దానిని అధిగమించటంకూడా జరి గింది. శ్రామికులు, ఉద్యోగులు యిదివరకట్టి స్థానాల లోనే ఉన్నారు. ఉద్యోగాలనుండి విరమించుటగాని మార్పిడి చేసుకొనుటగాని వారికి సాధ్యపడదు. 1950 సంస్క రణల తర్వాత కాల్‌ఖోజ్ విధానం యిదివరలో యెన్నడూ

లేనంత కట్టుదిట్టంగా పునర్నిర్మించబడి కట్టుదిట్టం చేయబడింది. విపరీత సైనికవ్యయం ముఖ్యాంశంగాగల బడ్జటు పునః అమలు చేయబడింది. కొనుగోలుదారుపై అధిక సుంకాలను విధించటంద్వారా సైనికవ్యయం భర్తీ చేయబడింది. పారిశ్రామిక రంగాలు, కాల్వల నిర్మాణం, దేశ రక్షణకు ఉపకరించే విలువగు ఖనిజాల సంగ్రహణ, కలప సేకరణ మొదలగు వివిధ రంగాలలో వెట్టి చాకిరీ పెచ్చు పెరిగింది. సర్వ వ్యాప్తంగా వున్న అక్రమ వ్యాపారం ఆచరణలో దాని వివిధ విధానాలద్వారా ఆర్థిక రంగంలో సామ్రాజ్యవాదుల దార్ఢ్యంను అదుపులో ఉంచుటకు ఉపయోగపడింది.

“సామ్యవాదదేశం” యొక్క సామాజిక స్వరూపంలోని వర్గసహిత సమాజంలోని ప్రతి అంతస్థు పునర్నిర్మాణం చేయబడింది. ఈ పరిణామానికి మానసిక అవరోధాలు తొలగించబడ్డాయి. పాతకాలపు కమ్యూనిష్టు సిద్ధాంతాలన్నీ తుడిచిపెట్టబడ్డాయి. విధేయులై యున్నంతకాలం ముఖ్యంగా పై అంతస్థులవారికి భద్రతరక్షణ వుంటాయి. ధనవంతులు మరీ ధనవంతులగుటకు అదే కారణం.

వాస్తవిక నిష్పాక్షిక దృష్టితో చూస్తే యిదే నలుగురికీ కనుపించే సోవియట్ ప్రభుత్వం! దానిని యథాతథంగా గ్రహించటం తప్పిదం!

ఉపరితలంనుంచి ఒక అంగుళం క్రిందికిపోతే కమ్యూనిష్టు ప్రభుత్వ అంతరాళంలోని కుళ్లు కన్పించటం ప్రారంభ

పోతుంది. ఇక్కడే మూడు దశాబ్దాల దుర్భర క్రౌర్యానికి గురి అయిన ప్రజాసామాన్యం ఉంటుంది.

అలసిసొలసి నిస్పృహచెంది మూగపోయాయి వారి జీవితాలు. వారి సంశయవాదం ఒక జీవిత విధానంగా ధృవపడింది. పైకి సరిపెట్టుకున్నట్లు కనిపిస్తారు. వారి నాయకుల సిద్ధాంతోపదేశాలను అనుసరించాలి కనుక మాటలలో మాత్రం అలాగే చేస్తారు. వారు మోసపోనంత తెలివి గలవారయినా యెదిరించే స్థితిలో లేరు. ఎక్కడనుంచైనా సహాయం వస్తుందేమోనని వేచివుంటారు. కనీసం "విమోచనకాని" దేశాలనుంచైనా సహాయ చిహ్నాలు కానవస్తాయేమోనని నిరీక్షిస్తారు. వారికి నిర్ణీత కార్యక్రమం, నిర్దిష్ట కార్యాచరణ ప్రణాలిక, ఉండవు. దశాబ్దాల తరబడి అరాజకంనుంచి కార్యంనుంచి కొంత విముక్తికోసం అత్యంత ఆత్రంతో ఉంటారు. వారిదేశంలో మానవమర్యాదలకు అనేకసార్లు భంగం వాటిల్లింది. అందుకే ఆ జాతి న్యాయం కోసం హక్కుకోసం దేవులాడుతోంది. సామాన్య మానవునకు—ప్రభుత్వం గుర్తించిన వీరుడు మానవాతీతుడు కాని వానికి—మర్యాదగా జీవించగల సాధారణ పరిస్థితులు అందరాని ఫలమైపోయాయి.

అక్కడ జాతులమధ్య వ్యత్యాసాలున్నాయి. ఇన్ని వ్యత్యాసాలున్నా సామాన్య రష్యన్ పేరునకు—కమ్యూనిష్టులలో అధిక సంఖ్యాకులకు—ఇతర నాగరిక దేశాలలోని సామాన్య మానవునకు మధ్య అనేక సామ్యాలున్నాయి.

ఆశయ అభిలాషలలో యిరువురకు యెన్నో పోలికలున్నాయి. అతనిలో రక్త మాంసాలున్నాయి. కడగండ్లలో అతని కండ కరగిపోయింది. అతని నెత్తురు చిందిపోయింది. కమ్యూనిష్టుల మిథ్యావాదాన్ని అంగీకరించి రహస్యంగానూ చాకచక్యంగాను దానిని వ్యాపింపజేయుటమే వారికి మనం చేయవలసిన ఉత్తమసేవ. అంతా మీదేనని చెప్పి యేమి చేసినా వారు సహిస్తారు. వారి వెనుకబడివుండుటమే కమ్యూనిష్టు పంథాకు దారితీసింది. వారి జీవన పరిస్థితులలో కమ్యూనిష్టు ప్రచార ప్రాబల్యమును మినహాయిస్తే మనము ఏది కోరుతున్నామో వారు కోరేది అదే. దానిని కమ్యూనిష్టులు వారికి ఒనగూర్చలేదు. ఒనగూర్చజాలరు.

PRINTED AT THE DIOCESAN PRESS, MADRAS—1953. A7492